# అపరాధ పరిశోధన

రు. 4·50 | జనవరి '81 |

## సప్లిమెంట్



11-12-80

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## హత్యల నోటుబుక్కు

రచన: వసుంధర

## అరబ్బీ అల్లుడు

రచన: వాణిశ్రీ

## ఉరితీసిన శవం

రచన: సికిందర్

## ఫోన్‌కాల్

రచన: టెంపోరావ్

పొగమంచు—పదమూడవభాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—85
జనవరి, 1981
వెల: రు. 4-50
ఏడాది చందా 55 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. పీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# హత్యల నోటుబుక్కు!

## వసుంధర

"రంగారావు నెవరో చంపేశారట చూద్దాం వస్తావా?" అన్నాడు పుండరీ.

"నేనురాను. శవాల్ని చూడలేను నేను—" అన్నాడు వాసు.

పుండరీ వాసును నొక్కించలేదు. వాసు సంగతి పుండరీకి చిన్నప్పట్నించీ తెలుసు.

వాసుది మెత్తటి మనసు. ఎవరికే కష్టం కలిగినా చూడలేడు. జబ్బుల గురించీ, గాయాల గురించీ, అయితే వినను కూడా వినలేడు. అటువంటి చర్చలు వచ్చినపుడతనికి కళ్ళు తిరుగుతాయి. అవతలి వాళ్ళను ఆపివేయమనైనా కోరతాడు. లేదా తనే అక్కణ్ణించి లేచి వెళ్ళిపోతాడు.

వాసుతో కాస్త పరిచయమున్న ప్రతి ఒక్కరూ అతడు మంచివాడనీ, అతిమంచివాడనీ అంటారు.

వాసుకున్న ఈ మన స్తత్వంవల్ల అతడికి చాలా నష్టాలున్నాయి. ఒక పర్యాయం అతడి చేయి తెగితే ఆరక్తం

చూసి మూర్ఛపోయాడు. ఎవరో డాక్టరు దగ్గరకు తీసు కెళ్ళాల్సివచ్చింది. తీరా చూస్తే అదంత ప్రమాదకరమైన దెబ్బకాదు.

అంతేకాదు. ఇంట్లోకి తేలు, పాములాంటి వేమైనా వస్తే అతడు వాటిని కొట్టలేడు. తను కొడితే అవి గిలగిలా తన్నుకుని ఎలా బాధపడతాయో ఊహించుకుని అతడు ముందే వణికిపోతాడు. ఆఖరి కతను ఈగ, దోమ, చీమ, పేనులాంటి వాటిని కూడా చంపలేడు. ఎటొచ్చీ అందు వల్ల ఎవరికీ నష్టంలేదు.

ఇటువంటి వాసు హత్య చేయబడ్డ మనుషుల నెలా చూడగలడు? అసలు హత్యెలా జరిగిందీ ఎవరైనా వివరించి చెబుతుంటేనే అతను వినలేడు!

రంగారావు హత్య ఊళ్లో పెద్ద సంచలనం కలిగించింది. కారణం—రంగారావు పరమ దుర్మార్గుడు! అతన్ని చంపా లని చాలామంది అనుకున్నారు. చాలామందికి దమ్ముల్లేక పోయాయి. దమ్ములున్నవాళ్ళలో కొందరు పులుసులోకి దుమ్ముల్లేకుండా చితగ్గొట్టబడ్డాడు. మిగతావాళ్ళు జైలుకి పోయారు.

రంగారావు దుర్మార్గుడేకాదు. చాలామంది దుర్మా ర్గులకులాగే పలుకుబడి ఉన్నవాడు కూడా.

రంగారావు గాంబ్లింగ్ హౌసెస్ నడుపుతాడంటారు. సినిమాహాళ్ళదగ్గర మనుషుల్ని పెట్టి బ్లాకులో టికెట్లమ్మి స్తాడంటారు. ఇవి అతడు రహస్యంగా చేసే పనులు. అయితే అతను పబ్లిగ్గా చేసేపనులు కొన్నున్నాయి. ఒకటి తాగడం. రెండు నచ్చిన ఆడపిల్లని ఎత్తుకుపోయి అనుభవించి వది లెయ్యడం.

ఒకసారి అనుభవించబడి వదిలేయబడినట్లు పోలీస్

స్టేషన్‌కు వెళ్ళి చెప్పుకునే ఆడపిల్లలీదేశంలో ఉండరు. వాళ్ళు చాతనైనా చస్తారు, చావలేక బ్రతుకుతారు - తప్పితే ఆ దుర్మార్గుణ్ని పట్టివ్వడానికి ముందుకురారు.

రంగారావు కళ్ళ బడకుండా ఆడపిల్లల్ని దాచుకోవడం ఆ ఊళ్ళో చాలామందికి అవసరమని తెలుసు. అతని కళ్ళబడి ఆకర్షించిన పిల్లయితే కట్టుదిట్టాలేమాత్రం సడలించినా అతడు కాజేసుకుపోతాడు.

ఎవరో ఒకరు-ఆ పశువని చంపేస్తే ఎంత బాగుండును? అని అందమైన అమ్మాయిల తలిదండ్రులు, అన్నలు, భర్తలు అనుకుంటూండేవారు.

అలాంటి రంగారావు చచ్చిపోయాడు. అదీ హత్య చేయబడి!

హత్యయినా సామాన్యమైనదికాదు. రంగారావు తన గదిలో కుక్కచావు చచ్చాడు.

రంగారావుని అతడింట్లో అంతలా చంపగలిగిన హంతకుడు సామాన్యుడుకాదని ఊరంతా అలజడి బయల్దేరింది. అతణ్ని మహానుభావుడని ఆరాధించాలా, మరో దుర్మార్గుడవతరించాడని భయపడాలా అన్న మీమాంస తేలక చాలామంది బాధపడుతున్నారు.

ఏది ఏమైనా ఆ హంతకుడి ఆచూకీ మాత్రం తెలియ లేదు.

## 2

"ఈవేళ నువ్వు అయిదు నిముషాలు లేటుగావచ్చావు" అన్నాడు వెంకన్న తన అసిస్టెంటు సీతమ్మ వంకచూసి.

"ఆలస్యంగా రావడం నాకిది రెండోసారి. కానీ మీరు మెచ్చే కారణం ఆలస్యానికుండడం మాత్రం ఇదే మొదటిసారి అనుకుంటాను—" అంది సీతమ్మ.

"కారణం చెప్పకుండానే నేను నిన్ను మెచ్చుకుంటా ననుకోవడం నీ అహంకారాన్ని తెలియజేస్తుంది. వాట్ డుయూ సే రాజమ్మా!" అన్నాడు వెంకన్న తన రెండవ అసిస్టెంటుతో.

"సీతమ్మ అహంకారి అని మీరంటే ఏ కారణమూ వినకుండానే నేను ఒప్పేసుకుంటాను" అంది రాజమ్మ.

సీతమ్మ కోపపడలేదు. మందహాసం చేయలేదు. తన జాకెట్లోపల్నుంచి ఓ చిన్న డైరీ తీసి వెంకన్న ముందుంచి "ముందిది చూడండి. మనం తర్వాత మాట్లాడుకుందాం!" అంది.

వెంకన్న కుతూహలంగా డైరీనితీసి చూశాడు. అది డైరీలాంటి పాకెట్ నోట్ బుక్. పైన ప్లాస్టిక్ కవరుంది. పుస్తకంలో మొదటి పేజీ వదిలేయబడి ఉంది. రెండవ పేజీలో ఆరంభంలో ఒకటి అనే అంకె వేసి ఉంది. దాని క్రింద ఇలా రాసి ఉంది.

'వాడు దాన్ని రేప్ చేసే ప్రయత్నంలో ఉంటాడు. నేను రెండో ఆట సినిమా చూసి వాడింటికి వెడతాను. తలుపు తడతాను. వాడు తీస్తాడు. నన్ను చూసి కంగారు పడతాడు. నేను జేబులోంచి బెల్టుతీస్తాను. వాణ్ని కొట్టడం ప్రారంభిస్తాను. వాడి వళ్ళు తట్లు తేరేలా కొడతాను. తర్వాత గదిలో దొరికిన కర్ర పుచుకొని వాడి బుర్ర బద్దలుకొడతాను. ఆ తర్వాతనే నేను తెచ్చిన కత్తి వాడిగుండెల్లో దిగబడి వెచ్చటి రక్తం గదిలో చిమ్ముతుంది. అప్పటికింకా అది కూడా అక్కడే ఉంటే దానికి ధైర్యంచెప్పి పంపేస్తాను.'

"ఇదెక్కడ దొరికింది నీకు?" అన్నాడు వెంకన్న.

"అలస్యానికి క్షమార్పణ చెప్పుకోవాలా? మీ

ప్రశ్నకు జవాబు చెప్పాలా?" అంది సీతమ్మ.

"లంచాలతో వెంకన్నను మభ్యపెట్టలేవు. ముందు క్షమార్పణ చెప్పి అపుడు జవాబు చెప్పు. నో జోక్స్. అయాం సీరియస్—" అన్నాడు వెంకన్న గంభీరంగా.

వెంకన్న ముఖంచూసి సీతమ్మ ముఖంలో రంగులు మారాయి—"ఆఫీసుకు వచ్చేటప్పుడు నేను సాధారణంగా పార్కులోంచి క్రాస్ చేసి వస్తూంటాను. ఈ రోజు అలాగే చేస్తూండగా పార్కులోని ఓ మనిషి—అంత సేపూ బెంచీమీద కూర్చున్నవాడు చటుక్కున లేచి వెళ్ళిపోవడం చూశాను. అతడు లేచినచోట ఈ నోట్ బుక్ వుంది. తీశాను. అతని కందజేయాలనుకున్నాను. కానీ అత నేదో హడావుడిలో ఉన్నాడు. అతన్ని కాసేపు అనుసరించి ఫెయిలైపోయాను. ఆ విధంగా అయిదు నిముషాలాలస్యమైంది. అందుకు నన్ను మన్నించండి బాస్. తర్వాత ఇందులోని వివరాలు చదివాను. అంతే! నాకు ముచ్చెమట్లూ పోశాయి—శర వేగంతో ఆఫీసుకు వచ్చేశాను...."

"రాజమ్మా—ఒక్కసారి రంగారావు హత్య గురించి మనకు తెలిసిన వివరాలు చదువు...." అన్నాడు వెంకన్న.

తనక్కావలసిన వివరాలు తీయడానికి రాజమ్మ కొద్ది సెకన్లు మాత్రమే తీసుకుని—"వినండి బాస్!" అంటూ ఆమె చదవడం ప్రారంభించింది.

హంతకు డెవరోగాని అతడకి రంగారావు మీద చాలా కసివుంది. ముందతన్ని బెల్టుతో బాదాడు. తర్వాత తల మీద గదిలోవున్న ఓ కర్రతో మోదాడు. ఆపైన కత్తితో పొడిచాడు. ఆ సమయంలో అక్కడొక స్త్రీ మసలిన చిహ్నాలున్నాయి. గదిలో కొట్లాట జరిగిన సూచన

లున్నాయి. పక్కమీద సంఘర్షణ జరిగిన సూచనలున్నాయి. ఆడవాళ్ళ జాకెట్ బొత్తాలు రెండు, చిరిగిన చీర పేలిక, అక్కడక్కడ తలవెంట్రుకలు పొడుగాటివి ఉన్నాయి. ఒక స్త్రీ అక్కడ పురుషుణ్ని ప్రతిఘటించిందనడంలో సందేహంలేదు. అయితే ఆ స్త్రీయే ఈ హత్య చేసివుంటుందనుకోవడానికి అవకాశాలంతగా కనిపించడంలేదు. రంగారావువంటి బలవంతుణ్ని ఒక స్త్రీ అంతలా హింసించలేదు. ఒకవేళ ముందుగా ఏ తలమీదనో కొట్టడమో, కత్తితో పొడవడమో అప్పుడు బెల్టుతో కొట్టిందనుకుందామన్నా—దెబ్బ తగిలాక కత్తిపోటు తిన్నాక—హతుడు పెనుగులాడినట్లు కనబడదు. శవాన్ని కదిపిన సూచనలు లేవు. మరి బెల్టుదెబ్బలు—హతుడి వీపు మీద కూడా వున్నాయి.

"ఈ నోట్ బుక్ రంగారావును హత్యచేసిన వాడిదంటావా?" అన్నాడు వెంకన్న.

"నేనేమీ అనను. తర్వాత పేజీలు చూడండి—" అంది సీతమ్మ.

వెంకన్న పేజీ తిరగేసి ఉలిక్కిపడ్డాడు. అక్కడ పైన రెండంకె వేసివుంది. దానికింద ఇలా వ్రాసివుంది:

రాత్రి రెండో ఆట సినిమాచూసి వాడింటికి వెడతాను. వాడు తలుపులుతీసి నన్నాప్యాయంగా లోనికి ఆహ్వానిస్తాడు. నేను వాడితోపాటు లోపలకు వెడతాను. నా జేబులోంచి ఇన్‌హేలర్ తీసి—"ఇది చూశారా? కొత్తగా మార్కెట్లో వచ్చింది. దీని వాసన ఎంత బాగుందో" అంటాను. వాడు దాని వాసనచూసి స్పృహ తప్పి పడిపోతాడు. అప్పుడు వాణ్ని కూర్చున్న కుర్చీకే కట్టేస్తాను. తర్వాత జేబులోంచి కత్తితీసి—వాణ్ని తట్టి

లేపుతాను. చూస్తూండగా వాడి పీక కోసి మొండెంనుంచి తల వేరు చేస్తాను.

"మై గాడ్!" అన్నాడు వెంకన్న.

రాజమ్మ వణుకుతూ—"ఈ నోట్ బుక్ ఓసర్ని మళ్ళీ చూస్తే నువ్వు గుర్తుపట్టగలవా?" అంది.

"పట్టలేను. అతడి ముఖం సరిగ్గా చూడలేదు. అతడో కొత్తరకం ఎర్రపాంటు వేసుకుని ఉన్నాడు. ఆ పాంటు ఆధారంగానే అతన్ని కాసేపు అనుసరించి ఆఖరికి మిస్సయ్యాను—" అంది సీతమ్మ.

"ఎవడో తను చేయాల్సిన హత్యలన్నీ చక్కగా ముందే రాసిపెట్టుకున్నాడు...." అన్నాడు వెంకన్న.

"అప్పుడేఅయిపోలేదు. ఇంకా వున్నాయి చూడండి!" అంది సీతమ్మ.

ఈసారి పేజీ తిప్పుతూంటే వెంకన్న చేతులు వణికాయి.

అక్కడ....మూడంకె వేసివుంది.

నేను రెండో ఆట సినిమా చూసి వాడింటికి వెడతాను. తలుపులు తీసి వాడు నేనెవరినని అడుగుతాడు. వాడిని ఒక్క గుద్దుగుద్ది నేను లోపలకు వెడతాను. తిరిగి వాడు లేచేలోగా కత్తి వాడి గుండెల్లో దిగిపోతుంది.

తర్వాత పేజీలో నాల్గంకె వేసివుంది. అక్కడ....

అది నన్ను ఆప్యాయంగా ఆహ్వానిస్తుంది — రా అన్నయ్యా అంటూ. నేనా రాత్రి దానింట్లోనే భోం చేస్తాను. అది గదిలో పడుకుని నన్ను హాల్లో పడుకోమంటుంది. కాసేపలాగే జరుగుతుంది. ఓ రాత్రివేళ నేను దాని మంచం మీదకు వెడతాను. అది ప్రతిఘటిస్తుంది. కానీ నా బలానికి లొంగిపోతుంది.

ఆ తర్వాత పేజీలో అయిదంకె వేసివుంది. అక్కడ ఒకే ఒక వాక్యం సగంలో ఆపివేయబడివుంది.

రాత్రి రెండో ఆట సినిమాచూసి....

అంతే రాసివుంది.

"ఎవడో హత్యల గురించి పథకం వేసుకుని క్లుప్తంగా రాసిపెట్టుకున్నాడు. ఇంచుమించుగా అన్నీ ఒకలాంటి పథకాలే. ఆ హంతకు డెవరో తెలిస్తే బాగుండును!" అన్నాడు వెంకన్న.

"ఆ హంతకుడికి అందరిలోకీ రంగారావు మీదా, తర్వాత హత్య చేయబోయే వాడిమీదా చాలా పగ ఉన్నదనుకుంటాను...." అంది సీతమ్మ.

"ఈ నోట్ బుక్ రంగారావుని చంపినవాడిదేనని పిస్తోంది. దాన్నిబట్టి ఆలోచిస్తూంటే రంగారావు హత్యను ఒక స్త్రీ చూసిందనే చెప్పుకోవచ్చు, కానీ ఆ స్త్రీ ఎవరో ఎలా తెలుస్తుంది?" అన్నాడు వెంకన్న.

"పేపర్లో ప్రకటన వేస్తే?" అంది రాజమ్మ.

"దేనిగురించి?" అంది సీతమ్మ.

"రంగారావును చంపినవాణ్ని చూసిన స్త్రీ ఆ వివరాలను ఏదో రూపంగా డిటెక్టివ్ వెంకన్నకు అందజేయమని కోరుతూ పేపర్లో ప్రకటన చేయవచ్చు—" అంది రాజమ్మ.

"ప్రకటనకు ఖర్చవుతుంది? అదెవరు భరిస్తారు?" అన్నాడు వెంకన్న.

"ఎవరు భరిస్తారన్న ఆలోచన ఉంటే ఆ నోట్ బుక్ గురించి చర్చించడం టైమ్ వేస్ట్!" అంది రాజమ్మ ఉక్రోషంగా.

సరిగ్గా అప్పుడే బల్లమీద టెలిఫోన్ మోగింది. టెలి

ఫోన్ రంగుసుబ్బట్టి అది వంటింట్లోంచి భార్యామణి పద్మా వతీదేవి చేసినదేనని గ్రహించాడు వెంకన్న.

"హలో__దేవీ! ఏమిటి విశేషం?" అన్నాడు వెంకన్న.

"రంగారావు హంతకుడి ఆచూకీ తెలుసుకుందుకు మీరు పేపర్లో ప్రకటన వేయించండి__" అందామె.

"ఎందుకని?"

"ఆ హంతకుడి కార్యక్రమంలో ఓ ఆడదాని మాన భంగం కూడా ఉంది...." అంది పద్మావతీదేవి.

"మగవాళ్ళ ప్రాణాలు పోయినా నీకు బాధలేదు కానీ__ఆడదాని మానం గురించి ఈ నిర్ణయం తీసుకున్నావా?" అన్నాడు వెంకన్న వెటకారంగా.

"అవును మరి. మీ మగాళ్ళ ప్రాణాలన్నీ ఆడదాని మానం చుట్టూ నేగదా ఉంటున్నాయి...." అంది పద్మా వతీదేవి.

కిసుక్కుమని నవ్విన శబ్దం విని వెంకన్న తన అసిస్టెంట్ను వేపు చిరాగ్గా చూసి — "నా భార్య నాతో మాట్లాడుతున్నప్పుడు వినవద్దని మీ కెన్నిసార్లు చెప్పాను?" అన్నాడు.

వెంకన్నకు ఏ ఫోన్ కాల్ వచ్చినా వినేందుకు సీతమ్మకూ, రాజమ్మకూ సదుపాయముంది. అది వారు ఎప్పుడూ ఉపయోగించుకుంటూనే ఉంటారు. వెంకన్న కోప్పడగానే వాళ్ళు ఫోన్ క్రింద పెట్టేసి గప్ చిప్ అయిపోయారు.

"డబ్బుకోసం చూడకండి. పేపర్లో ప్రకటన ఇస్తారు కదూ?" అంటూ ఫోన్ పెట్టేసింది పద్మావతీదేవి. ఆవిడలా ఫోన్ పెట్టేసిందంటే అది విన్నపంకాదనీ, ఆజ్ఞ

అనీ అర్థం.

వెంకన్న ఫోన్ పెట్టేసి—"రాజమ్మా! నీ సలహా పాటిస్తున్నాను. పేపరుకు ప్రకటన తయారు చేయించు" అన్నాడు.

రాజమ్మ నవ్వి "నా సలహా పాటిస్తున్నారా? మీ రెవరి సలహా పాటించారో నాకు తెలియదనుకుంటు న్నారా? నేనూ నా సలహా పాటించే వాళ్ళుండడం కోసమైనా త్వరగా పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను-" అంది.

3

"హలో!" అన్నాడు వెంకన్న.

"మాట్లాడేది డిటెక్టివ్ వెంకన్నగారేనా?" అంది ఓ స్త్రీ కంఠం.

"అసును—ఏం?"

"నేను పేపర్లో మీ ప్రకటన చూశాను?" అందా కంఠం.

"అలాగా—మీరు రంగారావింట్లో హత్య చూసిన స్త్రీయా?" అన్నాడు వెంకన్న. అతడి కంఠంలో కుతూహలముంది.

"అవును."

"వాట్ ...." ఉలిక్కిపడ్డాడు వెంకన్న. అది కలా, నిజమా అని వళ్ళు గిల్లుకున్నాడతను—"హలో వివ రాలన్నీ త్వరగా చెబుతారా!"

అదే ఫోన్ కాల్ సీతమ్మ, రాజమ్మ కూడా వింటు న్నారు. వినేది నోట్ చేసుకోవడం కోసం ఇద్దరి చేతు ల్లోనూ పెన్సిల్సు నోట్ బుక్సు సిద్ధంగా ఉన్నాయి.

"వెంకన్నగారూ! రంగారావు పరమ దుర్మార్గుడు.

అ విషయం చూచాయగా వినివున్నా ఆ రోజతడు నాపట్ల పశుత్వం వహించేవరకూ దుర్మార్గం అనేది ఎంత భయంకరమైన విషయమో అర్థంచేసుకున్నాను. అటువంటి వాణ్ని హంతకుడనకూడదు. మోఘుడనాలి. ఆ దృశ్యం కళ్ళారా చూసినందుకు నాకెంతో ఆనందంగా ఉంది. ఆ మహానుభావుణ్ని పూజించాలి తప్పితే జైలుపాలు చేయకూడదు. అనవసరంగా మీరీ కేసుపై ఆసక్తి చూపకండి! స్త్రీ లోకం ధన్యవాదాలర్పిస్తున్న ఆ మహానుభావుడికి ఆపద తలపెట్టకండి."

ఫోన్ క్లిక్కమంది.

"హలో! హలో!" అన్నాడు వెంకన్న నిరుత్సాహంగా.

"రాజమ్మ సలహాలవల్ల ప్రయోజనం పొందిందెవరు?" అంది సీతమ్మ.

"బాస్! సీతమ్మ మీ సతీమణినే అవమానిస్తోంది—" అంది రాజమ్మ.

"వాట్—నువ్వు శ్రీ వెంకన్న సతీమణివా? నాకు తెలియదే—" అంది సీతమ్మ.

రాజమ్మ ముఖం ఎర్రగా అయింది. ఆమె ఏదో అనబోయేంతలో బల్లమీద ఫోన్ మ్రోగింది.

"హలో!" అన్నాడు వెంకన్న.

"నా పేరు శివుడు. మా అన్నయ్య విష్ణువు నెవరో హత్యచేశారు!" అందవతలి కంఠం.

"హలో! ఇది డిటెక్టివ్ వెంకన్న యిల్లు. ఇక్కడ జోక్స్ వినబడవు—" అన్నాడు వెంకన్న.

"అయాం సారీ వెంకన్నగారూ—నేను జోక్ చేయడంలేదు. మా అన్నయ్య విష్ణువునెవరో ఘోరంగా

హత్యచేశారు. కుర్చీలో కట్టేసి తల కోసేశారు...."

వెంకన్న చేతిలోని రిసీవర్ జారిపోయింది.

"హలో! హలో!" అంటోంది అవతలి కంఠం.

వెంకన్న మళ్ళీ రిసీవర్ అందుకుని—"అంతా వివరంగా చెప్పండి!" అన్నాడు.

విష్ణువు అసలు పేరు విష్ణుమూర్తి. శివుడి అసలు పేరు శివరావు. ఇద్దరూ అన్నదమ్ములు. ఉన్నవాళ్ళేకానీ మరీ అంత పేరున్నవాళ్ళు కాదు. హత్యాస్థలానికి పోలీసులు వచ్చారు. తన అన్నని ఎవరంత ఘోరంగా చంపారో శివుడికి తెలుసుకోవాలనుంది. అందుకు అతను వెంకన్న సహాయం కోరుకున్నాడు.

వెంకన్న కూడా సీతమ్మను తీసుకుని హత్యాస్థలానికి వెళ్ళాడు. దారిలో అతను సీతమ్మతో "రాజమ్మ బదులు నిన్ను తీసుకువెళ్ళడానికి కారణం తెలుసా? నోట్ బుక్ ఓనర్ని చూస్తే గుర్తుపడతావని!" అన్నాడు.

"కనపడతాడని మీకు నమ్మకముందా?" అంది సీతమ్మ.

"కనపడతాడన్న నమ్మకం నాకుంది. కానీ నువ్వు గుర్తుపడతావన్న నమ్మకం నాకు లేదు—" అన్నాడు వెంకన్న.

హత్యాస్థలం వారు చేరుకునేసరికి పోలీసులింకా అక్కడేవున్నారు. వెంకన్న, పోలీస్ ఇన్స్పెక్టర్ ఒకరి నొకరు పలకరించుకునారు. అయితే వెంకన్న రాకపట్ల ఇన్స్పెక్టర్ అంత కుతూహలం చూపించలేదు.

వెంకన్నకు తెలిసిన ముఖ్య విశేషమేమిటంటే— హంతకుడు తనకు సంబంధించిన ఆచూకీ ఒక్కటి కూడా వదిలిపెట్టినట్లు కనబడడంలేదు. ఎక్కడా వేలిముద్రలే లేవు.

పోలీసులు కాస్త నిరుత్సాహంగా ఉన్నారు.

శవం మాత్రం చాలా భయంకరంగా ఉంది. కుర్చీలో తలలేని మొండెం. దాని ఒడిలో తల.

వెంకన్న శివుడనబడే శివరావుని పలకరించాడు. తనకు తోచిన ప్రశ్నలన్నీ వేశాడు.

విష్ణువుకి పెళ్ళయింది. ఏడాదిక్రితం అతడి భార్య చని పోయింది. అతడికి పిల్లలులేరు. భార్యపోయాక అతను కాస్త విరక్తుడయ్యాడు. రెండో పెళ్ళి గురించి చాలామంది అతన్ని ఒత్తిడిచేస్తున్నారు. అతడికింకా ముప్పై నిండ లేదు. అతడి పేరుమీద రెండులక్షల ఆస్తి ఉంది.

"వారసులు లేకపోతే మీ అన్నయ్య ఆస్తి ఎవరికి చెందుతుంది?" అనడిగాడు వెంకన్న.

"నాకే!" అన్నాడు శివరావు.

"మీ అన్నయ్య భార్య ఎలా చనిపోయింది?"

"హఠాత్తుగా అనారోగ్యానికి మరణించింది—"

"అది సహజమైన చావేననుకున్నారా?"

"అయ్యా వెంకన్నగారూ నేను మిమ్మల్ని కోరింది మా అన్నయ్యను చంపిన హంతకుణ్ణి పట్టుకోమని. మీ రేమో మా యింట్లో యింతవరకూ పోయినవారి వివరా లడుగుతున్నారు...."

"తీగలాగితే డొంక కదలడమంటే ఇదే మరి?" అన్నాడు వెంకన్న.

"అంటే?"

"మీ అన్నయ్య పేరున రెండు లక్షల ఆస్తి ఉంది. ఆయనకు వారసులు లేకుండా చనిపోతే అది మీకే చెందు తుంది. అనారోగ్యానికి ఆయనభార్య పోయింది. తర్వాత ఆయన పోయాడు. అందువల్ల ఈ కేసుకి మొదటి అను

మానితుడు మీరే!" అన్నాడు వెంకన్న.

"బాగుందండీ__నీ చొక్కా మీద పురుగుందంటే నీ చేత్తోనే తీసెయ్యమన్నట్లు హంతకుణ్ని పట్టుకోమని మిమ్మల్ని పిలిస్తే నన్నే హంతకుణ్ని కమ్మనమని మీ పని సులభంచేసేసుకుంటున్నారు మీరు. నిజం చెప్పాలంటే అన్నయ్య హత్య జరిగిన సమయంలో నాకు పటిష్టమైన ఎలిబీ ఉంది!" అన్నాడు శివరావు.

"చెప్పండి!"

గతరాత్రి శివరావు యింట్లో లేడట. స్నేహితులతో పేకాడుతున్నాడట. పేకాటమధ్యలో అతడికి కళ్ళు తిరిగినట్లయి అప్పటికప్పుడు ఓ నర్సింగ్ హోంకు వెళ్ళి రాత్రంతా అక్కడే పడుకుని వచ్చాడట.

"నర్సిగ్ హోం అడ్రస్ చెబుతారా?"

శివరావు చెప్పాడు. సీతమ్మ నోట్ చేసుకుంది.

"ఇలా కళ్ళుతిరగడం మీకు అలవాటా?"

"అలవాటైతే నర్సింగ్ హోం కెందుకు వెడతాను? మొదటిసారి కాబట్టే కంగారుపడ్డాను...."

"అలా ఎందుకు జరిగిందంటారు?" అన్నాడు వెంకన్న.

"మనకత్యంత ఆప్తులైన వారికాపద కలిగేలా ఉంటే ఆ విషయాన్ని మెదడు ముందుగానే కనిపెట్టి సూచించ గలదట. నిన్నరాత్రే ఈ విషయం స్ఫురించి ఉంటే నర్సింగ్ హోంకు బదులు ఇంటికే పోయి ఉండేవాణ్ని!" అన్నాడు శివరావు బాధగా.

"మీకు సైకాలజీ తెలుసా?" అన్నాడు వెంకన్న.

"ఏదో కొద్దిగా!" అన్నాడు, కానీ శివరావు కా సంభాషణ పొడిగించడం పెద్దగా యిష్టం లేనట్లుంది. "వెంకన్నగారూ! మీరు కోరిన డబ్బిస్తాను. అన్నయ్యను

చంపిన హంతకుణ్ని వీలైనంత త్వరగా పట్టుకోండి—"
అన్నాడు.

వెంకన్న ముఖం గంభీరంగా అయిపోయింది "నా శక్తిని తక్కువ అంచనా వేసి నాకీ పని అప్పచెబితే మాత్రం తర్వాత మీరే విచారిస్తారు...." అన్నాడతను.

"అంటే?"

"హంతకుణ్ని నేను నిజంగానే త్వరలోనే పట్టుకోగలనన్న నమ్మకముంది—" అన్నాడు వెంకన్న.

తర్వాత వెంకన్న, సీతమ్మ కలిసి అతడు చెప్పిన నర్సింగ్ హోంకి వెళ్ళారు.

"అతడి పేరు శివరావు. ఇందాకనే ఈ విషయం పోలీసులు వచ్చి అడిగివెళ్ళారు. రాత్రంతా అతనిక్కడే ఉన్నాడు. మనిషిలో ఏ కంప్లెంటూ ఉన్నట్లు నాకు తోచలేదు. ఏదో గాబరాగా ఉందనీ తననో గదిలో పెట్టి గొళ్ళెం వేయమని కోరాడతను. అతనికి సుఖంగా నిద్ర పట్టడానికి ట్రాంక్విలైజర్నిచ్చి గదిలో ఉంచి బయట గొళ్ళెం వేసాను. మధ్యలో ఓసారి తలుపు తెరిచిచూస్తే అతను ప్రశాంతంగా నిద్రపోతూ కనిపించాడు-"అన్నాడు డాక్టర్.

"గదితలుపులు వేసి ఉండగా పారిపోవడానికి వేరే మార్గంలేదా?"

"గది కిటికీలకు ఇనపచువ్వలున్నాయి. వాటిని తొలగించడం చాలా కష్టం—"

"కష్టం కావచ్చు. అసాధ్యంకాదుగదా!" అన్నాడు వెంకన్న.

"పోలీసులా విషయం పరిశోధించి వెళ్ళారు. అన్ని

చువ్వలూ ఒక్కలా ఉన్నాయి...."

వెంకన్న డాక్టరుకు థాంక్స్ చెప్పి అక్కణ్నించి బయల్దేరాడు.

# 4

"మీరు శివరావు ననుమానించడం నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది!" అంది సీతమ్మ.

"ఇందులో ఆశ్చర్యానికేముంది? విష్ణుమూర్తి మరణం వల్ల శివరావు కొక్కడికే లాభముంది! పోలీసు లాలోచించిన విధంగానే నేనూ ఆలోచిస్తున్నాను" అన్నాడు వెంకన్న.

"అలాంటప్పుడు అతనేమిన్మమ్మల్నెందుకాహ్వానించాడు"

"దీన్నే ముందరికాళ్ళకు బంధం వేయడమంటారు. పోలీసుల అనుమానం ఎటూ శివరావుపైనే ఉంటుంది. ఓ ప్రైవేట్ డిటెక్టివ్ తనకు రక్షణగా ఉండడం మంచిదని అతడు భావించి ఉంటాడు...."

"మీ రతన్ననుమానించడానికింకా ఏమైనా కారణాలున్నాయా?"

"ఉన్నాయి. ఉదాహరణకు ఎలిబీ విషయం అతను జరగబోయేది తెలుసుకుని కావాలని మరీ అది సృష్టించుకున్నాడనిపిస్తోంది. అన్నగార్ని హత్యచేయమని ఎవర్నో పురమాయించి తనేమో నర్సింగ్ హోమ్‌లో వుండిపోయాడు. అతన్ని హంతకుడని ఎవరూ అనలేరుకదా!" అన్నాడు వెంకన్న.

"ఊఁ" అంది సీతమ్మ ఇంకా చెప్పమన్నట్లు.

"నేను అతనే హంతకుడని అన్నపుడు అతను వెంటనే ఎలిబీ గురించి మాట్లాడాడు. ఏ తమ్ముడిపైనైనా ఇలాటి అభాండం పడిందంటే వెంటనే ఎలిబీ గురించికాక—

తోడబుట్టినవాణ్ని చంపుతానా, అందులోనూ అంత ఘోరంగా—అని వాపోతాడు. శివరావు వాపోవలేదు. ఎలిబీ గురించి మాట్లాడాడు. ఆరోపణ అబద్ధమని చెప్పాలన్న తపన తప్పితే—ఆరోపణకు—అతను అణుమాత్రం నొచ్చుకున్నట్లు లేదు...." అన్నాడు వెంకన్న.

"అప్పటికే పోలీసులు అడిగి ఉండడంవల్ల అలా ప్రవర్తించాడేమో!" అంది సీతమ్మ.

"అయినప్పటికీ నేనడిగినా అతడికి బాధ కలిగి ఉండాల్సింది. అయితే నువ్వు చెప్పిన కారణం కూడా కొట్టేయడానికి వీల్లేదనుకో!" అన్నాడు వెంకన్న సాలోచనగా.

"మీరో విషయం మరిచిపోతున్నారు. రంగారావు హత్యకీ, ఈ హత్యకీ సంబంధముందని మనమనుకుంటున్నాం!" అంది సీతమ్మ.

ఈ సూచన వింటూనే వెంకన్న ఉలిక్కిపడి—

"అవును నిజమే! ఈ కోణంనుంచి కూడా ఎన్నో విషయాలు పరిశీలించాల్సి ఉంది. అన్నట్లు నీకు శివరావులో—ఆ నోట్ బుక్ ఓనర్ పోలికలు కనబడ్డాయా?" అన్నాడు.

"అవుననీ అనలేను. కాదనీ చెప్పలేను. నాకు గుర్తున్నది అప్పుడతను వేసుకున్న ఎర్రపాంటు మాత్రమే!"

## 5

"ఇదివరకటి ఊరుకాదు. ప్రాణాలర చేతిలో పెట్టుకుని బ్రతకాల్సొచ్చేలాగుంది—" అంటూ కుర్చీలో కూర్చోబోయాడు పుండరీ. అతను కూర్చునేలోగానే కెవ్వుమని అరిచాడు వాసు.

ఉలిక్కిపడి ఆగిపోయాడు పుండరీ.

"ఏమిటయిందండీ—" అంది యమున.

"వాడు కూర్చోబోయేచోట ఓ కండచేరు ఉంది. నేను

అది చచ్చిపోయిందనే అనుకున్నాను—" అన్నాడు వాసు.

అతడికి వళ్ళంతా చెమటలు పట్టేశాయి.

"ఏమిట్రా మరీను—చాదస్తం ఎక్కువైపోతోంది—" అన్నాడు పుండరీ.

"చాదస్తం కాదురా—అది నా బలహీనత!" అన్నాడు వాసు.

"ఏంబలహీనతో కానీఈయనతో కష్టంగాఉందన్నయ్యగారూ-ఓ రోజు ఈయన చూస్తూండగా పేనుకక్కానని కళ్ళు తిరిగి పడిపోయారు. మరో రోజు బల్లపురుగును పట్టేసరికి కెవ్వుమని అరిచారు...." అంది యమున.

"నీలాంటి వాళ్ళకు బ్యాలన్సుగా ఉంచడంకోసమే భగవంతుడు కొందరు హంతకుల్ని సృష్టించాడేమో— అబ్బ....ఆ విష్ణుమూర్తిగారి శవాన్ని చూస్తే...."

"ఏమిటండీ ఆ విశేషం?" అంది యమున కుతూహలంగా.

"హంతకు డాయన్ను కుర్చీకి కట్టేసి పీక కోసేశాడు...."

"ఒరేయ్.... చెప్పకురా...." అన్నాడు వాసు కంగారుగా.

పుండరీ ముఖం గంభీరంగా అయిపోయింది—"ఒరేయ్ వాసూ! చెట్టంత మనిషివి నువ్వు. కండలు తిరిగివున్న నిన్ను చూస్తే కొంతమంది దొంగలు జడుసుకుని పారిపోతారు. ఇంట్లో నువ్వు నీ భార్యా తప్ప ఎవ్వరూలేరు. నువ్విలా ప్రతి చిన్న విషయానికీ భయపడుతూంటే నీ భార్యకు ధైర్యం ఎలా ఉంటుంది చెప్పు? ఆమెకు నువ్వు కొండంత అండగా ఉండొద్దూ—"

వాసు మాట్లాడకుండా తల వంచుకున్నాడు.

భర్త చిన్నబుచ్చుకున్నాడని యమునకు అనుమానం వచ్చింది. "ఈ రోజుల్లో ఇంత మెత్తటి మనసుం దేవారే అరుదు. ఇంత మంచివారు నావారు కావడం నా అదృష్ట మనుకుంటాను నేను. ఏదో వేళాకోళానికి ఆయన్ను వేధించినా ఆయన గురించి నాకే కష్టమూలేదు—" అందామె.

పుండరీ వెళ్ళిపోయాక—ఆప్యాయంగా భర్త జుట్టు లోనికి పోనిస్తూ—"పుండరీగారన్నారని కాదుకానీ—మీ సున్నిత మన స్తత్వాన్ని బయటవారు అర్థం చేసుకో లేరు. అందుకనైనా మీరు బయటివారి దగ్గర జాగ్ర త్తగా ఉండండి—" అంది.

"పుండరీ నాకు బయటివాడు కాదు. ఆప్తమిత్రుడు-" అన్నాడు వాసు.

"కావచ్చు. కానీ ఎవరైనా మిమ్మల్ని నా ఎదుట చిన్నబుచ్చితే బాధగా ఉంటుంది. నేను మిమ్మల్నెంతగా ఆరాధిస్తున్నానో మీకేం తెలుసు!" అంటూ ఆమె అతడి జుత్తులోంచి చేయి బైటకుతీసింది. నేలమీద పాకుతున్న పేనుని చూస్తూ ఆమె—"అరే—మీకు పేలు పట్టాయే!" అంది.

"నీ తలలో ఉన్నప్పుడు నాకు పట్టకేం చేస్తాయి. కానీ నువ్వు దాన్ని చంపకు...." అన్నాడు వాసు.

"చంపనులేండి. బాత్రూంలో వదిలివస్తాను...." అని లోపలికి వెళ్ళి అవతల పారేసివచ్చింది యమున.

"నాకు త్వరగా భోజనం పెట్టు—" అన్నాడు వాసు ఆమె రాగానే.

"ఎందుకు?" అంది యమున.

"సెకండ్ షో పిక్చర్ కి వెళ్ళాలి!" అన్నాడు వాసు గంభీరంగా.

"అదేమిటండీ — హఠాత్తుగా చెప్పారు. నేనూ వస్తాను...." అంది యమున.

"నువ్వు రావద్దు. నేనొక్కడినే వెడతాను...." అన్నాడు వాసు.

యమున చిరాగ్గా—"మీరు సెకండ్ షోకి వెడితే నన్నెందుకు తీసుకువెళ్ళరు? నిజంగా పిక్చర్ కే వెడుతున్నారా—లేక...." అంటూ అర్థోక్తిలో ఆగిపోయింది.

"నీ ప్రశ్నకు జవాబు చెప్పను. త్వరగా భోజనం పెట్టు—" అన్నాడు వాసు.

## 6

"అనుకోకుండా వెనక్కి తోయబడి ఉంటాడు. లేచే లోగా పొడిచేశాడు హంతకుడు—" అన్నాడు ఇన్స్పెక్టర్. అతడి ముఖం చాలా చిరాగ్గా ఉంది.

"హంతకుడు బొత్తిగా ఒక్క క్లూ కూడా వదల్లేదని చిరాగ్గా ఉన్నట్లుంది ఇన్స్పెక్టర్ గారికి....హంతకుడు మీకోసం హత్య చేయడు మరి!" అన్నాడు వెంకన్న.

"రావణాసురుడంతటి తెలివైనవాళ్ళే వరాలు కోరుకునేటప్పుడు చిన్న చిన్న తప్పులు చేసి ప్రాణాలమీదకు తెచ్చుకున్నారు. ఈ హంతకుడంతకంటె తెలివైన వాడా?" అన్నాడు ఇన్స్పెక్టర్.

"ఆలోచించి చూస్తే మరో చిన్న క్లూ దొరుకుతుంది-" అన్నాడు వెంకన్న.

"ఏమిటది?" ఆత్రుతగా అడిగాడు ఇన్స్పెక్టర్.

"రంగారావు, విష్ణుమూర్తి, లచ్చన్న—ఈ ముగ్గురి హత్యలూ ఇంచుమించు ఒకే సమయంలో జరిగాయి—

అదీ సాధారణంగా సినిమా రెండో ఆట వదిలిన కాసే పటికి....” అన్నాడు వెంకన్న.

ఇన్స్పెక్టర్ ఆలోచనలోపడి—“అంటే హంతకుడు రెండో ఆట సినిమా చూసొచ్చి ఈ హత్యలు చేస్తున్నా డంటారా?” అన్నాడు.

“అంతకంటే ముఖ్యంగా మీరు గ్రహించవలసింది - ఈ మూడు హత్యలూ ఒకే హంతకుడు చేసివుంటాడని! అంటే ఈ మూడు హత్యలకూ ఏదైనా కామన్ మోటివ్ ఉన్నదా అని!” అన్నాడు వెంకన్న.

ఇన్స్పెక్టర్ ఆశ్చర్యంగా-“మీరు చెప్పేదానికంటె ఎక్కువ మీకు తెలుసునని నా కనుమానంగా వుంది—” అన్నాడు.

“అనుమానముంటే ఉండనివ్వండి—నన్ను మాత్రం అనుమానించకండి!” అన్నాడు వెంకన్న.

ఈ జోక్కు నవ్వే మూడ్ ఇన్స్పెక్టర్ కున్నట్టులేదు. లచ్చన్న హత్యగురించి తీవ్రంగా ఆలోచిస్తున్నా డతను.

లచ్చన్నది కూరగాయల వ్యాపారం. నాలుగువేళ్ళూ లోపలకు పోతున్నాయి. భార్యా ముగ్గురు పిల్లలు. అంతా పుట్టింటికి వెళ్ళారు. అతనొక్కడే వుంటున్నాడు వారం రోజులుగా. చుట్టుపక్కల వాళ్ళేమీ సమాచారం ఇవ్వ లేకపోయారు రాత్రి జరిగిన విశేషం గురించి. ఎవ్వరూ ఏమీ చూడలేదంటున్నారు. లచ్చన్నతో ఎవరికీ అట్టే పరిచయమున్నట్టు కూడా లేదు.

చచ్చిపోయిన వారిలో

రంగారావు ధనికుడు కాదు గానీ ధనవంతులతో త్తు. దుర్మార్గుడన్న పేరుంది.

విష్ణుమూర్తి మధ్యరకం వ్యాపారి.

లచ్చన్న కూరగాయల వ్యాపారి.

ముగ్గురికీ ఏమీ సంబంధ బాంధవ్యాలూ, లావా దేవీలూ వున్నట్లులేదు. ఈ ముగ్గురినీ ఒక్కడే చంపాడను కోవడంవల్ల కేసు క్లిష్టతరమవుతుందే తప్ప క్లూ దొరకదు.

ఇన్‌స్పెక్టర్ తన అభిప్రాయం వెంకన్నకు చెప్పాడు.

వెంకన్న నోట్‌బుక్ విషయం ఇన్‌స్పెక్టర్‌కు చెప్ప లేదు. ఈ మూడు హత్యలకూ సంబంధమున్నదన్న విష యానికి తిరుగులేని ఋజువు అదే!

వెంకన్నకు కలిగిన బాధ ఇంతా అంతా కాదు. కేసు బొత్తిగా ముందుకు వెళ్ళడంలేదు. జరగబోయే నేరాల గురించి తనకు ముందుగానే తెలిసింది. కానీ ఆ నేరాల గురించి ప్రజలనెలా హెచ్చరించాలో తనకు తెలియడం లేదు. అయినా ఈ హంతకుడెవరు? హత్యలు చేయడానికి అతనికున్న కారణాలేమిటో? అతనెవరెవరిని చంపడానికి ఎన్నుకున్నాడో? ఈ హత్యాకాండ ఎంతకాలం ఇలా కొనసాగిస్తాడో?

తనేమీ చేయలేడా? జరుగబోయేవన్నీ నిస్సహాయంగా చూస్తూ ఊరుకోవడమేనా?

"ఎందుకైనా మంచిది? ఈ మూడు హత్యల్నీ కలిపి పరిశీలిస్తున్నట్లు ప్రచారం చేయండి. ఒకోసారి ఇలాంటి ట్రిక్స్ క్లిక్ అవుతూంటాయి...." అన్నాడు వెంకన్న.

"ఇది నాకిష్టంలేదు!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

## 7

"ఏమండీ—మీరా నోట్‌బుక్‌ని సీరియస్‌గా తీసు కున్నట్లు కనబడదు. దేనికైతే నేను భయపడ్డానో అదే జరుగబోతున్నట్లుంది. మీరేం చేయలేరా?" అంది పద్మా వతీదేవి.

"మొత్తం కేసంతా నీకూ తెలుసు....ఏదైనా ఉపాయం నువ్వే చెప్పు!" అన్నాడు వెంకన్న.

"నేను డిటెక్టివ్ భార్యనే కానీ డిటెక్టివ్‌ను కాను...." అంది పద్మావతీదేవి.

"నేను డిటెక్టివ్‌నే కానీ భగవంతుణ్ని కాను...." అన్నాడు వెంకన్న.

"అయితే మీరేమీ చేయలేరా?" అంది పద్మావతీదేవి నీరసంగా.

"భగవంతుడంతటివాడు దుర్మార్గుల్ని పరిమార్చడం కోసం అవతారాలెత్తి తగిన అవకాశం కోసం ఎదురు చూసి__అప్పుడు దుష్ట సంహారం చేశాడు. నేను సామాన్య మానవుణ్ని. ఒక చిన్న అవకాశం లభిస్తే బాగుండునని ఆశిస్తున్నాను....ఇంతవరకూ నేను పట్టిన కేసులో ఫెయిలవలేదు. సగంలో వదిలిపెట్టవలసిన అవసరం రాలేదు. పోలీసులకు వివరాలందజేసినా చేయక పోయినా ప్రతి కేసుకూ అంతం మాత్రం చూడగలిగాను. దీనికీ అవకాశం రాకపోదు. ఒకే ఒక చిన్న...."

వంటింట్లో టెలిఫోన్ మ్రోగింది. వెంకన్న అందుకున్నాడు.

"సార్! ఈ రోజు నేనా నోట్ బుక్ ఓనర్ని చూశాను. అతను ఎర్ర పాంటుతో బయట తిరుగుతూండగా గుర్తుపట్టాను. అత నేనన్న విషయంలో నాకేమీ సందేహంలేదు__" అంది సీతమ్మ.

"ఎవరతను?"

"విష్ణుమూర్తి తమ్ముడు శివరావు...."

"ఐసీ...ఫోంచేసి వస్తున్నాను. నువ్వక్కడే వుండు.." అన్నాడు వెంకన్న. తర్వాత భార్యవంక తిరిగి__"నే

నెదురు చూస్తున్న చిన్న క్లూ దొరికినట్లే వుంది...."
అన్నాడు వుత్సాహంగా.

భోజనం చేసి ఆఫీసురూంకు వెళ్ళగానే సీతమ్మను చూసి "ఈ రోజు నువ్వు చాలా పెందరాళే వచ్చినట్లున్నావు" అన్నాడు. అప్పటికింకా రాజమ్మ రాలేదు.

"అవును బాస్. అమ్మ యింట్లో కాఫీపొడి అయి పోయిందంటే నేను వుదయం షాప్ కెళ్ళాల్సొచ్చింది. అప్పుడా ఎర్రపాంటువాణ్ని చూశాను. వుత్సాహం ఆగ లేదు...." అంది సీతమ్మ.

"చూసీచూడగానే నాకా శివరావు మీద అనుమానం కలిగింది. వాడి కళ్ళు భయంకరమైన ఆలోచనలు సూచి స్తున్నాయి. మనిషి చాలా లోతైనవాడని అనిపిస్తోంది. ముఖంలోకూడా హంతకుడి ఛాయలు కనబడుతున్నాయి. సాధారణంగా నా అంచనా తప్పుకాదు...." అన్నాడు వెంకన్న.

"ముఖంచూసి హంతకుడెవరో చెప్పగలిగితే ఇంక పరిశోధన ఎందుకు?" అంది సీతమ్మ.

"ఋజువుల కోసం! కోర్టులు జోస్యాలు నమ్మవు గదా!" అన్నాడు వెంకన్న.

కాసేపట్లో రాజమ్మ వచ్చింది. ముగ్గురూ కలిసి కేసును కూలంకషంగా చర్చించారు.

"అన్నట్లు మనం వదిలేసిన పాయింటొకటుంది. ఆ నోట్ బుక్ లోని దస్తూరీ శివరావుదేనో కాదో తెలిస్తే పోయేదిగా___" అంది రాజమ్మ.

"ఆ ఐడియా నాకెప్పుడో వచ్చింది. దస్తూరీ శివ రావుదే అని గ్రహించినంతమాత్రాన మనమేమీ చేయ లేము. సీతమ్మ అతణ్ని సరిగా గుర్తుపట్టలేకపోవడంవల్ల —

ఆ ఎర్రప్యాంటు వ్యక్తి వేరేమనిషై వుంటాడన్న భ్రాంతిలో నేను నోట్ బుక్ దస్తూరీ గురించి పట్టించుకోలేదు. ఇప్పుడు శివరావుపై మన అనుమానం పెరిగింది. దస్తూరీ కూడా పోల్చి ఒక్కక్షణం కూడా అతన్ని వదిలిపెట్టకూడదు-" అన్నాడు వెంకన్న. మాటలైతే ఆపాడు కానీ అతని ఆలోచనలింకా కొనసాగుతున్నట్లు కళ్ళు సూచిస్తున్నాయి.

"దస్తూరీ ఎలా సంపాదిస్తారు?" అనడిగింది సీతమ్మ.

"అందుకు రాజమ్మ వెడుతుంది. మగాడివంక కవ్వించే చూపులు చూసి అనుకున్న పని సాధించుకు రావడంలో రాజమ్మ గట్టిది!" అన్నాడు వెంకన్న.

సీతమ్మ తన కుర్చీని వెంకన్నకు దగ్గరగా జరిపి అతడి వంక అదోలా చూస్తూ—"అలా చూడ్డం నాకు చేత కాదంటారా?" అంది.

వెంకన్న ఆమెవంక చూసి—"మిస్ సీతమ్మా! ఇప్పుడలా చూడకు. నా మూడ్ పాడయిందంటే ఆలోచనలు తప్పుదారిని పడతాయి. ప్లీజ్!" అని—"ఈ కేసు నాకు అప్పగించింది శివరావు. అతడే హంతకుడైతే ఇందులో నాకు ఒక్క పైసా రాదు. డబ్బు కోసం రాజమ్మను శివరావు ఇంటికి పంపిస్తాను. అప్పుడు రాజమ్మ అతడి దస్తూరీ సంపాదించుకు రావాలి—" అన్నాడు వెంకన్న. అంటూనే అతడు శివరావుకు ఫోన్ చేసి తన అసిస్టెంట్‌ను పంపిస్తున్నట్లు చెప్పాడు.

రాజమ్మ బయల్దేరి కార్లో వెళ్ళి అరగంటలో తిరిగి వచ్చేసింది. శివరావు రెండువేలిచ్చాడు. ఆ మేరకు అతడి చేత ఓ వుత్తరం కూడా రాయించి పట్టుకొచ్చింది.

వెంకన్న ఆమెను మెచ్చుకుని నోట్ బుక్‌నీ—ఆ దస్తూరీనీ సరిపోల్చిచూసి—"మై గాడ్—ఇది శివరావు

దన్తూనీయే—" అన్నాడు.

అనుకున్నదే అయినా అసిస్టెంటిద్దరూ అప్రయత్నంగా ఆశ్చర్యంతో నోరు తెరిచారు—"ఇప్పుడేం చేయాలి?" అంది ఇద్దరిలోకీ రాజమ్మ ముందు తేరుకుని.

"మనం కేసుల్ని ఎన్నో కోణాల్నుంచి పరిశీలించాం. రంగారావు, లచ్చన్నను చంపడానికి—శివరావుకుండే కారణాలు సూచనప్రాయంగా కూడా తెలియడంలేదు. అందుకే పరిశోధన కుంటి నడక నడుస్తోంది. ఇప్పుడు మనకు శివరావు హంతకుడని తెలిసిపోయింది. కాబట్టి త్వరగా బుజువులు సంపాదించాలి. అన్నిటికంటే ముందు శివరావుని ఈ క్షణంనుంచీ నీడలా వెన్నాడాలి—" అన్నాడు వెంకన్న.

"ఇరవై నాలుగు గంటలూ ఓ మనిషిని వెన్నాడా లంటే ఒక్కరు చాలరు. ఈ పనికి నేను నా బాయ్ ఫ్రెండ్‌ని నియోగిస్తాను" అంది సీతమ్మ.

వెంకన్న నవ్వి అంగీకారం తెలిపాడు.

# 8

"తేలండీ—" అంది యమున.

అది చాలా పెద్ద తేలు. గోడకు మూలగా ఆగివుంది.

"ఎవర్నయినా పిలు—" అన్నాడు వాసు.

"తేలును చంపడానికి ఎవర్నయినా పిలిస్తే బాగుండ దండీ—అనవసరంగా అంతా మిమ్మల్ని చూసి నవ్వుతారు. నాకది నచ్చదు. దాని సంగతి నేను చూస్తాను...." అంటూ మంచం దిగింది యమున.

రేడియోలో వస్తున్న తెలుగువార్తల్ని కట్టేశాడు వాసు. యమున గదిలోంచి బయటకువెళ్ళి ఓ చెప్పు, కర్రతో మళ్ళీ లోపలికి వచ్చింది. అది చూస్తూనే వాసు

వణకసాగాడు.

"ఏం చేస్తావ్?" అన్నాడతను.

"ఏదో ఒకటి చేస్తానెండి. మీరటుకేసి తిరగండి—" అంది యమున. ఇలాంటి సమయాల్లో ఆమెకు భర్తంటే అనుకోకుండానే చిరాకు కలుగుతూంటుంది.

వాసు అటుకేసి తిరగాలనే అనుకున్నాడు. కానీ భార్య తేలును చంపగలదా? ఒకవేళ అదామెను కుడితే! తేలు చంపబడుతుందన్న భయమూ, తేలు ఆమెను కుడుతుందన్న అనుమానమూ—రెండూ కలిసి అతణ్ని ఏ నిర్ణయానికీ తీసుకురాలేకపోతున్నాయి.

యమున కర్రతో తేలును పొడిచింది. తేలు గోడ వారనే నాలుగడుగులు ముంగుకి కదిలింది. ఆమె "కోడి.. కోడి....కోడి..." అంటూ ఆగిన తేలుని మళ్ళీ పొడిచింది. అలా గోడవారన కొంతదూరం కదిలాక తేలు శర వేగంతో తనదారి మళ్ళించి యమునను సమీపించింది.

కెవ్వుమని అరిచింది యమున.

తేలామెను కుట్టింది.

యమున బాధతో మెలికలు తిరిగిపోతోంది. తేలు వున్నట్లుండి ఆశ్చర్యాన్నించి మాయమైపోయింది.

వాసు చటుక్కున మంచం దిగి భార్యను రెండు చేతుల్లో ఎత్తుకునివచ్చి మంచంమీద పడుకోబెట్టి—"నొప్పిగా వుందా యమునా!" అన్నాడు.

ఆ సమయంలో యమునకు వళ్ళు మండిపోయింది—"లేదండీ—చాలా హాయిగా వుంది!" అంది.

"నన్ను క్షమించు యమునా!" అన్నాడు వాసు.

"ఈ బాధలో నేను ఎవరినీ క్షమించలేను. అయినా మీకేం భయంలేదులెండి. పారిపోయిన ఆ తేలు ఏ మూల

నుండో మిమ్మల్ని చూస్తూనే వుంటోంది. మీరు దాన్న యితే చంపలేరు కానీ నా బాధ చూడగలరు కదా!" అంది యమున. ఆమె బాధ భరించలేక గట్టిగా అరుస్తోంది. ఏడుస్తోంది. భర్తను తిడుతోంది. విషం పైకెక్కకుండా ఆమె మోకాలుకి గట్టిగా చీరకొంగుతో కట్టు కట్టింది. కానీ బాధ తగ్గలేదు.

వాసు ఉప్పు, కిరసనాయిలు, ఉల్లిపాయ వగైరాలుపయోగించు కొన్ని గృహవైద్యాలు చేశాడు. యమునకు ఉపశమనం కలిగినట్లులేదు.

"రాత్రి తెల్లవార్లూ ఈ బాధ నువ్వు భరించలేవు. నువ్వు బాధపడుతుంటే నేను చూడలేను. వెళ్ళి డాక్టర్ని కలిసివస్తాను...." అన్నాడు వాసు.

"ఈ సమయంలో మీరిప్పుడెక్కడికీ వెళ్ళొద్దు—" అంది యమున.

"ఇంకా మన భోజనాలు కూడా కాలేదు. ఇప్పుడే వచ్చేస్తాగా...." అంటూ వాసు ఆమె అనుమతి కోసం ఎదురుచూడకుండా బయటకు వెళ్ళిపోయాడు.

యమున బాధతో మూల్గుతూ కూర్చుంది. అలా ఎంత సేపుందో ఆమెకే తెలియదు. కాసేపటి కామెకు బాధ తగ్గకపోయినా వాసింకా రావడంలేదేమిటా అన్న బెంగ పట్టుకుంది. టైము చూద్దామంటే అలారం టైంపీసు బల్లమీద అటు తిరిగివుంది. మంచం దిగి టైముచూసే ఓపిక ఆమెకు లేదు. ట్రాన్సిస్టర్ రేడియో మంచం మీదే వుంది. ఆమె దాన్ని ఆన్ చేసింది.

రేడియోలో ఇంగ్లీషు వార్తలు వస్తున్నాయి.

"అబ్బా—టైం తొమ్మిది దాటిందా? ఏడున్నర కాకుండా బయల్దేరిన మనిషి ఇంతసేపే డాక్టరు దగ్గర

ఆగిపోయారు చెప్మా?" అనుకుంది యమున. అప్పుడే ఆమెకు భర్త వెళ్ళాక తను తలుపులు వేసుకోలేదన్న సంగతి గుర్తువచ్చింది. కానీ మంచం దిగి వెళ్ళి తలుపులు వేసే శక్తి ఆమెకున్నట్లులేదు.

"నేనింత బాధలో వున్నానని ఆయనకు తెలుసు. నన్నిలా నిర్లక్ష్యంగా వదిలి వెళ్ళిపోయారు. ఇంట్లో ఏమైనాపోతే ఆయన కర్మ. నే నేంచేస్తాను...." అనుకుంది యమున చిరాగ్గా.

చూస్తూండగా టైము పదయింది. పదకొండయింది.

యమున బాధ తగ్గడంలేదు. వాసు రావడంలేదు. యమునకు కంగారుపట్టుకుంది.

చివరికామె ఓపిగ్గా ఎలాగో ధైర్యం చేసుకుని— మంచం దిగి కుంటుకుంటూ వీధి తలుపులు వేయడానికి వెళ్ళింది.

అప్పుడే వీధితలుపులు తోసుకుని వచ్చాడో వ్యక్తి.

"ఏమండీ వచ్చారా!" అంది యమున. ఆ ప్రశ్న వేశాక వచ్చిన వ్యక్తి తన భర్తకాడని గుర్తించింది యమున. అతడిచేతిలో కత్తివుంది.

"అరవకు. అరిచావంటే చంపేస్తాను...." అన్నాడా వ్యక్తి తలుపులు వేస్తూ.

## 9

మంచంమీద పడుకుని నవల చదువుకుంటోందామె. ఎవరో తలుపు తట్టారు.

ఆమె నవల దిండుకింద పెట్టి లేచివెళ్ళి తలుపుతీసింది. ఎదురుగా కనబడ్డ వ్యక్తిని చూసి ఆశ్చర్యంగా—"నువ్వా అన్నయ్యా—లోపలకు రా!" అంది!

అతను మౌనంగా లోపలకు వచ్చాడు. ఆమె తలుపులు

వేసి అతన్ని సమీపించి—"నువ్వెంతో మంచివాడివి. నీ కారణంగా...." అని ఏదో అనబోగా అతడు మాట్లాడ వద్దన్నట్లు సైగ చేశాడు.

"ఏం—ఏం జరిగింది?" అందామె.

"నేనీపూట ఇక్కడే భోంచేస్తాను. ఈ రాత్రి ఇక్కడే పడుకుని ఉదయం వెళ్ళిపోతాను—" అన్నాడతను. అతనామెవంకనే చూస్తున్నాడు. కానీ అతడి కళ్ళామెను చూస్తున్నట్లనిపించదు. గుడ్డివాడి చూపులా ఉందది.

"చాలా సంతోషం. ఇప్పుడే వంట చేస్తాను—" అంటూ వెళ్ళిపోయిందామె.

అతనక్కడే మౌనంగా కూర్చుని ఉండిపోయాడు. తర్వాత ఆమె భోజనానికి పిలిస్తే వెళ్ళాడు. వడ్డిస్తే భోంచేశాడు.

తర్వాత ఆమె గదిలోంచి ఓ పొడతమంచం తెచ్చి హాల్లో వేసింది. దానిమీద దుప్పటిపరిచి తలగడ వేసి— "పడుకో అన్నయ్యా—" అంది. అతనా మంచంమీద పడుకుని కళ్ళు మూసుకున్నాడు. ఆమె తన గదిలోకి వెళ్ళి పడుకుంది.

అతనికి వెంటనే నిద్రపట్టినట్లుంది. సన్నగా గురక కూడా ఆరంభించాడు. ఆమెకు మాత్రం నిద్రపట్టినట్లు లేదు. చదువుతున్న నవలను మాత్రం ఆమె పూర్తి చేయ లేదు. గదిలో దీపం ఆర్పేసి అతడి రాకలోని అంతర్యం గురించి ఆలోచిస్తూ మంచంమీద దొర్లుతున్నదామె. చాలా సేపటికి ఆమెకు నిద్రపట్టింది.

ఓ రాత్రివేళ అతను ఉలిక్కిపడి లేచాడు. మంచం మీద కూర్చుని కళ్ళు నలుముకున్నాడు. ఒక్కక్షణం

తర్వాత అతను మంచం దిగాడు. అడుగులో అడుగు వేసు కుంటూ ఆమె గదిలోకి ప్రవేశించాడు.

అప్పటికామెకు బాగా నిద్రపట్టినట్లుంది. వంటిమీద దుస్తులు అస్తవ్యస్తంగా వున్నాయి.

అతనామెను సమీపించి పరీక్షగా చూశాడు. చూస్తున్నకొద్దీ మనిషలో ఆవేశం పెరుగుతున్నదనిపించింది. చాలాసేపు అతను అచ్ఛాదన లేని ఆమె గుండెల వైపే చూసి నెమ్మదిగా ఆమెకు పక్కగా తనూ పడుకున్నాడు. అప్పటికీ ఆమెకు మెలకువరాలేదు.

అతనామెకు దగ్గరగా జరిగాడు. మీద చేయివేశాడు. అప్రయత్నంగా ఆమె అతడికి దగ్గరగా జరిగింది. అతనుత్సాహంగా ఆమెను కౌగిలిలో బంధించాడు.

ఆమె ఉలిక్కిపడి అతన్ని తోసేసింది.

అతనామెను మళ్ళీ దగ్గరగా లాక్కున్నాడు. ఈసారి ఆమె అతన్ని విడిపించుకోలేకపోయింది. కౌగిలిలో బిగిస్తూంటే భయంగా—"ఏమిటది?" అంది.

అతను జవాబివ్వలేదు. ఆమె బట్టలు విప్పడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఆమె మళ్ళీ అతన్ని తోసేసి—"అరిచి నలుగుర్ని పిలుస్తాను. అవతలకు పో!" అంది.

అతను మొల్లోంచి కత్తితీశాడు — "అరిచావంటే వెంటనే చస్తావ్—మర్యాదగా లొంగిపో—" అన్నాడు.

ఆమె భయంగా అతడి చేతిలోని కత్తివంక చూసింది. అది తళతళ మెరుస్తోంది. తర్వాత ఆమె అతడి కళ్ళవంక చూసింది. అతడి చూపులు క్రూరాతిక్రూరంగా వున్నాయి.

"నన్ను చంపుతావా?" అందామె.

"చంపే ఉద్దేశ్యం నాకు లేదు. కానీ నువ్వా అవసరం కల్పిస్తే చంపడానికి వెనుదీయను...."

అతడి కంఠస్వరం కఠినంగా వుంది. అతడి చేతిలోని కత్తికంటే—కంఠంలోని కరుకుదనం, చూపుల్లోని క్రూరత్వం ఆమె నెక్కువగా భయపెడుతున్నాయి.

"ప్లీజ్ నా జోలికి రాకు...." అందామె.

అతడామెను సమీపించాడు.

"ప్లీజ్—వద్దు!" అందామె.

ఒకచేయి కత్తిని ఆమె గుండెలకు ఆన్చింది. రెండో చేయి ఆమె బట్టలను విప్పుతోంది.

ఆమె కళ్ళలో ప్రాణభయం—మనసులో బెదురు—శరీరమంతా అదోరకమైన కంపన—భవిష్యత్తు గురించి ఎన్నోరకాల ఆలోచనలు.

అతడి కత్తి ఆమె గుండెలపై ఆని వుంది. ఇప్పుడామె గుండెలపై ఆచ్ఛాదనలేదు.

ఆమెకు అరవాలనివుంది. కానీ అరిస్తే ఆతను తన్ను చంపేస్తాడు.

అతడామెను దగ్గరగా లాక్కుంటుంటే ఆమె శరీరం అసహ్యంతో కంపిస్తోంది. కత్తి మనసును భయపెడుతూంటే తనువు అతడికి లొంగిపోతోంది.

ఆమెకిప్పుడు చేతనయింది ఒక్కటే—ఏడుపు!

అతడు సాచి ఆమెను లెంపకాయకొట్టాడు—"ఇడియట్! సంతోషంగా ఉండాల్సిన ఈ టైములో ఏడుస్తావా—నవ్వు....నుందు నవ్వు...."

ఆమెకు నవ్వు రావడంలేదు. ఏడుపే వస్తోంది.

నవ్వకపోతే అతడు కొడుతున్నాడు. ఆమెను హింసించి

అనందిస్తున్నాడు.

చివరి కామె నవ్వింది. పిచ్చిదానిలా నవ్వింది.

# 10

"మూడు రోజుల్నించి నా ఫ్రెండ్సతన్ని షాడో చేస్తున్నారు. ఇంతవరకూ చెప్పుకోదగ్గ విశేషమేమీ జరుగలేదు...." అంది సీతమ్మ.

"మన పరిశోధన తప్పుదారిలో వెడుతున్నదేమోనని పిస్తోంది—" అన్నాడు వెంకన్న.

అప్పుడే అక్కడ టెలిఫోన్ ట్రింగుమన్నది.

"హలో!" అన్నాడు వెంకన్న.

"హలో—వెంకన్నగారేనా—?" అందవతల్నించి ఓ స్త్రీ కంఠం.

"అవును...."

"వెంకన్నగారూ! నేనో పెద్ద పొరబాటు చేశాను. ఒక దుర్మార్గుణ్ని సన్మార్గుడనుకుని వాడి ఆచూకీ ఇంత కాలమూ దాచిపెట్టాను. వాడు నిన్న రాత్రి నా యింటి కొచ్చాడు. గౌరవంగా అన్నయ్యా అని పిలిచాను. అయినా నన్ను....నన్ను....క్రూరంగా హింసించి....బల వంతంగా అనుభవించి వెళ్ళిపోయాడు...." ఫోన్లో మాటలు ఆగి ఏడుపు ఆరంభమైంది.

"హలో—మీరెవరో చెబుతారా?"

"నేనెవరో తెలుసుకుని మీరేంచేస్తారు? రంగారావుని చంపిన హంతకుడెవరో చెబుతాను. వెళ్ళి అతన్ని పట్టుకోండి. నేనుమాత్రం ఈ కేసులో బయటకు రాదల్చుకోలేదు. అడ్రస్ నోట్ చెసుకోండి—" అంటూ ఆమె గబగబా ఓ చిరునామా చెప్పి ఫోన్ పెట్టేసింది.

"ఈ అజ్ఞాత యువతి ఎవరో?" అంటూ నిట్టూర్చాడు

వెంకన్న.

"నోట్ బుక్‌లో వ్రాసిన ప్రకారమే ఒక్కొక్క నేరమే జరిగిపోతోంది. మనం అనుకున్న శివరావు హంతకుడు కాదు—" అంది రాజమ్మ.

"ఈ యువతి చెప్పిందే నిజమైతే హంతకుడి పేరు వాసు. అతనింతవరకూ తటస్థపడలేదు. వెంటనే అతన్ని కలుసుకోవాలి...." అన్నాడు వెంకన్న.

"మన కైము శివరావుమీద వృథా అయింది. నిన్నరాత్రి కూడా శివరావు ఇల్లువదిలి బయటకు రాలేదట—" అంది సీతమ్మ.

"ఈ వాసు ఎవడో ఈ హత్యలన్నీ ఎందుకు చేస్తున్నాడో తెలుసుకోవాలి. అయితే అజ్ఞాత యువతి మాట పట్టుకుని అతడింటికి వెళ్ళి నేరసుడని ఎలా చెబుతాం? ఇంతవరకూ జరిగిన నేరాల్లో ఒక్కదానికీ క్లూ లేదు. హంతకుణ్ణి స్వయంగా చూసినామె అతడి పేరు, చిరునామా చెప్పింది కానీ తను బయటపడ్డంలేదు. కేసు చాలా క్లిష్టంగా వుంది—" అన్నాడు వెంకన్న.

"అసలు ఇన్స్పెక్టర్ గారి పరిశోధన ఎంతవరకూ వచ్చిందో? ఆయనేమైనా కొత్త విశేషాలు తెలుసుకున్నాడేమో?" అంది రాజమ్మ.

"అవును. అన్నట్లు నేనోసారి ఇన్స్పెక్టర్ని కలిసి రావాలి. ఈలోగా ఏదైనా అర్జెంటు మెసేజుంటే అక్కడికి ఫోన్ చేయండి—" అంటూ లేచాడు వెంకన్న.

# 11

వెంకన్న పోలీస్ స్టేషన్ చేరేసరికి అక్కడొక యువతి, యువకుడు ఉన్నారు. వారిద్దరూ భార్యాభర్తలని తెలుస్తూనే వుంది.

"వీళ్ళెవరు?" అన్నాడు వెంకన్న ఇన్స్పెక్టర్‌తో.
"నిన్నరాత్రి వీళ్ళింట్లో దొంగతనం జరిగింది. రిపోర్టివ్వడానికి వచ్చారు...." అన్నాడు ఇన్స్పెక్టర్.
"దొంగతనమెలా జరిగింది?" అన్నాడు వెంకన్న.
ఆ యువతి వివరించి చెప్పి—"ఆయన లేని సమయంలో వాడింట జొరబడి ఇంట్లోని విలువైనవన్నీ మంగళసూత్రాలతో సహా మూటకట్టుకుని పోయాడు. ఆ సమయంలో వాడు నా జోలికి రానందుకు సంతోషించాను...." అంది.
వెంకన్న దొంగతనం గురించి మరికొన్ని ప్రశ్నలు వేసి ఎక్కడ జరిగిందో అడిగి—ఆమె చెప్పిన సమాధానం విని ఉలిక్కిపడి వాళ్ళ పేర్లు అడిగాడు.
ఆమె పేరు యమున, అతడి పేరు వాసు!
వెంటనే వెంకన్న ముఖం గంభీరంగా అయిపోయింది-"మిస్టర్ వాసూ! నిన్ను నేను కొన్ని ప్రశ్నలడగాలి!"
"అడగండి!" అన్నాడు వాసు వినయంగా.
"నిన్నరాత్రి తేలుమందు తీసుకొస్తానని చెప్పి నువ్వెక్కడికి వెళ్ళావ్?" అన్నాడు వెంకన్న.
సమాధానంగా వాసు నవ్వి ఊరుకున్నాడు.
"సమాధానం కావాలి నాకు..." అన్నాడు వెంకన్న.
యమున కలగజేసుకుని—"ఈ ప్రశ్నడగడంవల్ల మీకేమిటి ప్రయోజనం?" అంది.
"ఉంది కాబట్టే అడుగుతున్నాను...." అన్నాడు వెంకన్న.
"అదేమిటో చెప్పండి!" అంది యమున పట్టుదలగా.
"ఈ దొంగతనం నీ భర్తే చేయించాడు...." అన్నాడు వెంకన్న.

ఈ అభియోగానికి యమున, వాసు ఇద్దరూ తెల్ల బోయారు. "ఆయనింట్లో ఆయనే దొంతనం చేయాల్సిన అవసరమేముంది?" అంది యమున.

"ఈ రోజుల్లో చాలామంది మగాళ్ళకి ఆడాళ్ళకి తెలియని ఖర్చులుంటాయి. అందుకోసం ఇలాంటి నాటకాలాడుతూంటారు. లేకపోతే ఏడున్నరకు బయటవెళ్ళిన నీ భర్త రాత్రి మూడింటికి తిరిగిరావడమేమిటి? ఇంట్లో ఒంటరి ఆడదుందని తెలిసీ మీద చేయివేయకపోవడమేమిటి?" అన్నాడు వెంకన్న.

"చేతిమీద దోమవాలితే చంపలేని నా భర్త దొంగతనానికంత ప్లానువేస్తారని నేననుకోను...."

యమున మాటలకు వెంకన్న నవ్వి—"చేతిమీద దోమను చంపలేనివాళ్ళు హత్యలు చేయలేరనుకోవడం చాలా తెలివితక్కువ. నిన్న రాత్రి నీ భర్త ఓ అమ్మాయిని మానభంగం చేసివచ్చాడంటే నమ్ముతావా?" అన్నాడు.

వాసు భయం భయంగా—"నిజంగా నాకేమీ తెలియదు—...." అన్నాడు.

"రాత్రి ఎక్కడికెళ్ళావో చెప్పు...." అన్నాడు వెంకన్న.

"నిజంగా నాకేమీ తెలియదు...." అన్నాడు వాసు.

ఇన్స్పెక్టర్ విసుగ్గా—"ఇదంతా ఏమిటి మిస్టర్ వెంకన్నా!" అన్నాడు.

"ఏదో నా పిచ్చి. రిపోర్టివ్వడమైపోతే వాళ్ళను వెళ్ళమనొచ్చు—" అన్నాడు వెంకన్న.

## 12

"శివరావు గ్రంథసాంగుడే! అతడికి అమ్మాయిల పిచ్చివుంది. చచ్చిపోయిన రంగారావు అంతటివాడు

కాకపోయినా చాలాకాలంగా అతడో అమ్మాయిచుట్టూ తిరుగుతున్నట్లు తెలుస్తోంది. ఆ అమ్మాయే మన అజ్ఞాత యువతి కావచ్చుననిపిస్తోంది—" అంది రాజమ్మ.

వాసుతో మాట్లాడటమయ్యాక వెంకన్న కేసు విష యంలో చాలా తీవ్రంగా పరిశోధించాడు.

శివరావుకీ, వాసుకీ ఎటువంటి సంబంధమున్నదో విచా రించాడు. ఇద్దరి గుణగణాల గురించీ విచారించాడు. పరి శోధనలో వాసు చాలా అమాయకుడనీ, నిజంగానే చీమను కూడా చంపలేనివాడనీ తేలింది. అలాంటివాడు హత్యలు చేస్తాడన్న విషయం నమ్మడం కష్టం. అయితే హత్యలు, నేరాలు జరిగిన రోజుల్లో అతడికి ఎలిబీ లేదు. ఆ రోజుల్లోనే అతడు సెకండ్ షో పిక్చర్ కి వెళ్ళినట్లూ వెంటనే ఇంటికి తిరిగి రానట్లూ యమున డైరీలో వుంది. అతడికి శివరావుతో ఎటువంటి సంబంధం లేదు.

కానీ శివరావు గుణగణాలు మంచివికావు. అతను తరచు వ్యభిచార గృహాలకి వెడుతుంటాడు. ఈ విష యంలో అతడికి సహకరించే ఒక వ్యక్తిద్వారా అజ్ఞాత యువతి వ్యవహారం బయటపడింది. వెంకన్న ఆమెను కలుసుకున్నాడు.

ఆమె పేరు రమ. ముందామె విషయం ఒప్పుకోలేదు. వెంకన్న దబాయించగా ఒప్పుకుని తన పేరు బయటకు రానివ్వద్దని వేడుకుంది.

"శివరావు నన్ను కోరాడు. నేను నిరాకరించాను. రంగారావుకన్ను నామీదపడేలా చేస్తానని బెదిరించాడు. అతనే అలా చేశాడో ఏమోకానీ నేను రంగారావు ట్రాప్ లోపడి అతనింటికి వెళ్ళాను. అక్కడ రంగారావు బలవంతం చేయబోయాడు. నేను ప్రతిఘటించి అలసి

పోయాను. నా సర్వస్వం దోచుకోబడే సందర్భంలో వాసు వచ్చి రంగారావుని క్రూరంగా హింసించి చంపి నా మానం కాపాడాడు. అతను నా జోలికి రాలేదు. సరిగదా సరైన ఆచ్ఛాదన లేని నా వంటిమీద గుడ్డ కూడా కప్పాడు. అప్పుడే నేనతన్ని నోరారా అన్నయ్యా అని పిలిచాను. ఈ సంఘటన జరిగాక శివరావు మళ్ళీ నన్ను సమీపించాడు. అతన్ని నేను తిప్పికొట్టాను. తర్వాత వాసువచ్చి నన్ను మానసికంగా హింసించి శారీర కంగా అనుభవించి వెళ్ళిపోయాడు. ఇదీ నా కథ. ఇందులో నా కింకేమీ తెలియదు—" అందామె.

"నువ్వు మొట్టమొదటే వాసు పేరు బయటపెట్టి వుంటే నేను నిన్ను రక్షించగలిగి ఉండేవాణ్ని—" అంటూ వెంకన్న ఆమెకు తన దగ్గరున్న నోట్ బుక్ చూపించాడు.

అది చదివి అదిరిపడింది రమ—"ఆ వాసు చాలా మంచివాడనీ నన్ను రక్షించడానికి వచ్చాడనీ అను కున్నాను నేను. ఆవేశంతో హత్యచేశాడు తప్పితే ఇలా పథకం ప్రకారం హత్యలు, నేరాలు చేస్తున్నాడని ఊహించలేకపోయాను. చేజేతులా ఘోరం అనుభవిం చాను...."

"ఇప్పటికైనా కళ్ళు తెరిచావు. ఆ వాసుని పట్టివ్వ డంలో సహకరిస్తావా?" అన్నాడు వెంకన్న.

"ఈ క్షణంనుంచీ మీరేం చెబితే అది చేస్తాను...." అంది రమ.

అతనక్కణ్నించి ఇంటికి వెళ్ళేసరికి—"బాస్ ఓ పెద్ద కనెక్షన్ దొరికింది—" అంది సీతమ్మ.

"ఏమిటదది?" అన్నాడు వెంకన్న.

"కూరగాయల లచ్చన్న రంగారావుకు ఆడపిల్లల్ని ఏర్పాటుచేసేవాడు. తన పేరు బయటకు రాకుండా చాలా పకడ్బందీగా వ్యవహరించేవాడు లచ్చన్న" అంది సీతమ్మ.

వెంకన్న బుర్రలో రకరకాల ఆలోచనలు మెదులుతున్నాయి. రంగారావు, విష్ణుమూర్తి, కూరగాయల లచ్చన్న, రమ-అందరికీ శివరావుతో సంబంధం వుంది. వాసు అతడి తరఫున నేరాలు చేస్తున్నాడు. అతడు కిరాయిగూండా కాదు. హత్యలు చేయగల ధైర్యం కూడా అతనికి లేదు.

ఏమిటీ విచిత్రం?

అప్పుడే అతడికి నోట్ బుక్‌లోని అయిదవ అంకె గుర్తుకొచ్చింది.

ఇంకా ఒక నేరం జరగాలి. ఈ నేరం కూడా వాసు చేస్తాడా?

ఇప్పుడు వాసుమీద వెంకన్న నిఘామనుషులున్నారు. అతణ్ని తెలివిగా ట్రాప్ చేయడం కోసం వాసుపై తనకు గల అనుమానాలను బహిర్గతం చేయలేదు వెంకన్న.

## 13

ఆ రోజు రాత్రి వెంకన్నకు ఫోన్ వచ్చింది—వాసు సెకండ్ షో పిక్చర్‌కి బయల్దేరినట్లు. వెంకన్న వివరాలు నోట్ చేసుకుని తనూ ఆ పిక్చర్‌కి వెళ్ళి వాసుని ఓ కంట కనిపెడుతున్నాడు.

సినిమా ఇంకా పూర్తికాకుండానే వాసు లేచాడు. అతడితోపాటే వెంకన్నా లేచాడు.

వాసు చకచకా నడుస్తున్నాడు. దారి అతడికి పూర్తిగా తెలిసినట్లే వుంది. వెంకన్న అతన్ని అనుసరి

స్తున్నాడు.

వాసు ఓ యింటిముందాగి తలుపు తట్టాడు. సుమారు ఇరవైయేళ్ళ కుర్రాడు తలుపు తీశాడు.

వాసు చివాలున లోపలకు అడుగుపెట్టి ఆ కుర్రాణ్ని చేతోపట్టుకుని—"అరవకు—" అన్నాడు. అప్పుడే అతడి రెండో చేయి గాలిలోకి లేచింది. ఆ చేతిలో కత్తివుంది.

వెంకన్న వెనకనుంచే వాసు చేతిమీద ఓ దెబ్బవేశాడు. అతడి చేతిలోని కత్తి జారిపడింది. వాసు వెనక్కి తిరగ లేదు. అతడా కుర్రాడి పీక పట్టుకున్నాడు. ఆమాత్రా నికే ఆ కుర్రాడికి స్పృహ తప్పినట్లుంది.

వెంకన్న వాసు రెండో చేతిమీద దెబ్బవేశాడు.

వాసు చటుక్కున వెనక్కి తిరిగాడు.

"మిస్టర్ వాసూ! ఏమిటీపని!" అన్నాడు వెంకన్న.

"నా పేరు వాసుకాదు—" అన్నాడతను క్రూరంగా వెంకన్నవైపే చూస్తూ.

"మరేమిటి నీ పేరు?"

"శివరావు!"

ఉలిక్కిపడ్డాడు వెంకన్న—"మిస్టర్ శివరావ్! నువ్వేనా! రంగారావునీ, విష్ణుమూర్తినీ, లచ్చన్ననీ హత్య చేశావ్. రమకు మానభంగం చేశావ్....ఎందుకిదంతా చేస్తున్నావ్?" అన్నాడు.

"ఎందుకా?" రమ నాకు లొంగలేదు. లచ్చన్న సాయం అడిగాను. తనవల్ల కాదన్నాడు. నావల్ల కాదన్న వెధవ రమను రంగారావుకు అప్పజెప్పాడు. అందుకే రంగారావును లచ్చన్నను కూడా చంపేశాను. రమను మానభంగం చేసేశాను. ఆ సిక్కోసం అన్నయ్యను చంపే శాను. ఇదుగో—ఈ కుర్రాడు....వీడు మా నాన్నకు

కలిగిన అక్రమ సంతానం. తనకు చదువు చెప్పిస్తేచాలు— మా పరువు పోకుండా తన బ్రతుకు తను బ్రతుకుతా నన్నాడు. అయితే మాత్రం వీళ్ళెంతకాలం భరించేది?" అన్నాడు వాసు.

"నువ్వేమో— పేరు శి వ రా వ ని అంటున్నావు. చూడ్డానికి వాసులా వున్నావు...." అన్నాడు వెంకన్న.

"అదా?" అని నవ్వాడు వాసు—"నాకు సైకాలజీ బాగా తెలుసు. మనం చేయాలనుకున్న పనులు మనం చేయక్కర్లేకుండా కొందరు బలహీన మనుష్యులచేత చేయించవచ్చు. ఓసారి హోటల్లో ఎదురయ్యాడు వాసు. బయటవున్న ఊరకుక్కను నేను కొట్టాలనుకోగానే అతను కొట్టాడు. అప్పుడే నాకు అయిడియావచ్చి అతడి మీద ప్రయోగం ప్రారంభించాను. అతడి మెదడు నాకు వశమైంది. నేను నా గదిలో ఏకాగ్రత వహించానంటే అతనిక్కడ నేను చేయాలనుకున్నపని చేస్తాడు. అప్పు డతని మెదడు, ఆలోచనలు—అతనివి కావు. నావి...."

వెంకన్న ఆశ్చర్యంగా—"ఇది నేను నమ్మను. నమ్మ లేను...." అన్నాడు.

"నమ్మినా, నమ్మకపోయినా ఇది నిజం...." అంటూ వాసు—"మిస్టర్ వెంకన్నా—నన్ను వదులు...." అన్నాడు.

వెంకన్న అతన్ని వదల్లేదు. మెడపక్కన ఏదో నరం మెలితిప్పి అతడికి స్పృహ తప్పించాడు.

* * *

శివరావు ఇంటిని హఠాత్తుగా దాడిచేయగా వాసు విచిత్ర స్థితిలో వెంకన్నకు చెప్పిన విషయాలన్నీ నిజమేనని తెలిసింది. వెంకన్నవంటివాడు నేరం చేసే

టప్పుడు వాసుకు ఎదురౌతాడన్న విషయం శివరావు గ్రహించలేదు. అందువల్ల వాసు నాలోచించుకునివున్న ఆలోచనలన్నీ అతను వెంకన్నకు చెప్పేశాడు.

శివరావు ఇంట్లో మానసిక శాస్త్రానికి సంబంధించిన పుస్తకాలూ, అతడు హత్యలకు వేసుకున్న రకరకాల పథకాలూ, అతడు తన ప్రయోగాల విషయంలో తయారు చేసుకున్న నోట్సు అన్నీ దొరికాయి.

ఇటువంటి వింత కేసు తటసపడినందుకు పోలీలు అధికారులు అదిరిపోయారు. ఈ కేసు పరిశోధించిన, పరిశోధించగలిగిన వెంకన్నకు అభినందన పరంపరలు శాతాధికంగా వచ్చిపడసాగాయి.

అయితే విషయం వెంటనే వాసూ వరకూ వెళ్ళలేదు. ఒక రకమైన అపస్మారక స్థితిలో అతడు హత్యలు చేశాడు. ఆ వార్త విని అతడు మతిపోగొట్టుకుంటే ఆశ్చర్యంలేదు.

శివరావు అరెస్టయ్యాడు. వాసు విషయం ఏంచేయాలో లాయర్లకు వదిలిపెట్టాడు వెంకన్న. ఓ ప్రముఖ లాయరు వాసునీ కేసునుంచి రక్షిస్తానన్నాడు. అప్పుడాయన్ను తీసుకుని వెంకన్న వాసు ఇంటికి వెళ్ళాడు.

డాక్టరు సలహాపేరిట వాసు బెడ్ రెస్ట్ తీసుకుంటున్నాడు.

వెంకన్నను చూసి అతడు లేచాడు. వెంకన్న అతన్ని పడుకోమని — "నీ కోసం లాయర్ని తెచ్చాను—" అన్నాను.

"ఎందుకు?" అన్నాడు వాసు.

"నీకు తెలియకుండా నువ్వు చేసిన హత్యల విషయంలో నిన్ను రక్షించడానికి!"

"నేను హత్యలు చేశానా?" వాసు ఆశ్చర్యంగా

అడిగాడు.

వెంకన్న నెమ్మదిగా శివరావు పథకం గురించి చెప్ప సాగాడు.

రంగారావు హత్యగురించి విన్నాడు వాసు. అతడి కళ్ళు పెద్దవయ్యాయి. విష్ణుమూర్తి హత్యగురించి వినగానే కెవ్వుమని కేక వేశాడు. అతడు తెరచిన నోరు తెరిచినట్లే వుండిపోయింది.

"ఏమయింది?" అన్నాడు లాయర్.

వెంకన్న వాసుచేయి బట్టుకుని నాడి పరీక్షించి—"పాపం యమునకు అన్యాయం జరిగిపోయింది—" అన్నాడు.

* * *

"అతడు చనిపోవడమే మంచిది. బలహీనమైన అతడి మెదడు గురించి తెలిశాక ఇంకా ఎంతమందికి దుర్బుద్ధి పుడుతుందో—" అన్నాడు వెంకన్న—భార్య పద్మావతీదేవితో మాట్లాడుతూ.

—: ఐపోయింది :—

# అరబ్బీ అల్లుడు!

## వాణిశ్రీ

ఆ గదిలో ఇంకా లైటు వెలుగుతూ వుంది.

అక్బర్ చిరాకుగా బీడీ వెలిగించి గట్టిగా దమ్ము పీల్చాడు.

అప్పటికి రాత్రి పది దాటింది.

స్ట్రీట్ లైట్లు అక్కడక్కడా గుడ్డిగా వెలుగుతున్నాయి.

రోడ్డు మీద జనసంచారమే లేదు. చలిగాలి రివ్వున వీస్తోంది. అప్పుడే మంచు తెరలు తెరలుగా కురవడం ఆరంభమైంది.

అక్బర్ రోడ్డుప్రక్కనున్న చింతచెట్టు కొమ్మలో కూర్చుని వున్నాడు అరగంటనుంచీ. అతని దృష్టి అంతా ఎదురుగావున్న ఆ పాత భవనంపైనే వుంది.

ఆ గదిలో లైటు ఆరిపోగానే తను సిద్ధంగా వుండాలి. ఆ ముసలాడు పడుకున్న పదినిముషాలకే గుర్రుపెట్టి నిద్ర పోతాడు.

'బద్మాష్ ముండాకొడుకుని ఒక్క పోటుతో అల్లా దగ్గరికి పంపాలి' అనుకున్నాడు అక్బర్ కసిగా.

అక్బర్ వూహించినట్లే కాసేపటికి ఆ గదిలో లైటు ఆరిపోయింది.

అరగంట తర్వాత అక్బర్ నెమ్మదిగా చెట్టుదిగి ప్రహరిగోడ ఎక్కి లోపలకు దూకాడు.

ఒక్కొక్క అడుగు వేస్తూ, ఎవరైనా తనను గమనిస్తున్నారేమోనని వెనక్కి తిరిగి చూస్తూ ఆ భవనం దగ్గరికి చేరుకున్నాడు.

కొన్ని నెలలుగా అక్బర్ కి ఆ భవనం బాగా పరిచయమే. ఆ ముసలాడు లోపల గడివేసుకున్నా లోపలకు ఎలా ప్రవేశించాలో బాగా తెలుసు. అందుకు ప్లాన్ సిద్ధం చేసుకునే వచ్చాడు.

దక్షిణం వైపువున్న గదికి అద్దాల కిటికీ వుంది. దానికి లోపల ఇనుప వూచలు లేవు. బోల్టులు పెట్టివుంటాయి. బోల్టుదగ్గర పగలకొట్టి చేతితో లోపల బోల్టుతీయవచ్చు. ఇక ఆ గదిలో ప్రవేశిస్తే ఇంట్లో ఎక్కడికైనా నిరాటంకంగా వెళ్ళిపోవచ్చు.

అక్బర్ దక్షిణం వైపువున్న గది దగ్గర నిల్చున్నాడు. అంతా చీకటి. ఆ చుట్టుప్రక్కల ఇళ్ళల్లోకూడా ఎక్కడా అలికిడిలేదు.

అక్బర్ చుట్టూ పరిశీలనగా చూసి చిన్నరాతితో అద్దాన్ని గట్టిగా కొట్టాడు. గాజుముక్కలు గలగలలాడాయి నేలమీద పడి.

గాజుముక్కలు పడిన శబ్దానికి ఆ ముసలాడు లేచి వస్తాడేమోనని అక్బర్ ఒక జిల్లేడుచెట్టు మొదట్లో నక్కాడు.

పావుగంట గడిచినా లోపల చడీ చప్పుడూ లేదు.

అక్బర్ కి ధైర్యం వచ్చింది.

ఆ బద్మాష్ లేవలేదన్నమాట అనుకున్నాడు.

కిటికీ బోల్టుతీసి బార్లా తెరిచాడు. ఒక్క వూపులో ఎగిరి లోపలపడ్డాడు. బూటు క్రింద గాజు పెంకులు కర కరా నలిగాయి. లోపలకు వెళ్ళగానే కిటికీ తలుపులు పెట్టేశాడు.

జేబులోనుంచి పెన్ టార్చితో దారి చూసుకుంటూ ఆ ముసలాడు పడుకున్న గదిలోకి ప్రవేశించాడు.

ఒకమూల స్టూల్ మీద టేబుల్ ఫ్యాన్ గిరాగిరా తిరుగుతోంది.

గది మధ్యలో ఇనుపమంచంమీద దోమ తెరలో పడు కుని వున్నాడు ముసలాడు.

అడుగులో అడుగు వేసుకుంటూ బెడ్ దగ్గరికి వెళ్ళి దోమ తెర పైకిలేపాడు.

ముసలాడి ముఖం చూడగానే ఆవేశం పెల్లుబికింది.

పాంట్ జేబులోనుంచి తోలుకవరులోవున్న కైజారు చురుగ్గా లాగాడు.

పిడికిలి బిగించి చెయ్యి పైకి తీసాడు పొడవడానికి.

అంతలో ఒక సందేహం వచ్చింది అక్బర్ కి. కత్తితో పొడవగానే కెవ్వుమని వాడు కేక పెడితే అది ఎవరికైనా విన్పించవచ్చుగదా అని.

నిజమే! లేనిపోని ఆపద కొని తెచ్చుకున్నట్లవుతుంది అనుకున్నాడు.

హేంగర్ కి తగిలించివున్న కోటుతో నోటిని నొక్కి పెట్టి కస్సున దించాడు కైజారు. అది గుండెలో దిగ బడింది. పైకితీసాడు. బుస్సున చిమ్మింది నెత్తురు.

ఎర్రటి నెత్తురు చూడగానే అక్బర్ కి ఆవేశం పదింత

రైంది. పిచ్చెక్కిన వాడిలా అందిన చోటల్లా లెక్క లేనన్ని పోట్లు పొడిచాడు. తెల్లటిబెడ్ ఎర్రగా మారి పోయింది.

'చచ్చాడు ముసలినక్క' అనుకుని ఆ గదిలో తనకు కావల్సినవి తీసుకుని తలుపులు తీసుకుని ఇంటిముందు నుంచే వెళ్ళిపోయాడు.

ప్రహరీగోడ ప్రక్కనే కైజారును పాతిపెట్టాడు.

ఎగిరి గోడ ఎక్కాడు.

చేతిలో బరువైన సంచీ వుంది. అందులో ఆ ముసలాడి టేప్ రికార్డర్, కెమేరా, వాచీ,పర్సు వగైరావున్నాయి.

అయితే, దురదృష్టం అతన్ని వెన్నాడింది.

అతను గోడమీద వుండగా ఆ వీధిలోనే వుంటున్న ఖాదర్ ఆటోలో వస్తూ, అక్బర్ ని చూశాడు. అప్పటికి అక్బర్ గోడదిగి రోడ్డుమీదకు వచ్చాడు.

గోడమాకి రోడ్డుమీదకు వచ్చిన అక్బర్ని చూసే సరికి అతనికి అనుమానం వచ్చింది. ఆటో ఆపించి గట్టిగా అరిచాడు "చోర్ .... చోర్ ...." అని.

అక్బర్ వులిక్కిపడి, రోడ్డుదిగి, ఒక సందులోకి పారిపోయాడు.

ఖాదర్ అతన్ని పట్టుకోవాలని వెంటపడ్డాడు గాని అక్బర్ చిక్కలేదు. ఆ సందుల్లో ఎక్కడో మాయ మయ్యాడు.

వుసూరుమంటూ మళ్ళీ రోడ్డుమీదకు వచ్చాడు ఖాదర్. ఆటో డ్రైవర్ తాపిగా బీడీ కాల్చుకుంటూ కన్పించాడు.

ఆటోలో ఖాదర్ భార్య, ఇద్దరు పిల్లలు వున్నారు. అతను రాగానే భార్య చీవాట్లు పెట్టింది. దారినపోయే

గొడవ మనకెందుకు అని.

అక్కడికి అతని ఇల్లు దగ్గరే. చలికాలం కావటంవల్ల అంతా తలుపులు బిగించుకుని పడుకున్నారు. అతని కేకలకు గూడా ఎవరూ లేవలేదు.

ఆటో అతని ఇంటిముందు ఆగింది. డబ్బులు ఇచ్చి పంపించేశాడు.

కాని ఖాదర్ కి ఏంచేయాలోతోచలేదు. తను కళ్ళారా ఒక దొంగనిచూశాడు. ఆ ఇంటి గోడదూకి వస్తుంటే ఆటో డ్రైవర్ గూడా గమనించాడు. వాడి చేతిలోవున్న సంచీలో దొంగసొమ్ము వుండివుంటుంది.

ఇప్పుడేంచెయ్యాలి?

ఆ ఇంట్లో దొంగతనం జరిగిందని పోలీసులకు రిపోర్టు ఇస్తే?

ఆ ఇంట్లో ఎవరో ఒక ముసలాయన వున్నాడు. తనకి పరిచయంలేదు అతనితో.

ఇప్పుడు ఆ ఇంట్లో అతను వున్నాడో లేదో? ఎక్కడికైనా వెళ్ళాడేమో? అది గమనించి ఎవరైనా దొంగతనం చేశారేమో?

## 2

సీత సిటీబస్ ఆగింది.

ఆమె వెనకనే దిగాడు రాజారెడ్డి.

ఆ స్టాప్ లో వాళ్ళిద్దరే దిగారు.

ఆమె చేతిలో చిన్న బ్యాగ్ మాత్రమేవుంది.

రాజారెడ్డి చేతిలో టిఫిన్ బాక్సువుంది.

సిటీబస్ దుమ్ము రేపుకుంటూ వెళ్ళిపోయింది.

రాజారెడ్డి అన్నాడు "ఎక్కడున్నుంచి వస్తున్నావ్?"

"మా వూర్నించి" అంది సీత.

"ఇంత రాత్రి ఒక్కదానివే వస్తున్నావే!"

"చీకటి పడకుండా వచ్చేదాన్నే. బస్సు చెడిపోయింది. అందుకే ఇంత ఆలస్యం."

"వారం నుంచి కన్పించకపోతే ఎక్కడికి వెళ్ళావో అనుకున్నా!" నవ్వుతూ అన్నాడు రాజారెడ్డి.

"ఎక్కడికి వెళ్ళాననుకున్నావ్?" వాలు చూపులు చూస్తూ కొంటెగా అంది సీత.

"అత్తగారింటికి వెళ్ళావేమోనని...."

"ఛీ.... పెళ్ళికాకుండా అత్తగారింటికి ఎట్లా వెళ్తారు?"

"పెళ్ళి ఇక్కడే అవ్వాలని ఏముంది?" అంటూ ఆమెకు దగ్గరగా నడిచి చెయ్యి పట్టుకున్నాడు.

"ఎందుకూ దూరం దూరంగా నడుస్తావ్? కొంచెం దగ్గిరగా నడవరాదూ! చలిగా వుంది కూడాను" అన్నాడు రాజారెడ్డి.

"వదులు....ఎవరైనా చూస్తారు" అంది సీత చేతిని విదిలించుకుంటూ.

రాజారెడ్డి గట్టిగా పట్టుకొని "ఎందుకూ అంత భయం? ఎవరూ చూడరులే...." అన్నాడు ఇంకా దగ్గరగా జరుగుతూ.

"అబ్బబ్బ నీకు....సిగ్గులేదు" అంది సీత విసుగ్గా.

"అవును. నిజమే. అందుకే కిటికీలోంచి ఫోజులు కొడుతున్నాను" అన్నాడు నవ్వుతూ.

సీతకు సిగ్గు ముంచుకొచ్చింది.

"అది వేరు...." అంది.

కొంచెం దూరం నడిచాక అంతా చిమ్మ చీకటి. స్ట్రీట్ లైట్లు వెలగడంలేదు కనుచూపు మేరలో.

"ఎంత చీకటిగా వుందో!" అంది సీత.

"మనకోసమే...." అంటూ రాజారెడ్డి ఆవేశంతో ఆమెను హత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు.

సీతకు క్షణకాలం కాలం స్తంభించిపోయినట్లయింది.

ఆ చలిలో వెచ్చటి రాజారెడ్డి కౌగిలి స్వర్గాన్ని చూపిస్తోంది. అతన్ని రెండు చేతులతో తే దగ్గరికి లాక్కుంది వంకర్లు తిరిగిపోతూ.

"ఎప్పుడూ ముద్దులేనా?" ఆమె చెవిలో గుసగుస లాడాడు.

"మరేం కావాలి?" గోముగా అంది సీత.

"నీకు తెలీదా?"

"వుహూఁ...."

"ఒకరాత్రి ఏకాంతంగా నీతో గడపాలి."

"అబ్బ, ఎంత ఆశ."

"దురాశ. అవునుగాని.... ఇదే ఛాన్సు మళ్ళీ రాదు మనకి. వెనక్కి వెళ్ళిపోదామా?" అన్నాడు రాజారెడ్డి.

"ఎక్కడికి?"

"ఏదైనా హోటల్లో హాయిగా గడిపి తెల్లవారి వచ్చేద్దాం. ఏమంటావ్?"

"అమ్మో! హోటల్లోనా! పోలీసులు పట్టుకుంటారు. వద్దు బాబూ!...." అంది సీత.

రాజారెడ్డికి నిరాశ కలిగింది.

నెమ్మదిగా అతన్ని వదిలించుకుంది సీత.

ఇద్దరూ నెమ్మదిగా నడవసాగారు. ఇద్దరి శరీరాలు దగ్గరగా వున్నాయి. ఒకరి చేతిలో మరొకరి చెయ్యి వెచ్చగా నలిగిపోతోంది.

ఇంటికి చేరుకుంటే విడిపోవాలి. మళ్ళీ ఇలా చేతిలో

చెయ్యి వేసుకుని తిరిగే అదృష్టం దొరకదు. చూపులతోనే సరి. ఎప్పుడో ఒక వేడిముద్దు దొరుకుతుంది. అంతే.

నడుస్తున్న వాడల్లా ఠక్కున కాళ్ళకు బ్రేకులుపడిన వాడిలా ఆగిపోయాడు రాజారెడ్డి.

"సీతా!...."

"వూఁ...."

"ఈ ఇంట్లో ఒక ముసలాయన వున్నాడు. ఒక్కడే వుంటున్నాడు. మనం ఈ రాత్రికి అతని ఇంట్లో గడిపి ప్రొద్దున్నే వెళ్ళిపోదాం."

"వద్దు...."

"ప్లీజ్...."

"ఎవరికైనా తెలిస్తే!"

"ఎలా తెలుస్తుంది?"

"ఆ ముసలాయన ఎవరికైనా చెప్తే?"

నవ్వాడు రాజారెడ్డి.

"వాడికి తెలుగురాదు. వురదూ కూడా సరిగ్గారాదు.. మనం మాట్లాడుకునేవి వాడికి చచ్చినా అర్థంకాదు" అన్నాడు.

సీత మనసు వెనక్కీ ముందుకీ ఊయల లూగుతోంది. మూడేళ్ళనుంచీ పరిచయం వున్నా చెప్పుకోదగ్గ మధుర క్షణాలు ఏవీలేవు, అప్పుడప్పుడూ ముద్దులు తప్ప. అవకాశం ఆమెను ప్రోత్సహిస్తున్నా అంతరాంతరాల్లో ఏదో భయం కలుగుతోంది.

"పోదాం పద...." చెయ్యిపట్టుకుని లాగాడు.

"ముందు అడిగిరా అతన్ని. మనం వుండటానికి ఒప్పుకుంటాడో లేదో!" అంది సీత.

"సరే నువ్విక్కడే వుండు...." అన్నాడు రాజారెడ్డి.

సీత తల వూపి చింతచెట్టు ప్రక్కన ఒరిగిపోయింది.

రాజారెడ్డి ఇనుప గేటు దూకి వెళ్ళాడు.

"హసన్ సాబ్....హసన్ సాబ్!" అని నాలుగైదు సార్లు కేక వేశాడు.

లోపలనుంచి సమాధానం రాలేదు.

తలుపుతట్టాడు. కిర్రుమని తెరుచుకుంది.

"హసన్ సాబ్!...." అంటూ నెమ్మదిగా లోపలకు వెళ్ళాడు.

బెడ్ రూమ్‌లో బెడ్ లైట్ వెలుగుతోంది.

తలుపులు తెరిచే వున్నాయి.

బెడ్ రూమ్‌లో ప్రవేశించిన రాజారెడ్డికి హసన్ శరీరం నెత్తురు మడుగులో కన్పించింది.

షాక్ తిన్నవాడిలా అదిరిపోయాడు. గుండెలో రైలు పరిగెత్తినట్లు వుక్కిరిబిక్కిరై పోయాడు. కాళ్ళు గడగడా వణికాయి.

పరుగువంటి నడకతో వెనక్కి తిరిగాడు. కాలు క్రింద ఏదో మెత్తగా తగిలింది. ఆగి చేతిలోకి తీసుకున్నాడు. అది కైజారు తోలు కవరు. దాన్ని ముట్టుకునేసరికి అతని శరీరం భయంతో జలదరించింది. పాముని చూసినవాడిలా విసిరికొట్టాడు

ఆ గదిలోనుంచి బైటపడ్డాడు.

సీతతో అనుభవం, సుఖం దేవుడెరుగు ముందీ కొంపలో నుంచి బైటపడే మార్గం చాలు అనుకుంటూ పరుగుతీశాడు.

ఇంట్లోనుంచి బైటపడేసరికి రోడ్డుమీద జీప్ ఆగిన శబ్దం వినిపించింది.

వాళ్ళు పోలీసులని క్షణాలలో గ్రహించాడు.

వాళ్ళు గనుక తనను చూస్తే హసన్‌ని హత్య చేసింది

తనే అని కేసుపెట్టి వురిశిక్ష వేయిస్తారు.

రాజారెడ్డికి భయంతో శరీరం చల్లబడింది. ఒక్క క్షణం చుట్టూ చూశాడు. ఒక్కటే మార్గం కనిపించింది. అదే దొడ్డిదారి.

పోలీసులు ఆ కాంపౌండ్‌లోకి అడుగుపెట్టకముందే దొడ్డి వెనక్కి వెళ్ళి గోడమీదుగా బైటపడ్డాడు.

అక్కడ రోడ్డుప్రక్కన చెట్టుమొదట్లో నిల్చున్న సీత జీప్ వచ్చి ఆగటంలో కంగారుపడింది. అక్కడ్నుంచి వడివడిగా అడుగులు వేసింది.

ఇన్స్‌పెక్టర్ చూడనే చూశాడు.

"ఏయ్! ఆగు...." అన్నాడు.

జీప్ హెడ్‌లైట్ల వెలుగులో సీతని నఖశిఖపర్యంతం పరీక్షగా చూస్తున్నారు పోలీసులు.

"ఎవరు నువ్వు?"

సీతకు భయంతో నోటివెంట మాటలు రాలేదు. లైట్ల కాంతి కళ్ళమీదపడి వాళ్ళు మసక మసకగా కనిపిస్తున్నారు.

"మాట్లాడవేం?" గద్దించాడు ఇన్స్‌పెక్టర్ సుదర్శన్.

"నేను .... నేను .... బస్సుదిగి వస్తున్నాను .... " మాటలు తడబడ్డాయి.

"నేను చూస్తూనే వున్నా! ఈ చెట్టుక్రింద ఆగావు ఎందుకు?"

సీతకు అంత కంగారులోనూ ఒక వుపాయం స్ఫురించింది.

వెంటనే సిగ్గును అభినయిస్తూ చిటికెన వేలు చూపింది.

"ఎవరి అమ్మాయివి నువ్వు?" ప్రశ్నించాడు ఇన్స్‌పెక్టర్.

"నరసయ్య చెల్లెల్ని!"

"నరసయ్య ఎవరు?"

"మా అన్నయ్య."

"అన్నయ్య సరే ఎక్కడ మీ ఇల్లు."

"లక్ష్మీనగర్ కాలనీలో."

"ఏంచేస్తాడు మీ అన్నయ్య?"

"బిస్కెట్ కంపెనీలో డ్రైవరు."

ఇన్స్పెక్టర్ నోట్ బుక్ తీసి "నీ పేరు?" అన్నాడు.

"సీత."

"మీ అన్నయ్య పేరు నరసయ్య. ఇంటి నెంబరు చెప్పు."

సీత చెప్పింది.

"ఇక వెళ్ళు" అన్నాడు.

'బ్రతుకుజీవుడా' అనుకుంటూ వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది సీత.

"మిస్టర్ ఖాదర్!"

"జీ...." అంటూ వచ్చాడు ఖాదర్.

"ఈ ఇల్లేనా?" ప్రశ్నించాడు ఇన్స్పెక్టర్.

"హా సాబ్!...." అని తను ఆటోలోవస్తూ వుండడం, ఎవడో దొంగ గోడదూకి వచ్చాడనీ, వాడి చేతిలో సంచీవుందనీ, తను ఆటో దిగి వాడిని తరుముకెళ్ళాననీ, కానీ వాడు ఆ సందుల్లో ఎక్కడో మాయమయ్యాడనీ ఆ తర్వాత తను పోలీస్ రిపోర్టు ఇచ్చాననీ అంతా చెప్పాడు ఖాదర్.

"ఈ ఇంట్లో ఎవరు వుంటున్నారు?"

"అబ్దుల్లా హాసన్ అని ఒక ముసలాయిన వుంటున్నాడు సాబ్?"

"ఆయన ఇంట్లో లేడా?"

"ఏమో సాబ్! నేను మాశ్ళేదు" అన్నాడు ఖాదర్.

ఇన్స్పెక్టర్ గేటు దగ్గరికి వెళ్ళి చూశాడు. తాళం వేసివుంది.

ఇన్స్పెక్టర్ గేటు ఎక్కి అవతలికి దిగాడు. సిబ్బంది అనుసరించారు. ఖాదర్ గూడా వాళ్ళతో పాటు వెళ్ళాడు.

తలుపులు తీసే వున్నాయి.

బెడ్రూంలో సన్నగా వెలుగుతోంది బెడ్ లైటు.

ఇన్స్పెక్టర్ బెడ్రూమ్లోకి వెళ్ళగానే తలుపు ప్రక్కన స్విచ్ బోర్డు మూసి స్విచ్లన్నీ ఆన్ చేశాడు.

ట్యూబులైటు జిగేలుమని వెలిగింది.

బెడ్ మీద ఎర్రటి నెత్తురులో అబ్దుల్లా హాసన్ చచ్చి పడి వున్నాడు.

హాసన్ శవాన్ని చూసి ఖాదర్ షాక్ తిన్నాడు.

"ఎవడో హత్య చేసి ఇల్లు దోచుకున్నాడు" అన్నాడు ఇన్స్పెక్టర్ విచారంగా.

## 3

తెల్లవారుతూనే అబ్దుల్లా హాసన్ హత్య చేయబడ్డాడనే వార్త ఆ వీధిలో అందరికీ తెలిసిపోయింది.

ఆ ఇంటిముందు గుంపులు గుంపులుగా జనం నిలబడి మాట్లాడుకుంటున్నారు.

పోలీస్ కమీషనర్ వచ్చి హత్యా ప్రదేశాన్ని సందర్శించాడు. హత్యలు చేసి ఇళ్ళు దోచుకునే పాత నేరస్థులను రప్పించి హంతకుడిని తక్షణం పట్టుకోవలసిందిగా క్రింది అధికారులను ఆదేశించాడు.

వేలి ముద్రల నిపుణులు కిటికీలమీద, తలుపుల మీద పౌడర్ జల్లి వేలిముద్రలకోసం వెతుకుతున్నారు.

హత్య చేసిన కత్తి దొరకలేదు. కాని దాని తోలు కవరు దొరికింది. దానిమీద వేలిముద్రలు వున్నాయి.

ఎందుకైనా మంచిదని పోలీస్ కుక్కను రప్పించారు. అది శవం వున్న మంచం దగ్గిర వాసనచూసి కాంపౌండు గోడదాటి రోడ్డుమీదకు వెళ్ళింది. ఆ తర్వాత రోడ్డు దిగి ప్రక్క సందులోకి వెళ్ళింది. కొన్ని మెలికలు తిరిగి మెయిన్ రోడ్డు దగ్గర ఒక చెట్టుక్రింద ఆగింది. కదల కుండా అక్కడే కూలబడింది.

అంటే హంతకుడు అక్కడ్నుంచీ ఏదో వాహనం మీద వెళ్ళిపోయాడన్నమాట.

శవపంచాయితీ జరిగిన తర్వాత శవాన్ని పోస్ట్‌మార్టమ్ కోసం హాస్పటల్‌కి తరలించారు.

హతుడి గదిలో రెండు సూట్‌కేసులు మాత్రం దొరికాయి. ఒక సూట్‌కేస్ తెరిస్తే అందులో బట్టలు మాత్రమే వున్నాయి. రెండోదాంట్లో అన్నీ కాగితాలు. అందులో పనికివచ్చేవి పెద్దగా లేవు. మూడు నెలలక్రితం నగరంలో హోటల్ రెడ్‌లాండ్‌లో నెలరోజులపాటు వున్నందుకు లాడ్జింగ్ బిల్లు, మరొకటి బోర్డింగ్ బిల్లు వున్నాయి.

తర్వాత అంతకు క్రితం రోజు పోస్టలు ముద్రతో ఒక కవరువుంది. అది సౌదీ అరేబియానుంచి వచ్చింది. ఆ కవరులో ఒక లెటర్‌వుంది. ఆ భాష వురుదూకాదు. బహుశా అరబ్బీ అయివుంటుందని ఇనస్పెక్టర్ అను కున్నాడు. ఆ లెటర్‌తో ఏదో ముఖ్యమైన పత్రం పిన్ చేసి వున్నట్లు ఎడమవైపు గుర్తులున్నాయి. కాని ఆ పత్రం లేదు దానికి. బహుశా బ్యాంక్ డ్రాఫ్టుకావచ్చు.

అదే సూట్‌కేస్‌లో రెండు ఫారిన్ బ్యాంకుల ప్యాస్

బుక్‌లు కనిపించాయి. ఒక బ్యాంక్‌లో నాలుగు వేలు చిల్లర. మరొక బ్యాంక్‌లో పదిహేను వందలు బ్యాలన్సు వుంది.

ఎఫ్. ఐ. ఆర్. పూర్తి చేసి పంపిన తర్వాత హంతకుడి గురించి ఆలోచించసాగాడు ఇనస్పెక్టర్ సుదర్శన్.

అబ్దుల్లా హాసన్ ఈ దేశస్థుడు కాడు. షుమారు మూడు నెలల క్రితం ఈ దేశం వచ్చాడు. అతనికి ఈ మూడు నెలలలో విరోధులు ఏర్పడ్డానికి పెద్దగా అవకాశం లేదు. పోతే అతని దగ్గర బాగా డబ్బు, సామాను వుందని తెలిసి, ఒంటరిగా వుంటున్నాడని బాగా తెలిసిన వ్యక్తి ఈ ఘాతుకం చేసివుండొచ్చు.

నిన్ననే వచ్చిన లెటర్ చదివితే ఇంకా వివరాలు బాగా తెలుస్తాయి అనుకున్నాడు.

పోలీస్ స్టేషన్‌కి ఫర్లాంగ్ దూరంలో ఒక మసీదు వుంది. అందులోవుండే కాజీకి అరబ్బీవచ్చు. పిల్లలకు అరబ్బీభాష నేర్పుతూ వుంటాడు. అతనితో ఈ లెటర్ చదివిస్తే సరి పోతుంది అనుకున్నాడు ఇనస్పెక్టర్.

ఇనస్పెక్టర్ వెళ్ళేసరికి కాజీ గడ్డం నిమురుకుంటూ మసీదులోనే వున్నాడు.

ఇనస్పెక్టర్ని చూసి ముందు తెల్లముఖం వేశాడు. ఇనస్పెక్టర్ సలాం చేశాక తేరుకుని "ఆప్ బైఠియే! క్యా హోనా?" అని ప్రశ్నించాడు.

ఇనస్పెక్టర్ తను వచ్చినపని చెప్పి ఆ అరబ్బీ లెటర్ యిచ్చి చదివి అందులో సారాంశం చెప్పమన్నాడు.

కాజీ ఆ లెటర్ చదివి చెప్పాడు.

అది అబ్దుల్లాహసన్ కొడుకు రాశాడు. ఇప్పటికే దేశం వదిలి ఆర్నెల్లు గడిచిందనీ, ఈలోగా చాలాడబ్బు ఖర్చు

చేశావనీ మందలిస్తూ రాశాడు. ఇండియాలో ఎవర్నయినా పెళ్ళిచేసుకున్నా అక్కడే దాన్ని వదిలించుకుని రమ్మన్నాడు. అంతేగాని, వెంటబెట్టుకుని రావద్దు అని గట్టిగా రాశాడు.

తర్వాత బిజినెస్ గురించి రాశాడు. అనుకోకుండా అక్కడ పెద్దప్రమాదం జరిగి చాలానష్టం కలిగిందట. రిగ్గుతో ఆయిల్ కోసం తవ్వకం సాగిస్తున్నారట. దాదాపు వందమంది రిగ్గువద్ద పనిచేస్తున్నారట. అకస్మాత్తుగా ఆయిల్, హైడ్రోజన్ సల్ఫయిడ్ గ్యాస్ పైకి పొంగిందట. వెంటనే ప్రేలుడు సంభవించిందట. 20 మంది అక్కడికక్కడే చనిపోయారట. ఏభై మందికి గాయాలు తగిలి హాస్పటల్లో జేర్చాడట.

తను సమయానికి అదృష్టవశాత్తు లేడట. అల్లాదయవల్ల క్షేమంగా వున్నాడట. అక్కడ వుండివుంటే చచ్చిపోయివుండేవాడట. ఇప్పుడు చనిపోయినవారికి నష్టపరిహారం, గాయపడిన వారికి ట్రీట్ మెంట్ కోసం చాలా డబ్బు ఖర్చయిపోయిందట.

అందుకని తను పదివేలుమాత్రమే పంపగలుగుతున్నాననీ, ఇదే ఆఖరుసారి అని గమనించి వెంటనే బయల్దేరి రమ్మని రాశాడు.

అందులో చెక్ నంబరు, బ్యాంక్ పేరు వగైరా రాశాడు.

ఇన్ స్పెక్టర్ అవన్నీ డైరీలో నోట్ చేసుకుని కాజీకి సలాములు చెప్పి స్టేషన్ కి వచ్చాడు.

అయితే హసన్ ఆ చెక్ క్యాష్ గా మార్చుకుని వచ్చాడా? ఆ క్యాష్ ఎక్కడుంది? హత్య చేసినవాడు దొంగిలించాడా? హసన్ బ్యాంక్ నుంచి క్యాష్ తెచ్చి

నట్లు ఎవరైనా గమనించారా?

ఇన్స్పెక్టర్ పాత నేరసుల జాబితా పరిశీలిస్తూ కూర్చున్నాడు. మోడ్ ఆఫ్ థెఫ్ట్ పద్ధతిలో చూస్తే అటువంటి నేరాలు చేసేవాళ్ళు నగరంలో పదిమంది వరకూ వున్నారు. కాని వాళ్ళంతా పట్టుబడి నేరం రుజువై జైలోనే శిక్ష అనుభవిస్తున్నారు.

అయితే నగరానికి ఎవరైనా కొత్తవాడు వచ్చి వుండాలి.

## 4

ఇన్స్పెక్టర్ సుదర్శన్ హోటల్ రెడ్‌లాండ్‌కి ఫోన్ చేశాడు.

"హోటల్ రెడ్‌లాండ్ ప్లీజ్...."

"ఎవరు మాట్లాడుతున్నారు?"

"రిసెప్షనిస్టుని."

"ఇన్స్పెక్టర్ సుదర్శన్ మాట్లాడుతున్నాను. మీ మేనేజర్ గారు వున్నారా?"

"వున్నారు. పిలవమంటారా?"

"యస్. పోలీస్ ఇన్స్పెక్టర్ సుదర్శన్ మాట్లాడుతున్నానని చెప్పండి."

"అలాగే లైన్‌లో వుండండి."

కాసేపటికి మేనేజర్ మాట్లాడాడు. "నమస్తే! ఇన్స్పెక్టర్ సాబ్!"

"నమస్తే!....నమస్తే!"

"రూమ్స్ ఏమైనా కావాలా?"

"నో....నో....అదేం కాదు. ఒక మర్డర్ కేసు గురించి వివరాలు కావాలి."

"మర్డర్ కేసా?....మా హోటల్లో అటువంటిదేమీ

జరగలేదే!" మేనేజర్ కంఠంలో కంగారు వినిపించింది.

"మర్డర్ కేసు మీ హోటల్లో జరగలేదు లెండి. హతుడు కొన్నాళ్ళు మీ హోటల్లో వున్నాడు. ఆ వివరాలు కావాలి."

"ఎవరు?"

"చెప్తాను. అతను రూమ్ నెంబర్ 103లో వున్నాడు. మూడు నెలల క్రితం. పేరు అబ్దుల్లా హసన్. సౌదీ అరేబియా దేశీసుడు."

"ఆఁ....జ్ఞాపకం వచ్చిందిలెండి. అతను హత్య చేయబడ్డాడా?"

"అవును....ఎవరో అతన్ని బెడ్‌రూమ్‌లో హత్య చేసి సామాను, డబ్బు దోచుకు పోయారు. ఎంతపోయిందో? ఏమేమి పోయాయో ఇంకా తెలియదు. అతనికి ఇండియాలో ఎవరైనా బంధువులున్నారో ఏమో తెలియదు. మర్డర్ జరిగినట్లు అతని కొడుక్కి మెసేజ్ పంపించాం."

"అలాగే! పాపం. మా హోటల్లో బాగానే వుండేది. కాని డబ్బు ఖర్చయిపోతున్నదని వేరే ఎక్కడో ఇల్లు తీసుకుని వుంటున్నాడు."

"అదే! అతన్ని గురించి ఏమైనా చెప్తారా మీరు. అంటే అతన్ని హత్య చేయడానికి ఎవరైనా శత్రువులు వున్నారేమోనని."

"అతనికి శత్రువులు వున్నారో లేదో నాకు తెలియదు ఇన్స్‌పెక్టర్ సాబ్! కాని మా హోటల్లో వుండగా ముంతాజ్ బేగం అనే పిల్లను పెళ్ళిచేసుకున్నాడు. పాపం ఆ పిల్లకు నిండా పదిహేనేళ్ళు లేవు. ఈ హసన్‌కేమో అరవై ఏళ్లు దాటిపోయాయి. ఆ పిల్ల తల్లిదండ్రులు బాగా బీదవాళ్ళు. వెయ్యి రూపాయలకు ఆశపడి పిల్లగొంతు

కోశారు.

కాని ఏం లాభం? ఆ ముసిలాడు పదిహేను రోజుల పాటు ఆ పిల్లతో గడిపాడు. చీకటిపడగానే ఆ పిల్లని హోటల్ కి తీసుకొచ్చి వదిలిపోయేది తల్లి. తెల్లవారగానే తీసుకెళ్ళిపోయేది. నాకు చాలా జాలికలిగేది వాళ్ళని చూస్తూ వుంటే! కాని మనం చేసేది ఏమీ లేదు.

ఆ ముసలాడు పదిహేను రోజులు గడిచాక ఆ పిల్ల నాకు వద్దు పొమ్మన్నాడు. తలాక్ అన్నాడు. ఏదో మళ్ళీ కొంత డబ్బు మొఖానకొట్టాడు ఆ పిల్ల తల్లి దండ్రుల మొఖాన."

"ఆ తర్వాత మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడా?"

"తెలియదు. చేసుకునే వుంటాడు."

"అతని గురించి ఇంకా ఏమైనా చెప్తారా?"

"నాకు ఏం తెలుస్తుంది? రూమ్ ఖాళీ చేసి పోయాడు. అ తర్వాత అతన్ని గురించి ఏమీ తెలియదు" అన్నాడు మేనేజర్.

ఇన్స్పెక్టర్ రిసీవర్ పెట్టేశాడు.

తలెత్తి చూసేసరికి మఫ్టీలోవున్న హెడ్ కానిస్టేబుల్ చంద్రయ్య సెల్యూట్ చేశాడు.

"లక్ష్మీనగర్ కాలనీలో తిరిగివచ్చాను సార్!" అన్నాడు.

"ఏమిటి సంగతి?"

"సీత గురించి కనుక్కున్నాను. ఆ అమ్మాయి అన్న దగ్గిర వుంది. కుట్టుమిషన్ నేర్చుకుంటోందట."

"అంతేనా?"

"ఆ అమ్మాయి రాజాగెడ్డి అనే అతనితో రాత్రి బస్ స్టాప్ దగ్గిర గుసగుసలాడుతోంది."

"ఏం మాట్లాడుకున్నారో విన్నావా?"

"లేదు సార్! నేను దగ్గరకి వెళ్ళగానే మాట్లాడ్డం మానుకున్నారు. బస్సు కోసం వెయిట్ చేస్తున్నట్లు నటిస్తూ చాలా సేపు మాట్లాడుకున్నారు. పెద్దగా నవ్వుకున్నారు కూడా!"

"ఏదైనా లా ఎఫైర్ ఏమో!"

"ఏమో సార్!"

"అతను ఏం చేస్తున్నాడట."

"ఏదో కంపెనీలో పనిచేస్తున్నాడట."

"అతన్ని పట్టుకురా ఒకసారి!"

హెడ్ అలాగే నిల్చుండిపోయాడు.

"హత్య జరిగినచోట ఇద్దరి వేలిముద్రలు దొరికాయి. ఎందుకు పోనివ్వాలి? ఈ కుర్రాడివి ఏవైనా దొరుకుతా యేమో చూద్దాం."

హెడ్ ఒక అరగంటలో తిరిగివచ్చాడు. దురదృష్ట వశాత్తు రాజారెడ్డి ఇంట్లోనే వున్నాడు. పోలీస్ జీవ్ ఆగగానే అతని ప్రాణాలు పైనే పోయాయి. కాని తప్పదుగదా! లేకపోతే వీధిలో పెద్దగొడవ జరుగుతుంది. అందుకే మాట్లాడకుండా వచ్చాడు.

"నువ్వేనా రాజారెడ్డి?"

తలవూపాడు భయంగా.

రాజారెడ్డి ముఖంలో కన్పించే భయచిహ్నాలు, తత్తర పాటు గమనిస్తే హత్యలో అతనికి భాగం వుందేమో అనిపించింది.

"అబ్దుల్లా హసన్ నీకు తెలుసా?"

లేదన్నట్లు తల అడ్డంగా తిప్పాడు.

"తెలియకపోతే అతని ఇంట్లోకి ఎందుకు వెళ్ళావ్?"

గద్దించాడు ఇన్‌స్పెక్టర్.

రాజారెడ్డి కొయ్యబారిపోయాడు. అయితే తను గోడ దూకి పారిపోవడం పోలీసులు చూశారన్నమాట అను కున్నాడు. అలా అనుకోగానే తను వుచ్చులో చిక్కు కున్నాడని తెలిసిపోయింది. అతని ధైర్యం సడలిపోయి ఏడుపు ముంచుకొచ్చింది.

"నాకేం తెలియదుసార్! నేను వెళ్ళేసరికే అతను చచ్చి పడివున్నాడు. నాకు భయం వేసింది. ఇంట్లోంచి వచ్చేసరికి రోడ్డుమీద జీప్ ఆగివుంది. నేను వెనకగోడ దూకి పారిపోయాను." వణుకుతున్న స్వరంతో చెప్పాడు రాజారెడ్డి.

"అసలా ఇంట్లోకి ఎందుకు వెళ్ళావ్?"

రాజారెడ్డి దాపరికంలేకూండా అంతా నిజం చెప్పాడు.

"దేవుడి సాక్షిగా అంతా నిజం సార్!"

"అయితే ఆ అమ్మాయిని పిలిచి అడగమంటావా?"

"వద్దుసార్! ఆ అమ్మాయి పరువుపోతుంది. పెద్ద వాళ్ళకి తెలిస్తే మమ్మల్ని బ్రతకనివ్వరు. దయచేసి ఆ అమ్మాయిని ఇందులోకి లాగకండి." అన్నాడు రాజా రెడ్డి ఏడుపు ఆపుకుంటూ.

రాజరెడ్డి స్టేట్‌మెంట్ తీసుకుని సంతకం పెట్టించాడు. అతని వేలిముద్రలు తీసుకుని లాకప్‌లో వుంచాడు.

తర్వాత ఖాదర్‌ని పిలిపించి రాజారెడ్డిని చూపించాడు.

కాని ఖాదర్, రాజారెడ్డినిచూసి అతను తనుచూసిన మనిషికాదని నిర్ధారించాడు. తను చూసిన వ్యక్తికి చిన్న గడ్డం వుందని ఖచ్చితంగా చెప్పాడు.

రాజారెడ్డి నిర్దోషి అని చెప్పగలిగేది అతని వేలి

ముద్రలే. కాని రాజారెడ్డి వేలిముద్రలు, హంతుడి గదిలో దొరికిన వేలిముద్రలతో సరిపోయాయి. అబ్దుల్లాహసన్‌ని ఇద్దరు కలిసి చంపివుండవచ్చును. అందులో ఒకడు రాజారెడ్డి. మరొకడు ఎవరు? ఇన్‌స్పెక్టర్ తీవ్రంగా ఆలోచించసాగాడు.

## 5

"ఫారిన్ బ్యాంక్ మేనేజర్ కావాలి." అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుదర్శన్.

"ఎవరుసార్ మీరు?"

"పోలీస్ ఇన్‌స్పెక్టర్ సుదర్శన్."

"జస్టే మినిట్." అని "ప్లీజ్ మాట్లాడండి." అంది ఒక సన్నని కంఠం.

"విఠల్‌రావ్ స్పీకింగ్ ప్లీజ్!"

"మేనేజర్‌గారా?"

"యస్! వాటీజ్ యువర్ గుడ్‌నేమ్ ప్లీజ్."

"సుదర్శన్, పోలీస్ ఇన్‌స్పెక్టర్."

"ప్లీజ్ టెల్‌మీ! వాట్ కెన్ ఐడూ ఫర్ యూ?"

"చిన్న ఇన్ఫర్మేషన్ కావాలి సార్!"

"అడగండి."

"అబ్దుల్లాహసన్, ఎకౌంట్ నెంబర్ 9936. అతను హత్య చేయబడ్డాడు సార్!"

"ఎక్కడ?"

"అతని ఇంట్లోనే." అంటూ వివరంగా చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

"అతనికి సౌదీ అరేబియానుంచి పదివేలకు ఒక చెక్ వచ్చింది. అది క్యాష్ చేసుకున్నాడా లేదా? చూసి చెప్పండి." అంటూ చెక్ నెంబర్ చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

కాసేపటి తర్వాత మేనేజర్ మాట్లాడాడు.

"ఇన్‌స్పెక్టర్! మీరు పొరబడ్డారు. ఎక్కౌంట్ నెంబర్ 99?6 అబ్దుల్లాహసన్ మీరు చెప్పిన చెక్ క్యాష్ చేసుకోలేదు. కాని, ఎక్కౌంట్ నెంబర్ 9983 అబ్దుల్లా హసన్ చెక్ ఎక్కౌంట్లో వేసుకున్నాడు."

"ఏమిటి మీర నేది? 9983 ఎక్కౌంట్ నెంబర్‌తో మరొక అబ్దుల్లాహసన్ వున్నాడా?"

"అవును. మీరు చెప్పిన చెక్ నిన్న నే ఎక్కౌంట్లో వేశాడు."

"మేనేకర్! అతను దొంగ. ఎక్కౌంట్ ఎప్పుడు ఓపెన్ చేశాడు చెప్పండి?"

"నిన్న నే ఓపెన్ చేశాడు. చెక్ గూడా నిన్న నే వేశాడు."

"సార్! అతను ఖచ్చితంగా దొంగే. అతను అబ్దుల్లా హసన్ కాదు. ఆ పేరుతో ఎక్కౌంట్ పెట్టాడు. ఆ చెక్ అబ్దుల్లాహసన్‌కి అతని కొడుకు పంపించాడు. దాని తాలూకు లెటర్ సూట్‌కేస్‌లో వుంది."

"ఏమిటిసార్ మీరు చెప్పేది?"

"నిజమే! ఒకవేళ అబ్దుల్లాహసన్ పేరుతో క్యాష్ చేసుకోవడానికి ఎవరైనా వస్తే మాకు ఫోన్ చేసి చెప్పండి. అంతవరకూ అతన్ని అక్కడే వుంచండి. బహుశా హసన్‌ని మర్డర్ చేసిన వాడు అతనే కావచ్చు."

"ఓ మైగాడ్! వాడు మమ్మల్నే మోసం చేశాడన్న మాట."

"అతను ఎవరో తెలియకుండా ఎక్కౌంట్ ఎలా పెట్టారు?"

"తను ఫారినర్‌ననీ తనకి సిటీలో ఎవరూ తెలియదని

బాంకాడు. అందులో పదివేలకు డ్రాఫ్టు తెచ్చాడుగదా ఎలా అనుమానించగలం చెప్పండి."

"నిజమే అనుకోండి. కాని అతని అడ్రస్ లేకుండా ఎక్కౌంట్ ఎలా పెట్టనిచ్చారు?"

"అడ్రస్ ఎందుకివ్వలేదు. ఇచ్చాడు. రూమ్ నెంబర్ సెవంటీ, హోటల్ గెస్‌లాండ్."

"మీకు నిజం తెలియాలంటే ఆ హోటల్‌కి ఫోన్ చేసి అడగండి. ఆ రూమ్‌లో వేరే ఎవరో వుండి వుంటారు." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అలాగే తెలుసుకుంటాను. థాంక్స్ ఇన్‌స్పెక్టర్."

"నో మెన్షన్. మీరు కాస్త ఎలర్ట్‌గా వుండండి. అతను వస్తే నాకు ఫోన్ చేసి చెప్పండి. నా ఫోన్ నెంబర్ నోట్ చేసుకోండి." అంటూ నెంబర్ చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

ఇన్‌స్పెక్టర్‌కి ఫారిన్ బ్యాంక్ మేనేజర్ చెప్పిన విషయం చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. హంతకుడు గుండెలు తీసిన మొనగాడే! లేకపోతే తనకు దొరికిన వస్తువులతోను, డబ్బుతోను సంతృప్తిపడక, దొరికన చెక్ గూడా మార్చుకోవాలని ప్లాన్ వేశాడు. అసాధ్యుడులా గున్నాడే! వీడికీ రాజారెడ్డికీ ఏదైనా అండర్‌స్టాండింగ్ వుందా?

ఆలోచిస్తూ కూర్చున్నాడు ఇన్‌స్పెక్టర్.

అరగంట తర్వాత ఇన్‌స్పెక్టర్ ముందున్న ఫోన్ మ్రోగింది.

"పోలీస్ స్టేషన్ ప్లీజ్!"

"ఇన్‌స్పెక్టర్ సుదర్శన్ వున్నాడా?"

"యస్. సుదర్శన్నే మాట్లాడుతున్నాను."

"అబ్దుల్లాహసన్ అనేవాడు వచ్చాడు. చెక్ కౌంటర్లో

ఇచ్చాడు పదివేలకు. క్యాష్ ఇవ్వకుండా కూర్చోబెట్టాం. ఇప్పుడు ఇక్కడే వున్నాడు. వెంటనే ఎవర్నయినా పంపించండి."

"ఎవర్నో ఎందుకు నేనే స్వయంగా వస్తున్నాను వాడిని అరెస్ట్ చేయడానికి." అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుదర్శన్.

# 6

అచ్చం అరేబియా దేశస్థుడిలా వేషం వేసుకున్న వాడిని ఫారిన్ బ్యాంకులో అరెస్ట్ చేసి పోలీస్ స్టేషన్‌కు తీసుకొచ్చారు.

వంటిమీద దెబ్బపడీ పడకముందే, "నిజం చెప్తాను బాబో!" అన్నాడు కేకలు పెడుతూ.

"ఎవరు నువ్వు నిజం చెప్పు?"

"నా పేరు అక్బర్."

"ఏం పని చేస్తావు?"

"హోటల్ రెడ్‌లాండ్ ప్రక్కన కిళ్ళీకొట్టు పెట్టుకున్నాను." అన్నాడు.

అరబ్బీ వేషం తీసి పడేశాక నిజరూపం బైటపడింది అక్బర్‌ది.

అతని చిన్నగడ్డం చూడగానే ఖాదర్ మాటలు జ్ఞాపకం వచ్చాయి. వాడేవీడు. లేకపోతే చెక్ ఎలావస్తుంది?

"చెప్పు అబ్దుల్లాహసన్‌ని ఎందుకు హత్య చేశావు?"

"వాడు నాకు ఇవ్వవలసిన డబ్బు ఇవ్వకుండా మొండి చెయ్యి చూపించాడు. పైగా నన్ను తిట్టాడు. డబ్బు ఇవ్వను నీ ఇష్టం వచ్చింది చేసుకో అన్నాడు. నా డబ్బు రాబట్టుకోవడానికి ఖూనీ చేశాను." అని తను నేరం చేసినట్లు ఒప్పుకున్నాడు అక్బర్.

"అతను మన దేశంవాడు కాదుగదా? నీకు డబ్బు ఎందుకు బాకీ వున్నాడు?"

"వాడికి నేను రెండు పెళ్ళిళ్ళు కుదిర్చాను. ఇద్దరికీ విడాకులు ఇచ్చాడు. మొదటి పెళ్ళి కుదిర్చినప్పుడు నా కమీషన్ ఇచ్చాడు. విడాకులు ఇచ్చినప్పుడు ఇవ్వలేదు. రెండోసారి పెళ్ళికుదిర్చినప్పుడు కమీషన్ ఇవ్వలేదు. పైగా ఆ పిల్లకు విడాకులు ఇచ్చాడు. డబ్బు అడిగితే కసిరి కొట్టాడు. బద్మాష్!" అంటూ తిట్టాడు అక్బర్.

కేసు తొందరగా తేలిపోయినందుకు సంతోషించాడు ఇన్‌స్పెక్టర్ సుదర్శన్. హంతకుడు నేరం ఒప్పుకున్నాడు. రెండో మనిషి వేలి ముద్రలు అక్బర్‌వే అని తేలింది. రాజాగెడ్డి నిర్దోషి. అతను చెప్పిన కథంతా నిజమే!

కేస్ తయారుచేసి అక్బర్ నేరం ఒప్పుకున్నట్లుగా తెలియజేయడానికి కమీషనర్‌ని కలిశాడు ఇన్‌స్పెక్టర్ సుదర్శన్.

పోలీస్ కమీషనర్ కేసు అంతా చూసి, ఇన్‌స్పెక్టర్ వంక ఎగాదిగా చూశాడు.

"పోస్ట్‌మార్టమ్ రిపోర్టు చదివావా?" ప్రశ్నించాడు సీరియస్‌గా.

"యస్సార్!" అన్నాడు.

"మరొకసారి చదివి కేసు పెట్టు. లేకపోతే మనం వెర్రి ముఖాలు వేసుకుని నిల్చోవాలి కోర్టులో."మందలించాడు.

ఇన్‌స్పెక్టర్‌కి ముచ్చెమటలు పోశాయి. పోస్ట్‌మార్టమ్ రిపోర్టు చదివాడో, లేదో జ్ఞాపకం రాలేదు.

తీరా చూస్తే ఏముంది? అబ్దుల్లా హసన్ కత్తిపోట్ల వల్ల మరణించలేదు. విషం ప్రయోగించడంవల్ల మరణించాడు. అతను రాత్రి పది పదిన్నర మధ్య చనిపోయి

వుంటాడు.

అక్బర్ యిచ్చిన స్టేట్ మెంట్ యిప్పుడు పనికిరాదు. కోర్టులో కేసు కొట్టేస్తారు. పోలీసులు వత్తిడిచేయడం వల్ల అక్బర్ నేరం ఒప్పుకున్నాడని అతని తరఫు లాయర్ వాదిస్తాడు. అక్బర్ వెళ్ళేసరికే అబ్దుల్లాహసన్ మరణించాడని బల్ల గుద్దడానికి యిప్పుడు అవకాశం వచ్చింది.

అక్బర్ అతన్ని చంపదల్చుకున్నాడు. కత్తితో పొడిచాడు. కాని అతను పొడిచింది అంతకుముందే విష ప్రయోగం వలన మరణించిన హాసన్ ని. శవాన్ని పొడిచినందుకు శిక్ష లేదు. అక్బర్ నేరస్థుడు కాదు. అబ్దుల్లా హసన్ పేరుతో బ్యాంక్ ఎకౌంట్ తెరిచి చెక్ మార్చుకోవటానికి ప్రయత్నించడం అది వేరే కేసు.

ఇనస్పెక్టర్ కి నీరసం ముంచుకొచ్చింది అవన్నీ ఆలోచించే కొలదీ. పోలీస్ కమీషనర్ ఫేవర్ కోసం వెళ్తే చీవాట్లు దొరికాయి.

ఆలోచిస్తూ స్టేషన్ చేరుకున్నాడు ఇనస్పెక్టర్.

వచ్చీరాగానే అబ్దుల్లాహాసన్ పెళ్ళిళ్ళు చేసుకుని విడాకులు యిచ్చిన భార్యల తాలూకు అడ్రస్ లు నోట్ చేసుకున్నాడు అక్బర్ ద్వారా!

ఇనస్పెక్టర్ సుదర్శన్ అబ్దుల్లా హాసన్ యింటికి మరొకసారి వెళ్ళి అన్ని కోణాలనుంచీ పరిశీలించాడు. ఈసారి తాళం వేసివున్న కిచెన్ రూమ్ తెరిపించాడు. అందులో వంటచేసిన హంగామా ఏమీ లేదు.

స్టెయిన్ లెస్ స్టీల్ క్యారియర్ అస్తవ్యస్తంగా పడి వుంది. దాంట్లో మిగిలిన ఆహార పదార్థాలు చెడు వాసన కొడుతున్నాయి.

డైనింగ్ టేబుల్ మీద రెండు పాలగ్లాసులు కనిపించాయి. పాలు పోసిన గుర్తుగా కరెంటు హీటరు, దాని మీద ఒక గిన్నె కనిపించాయి. గోడ బీరువాలో టీ పాట్లాం, డబ్బాలో పంచదార వగైరా ఆహారపదార్థాలు వున్నాయి.

టిఫిన్ కారియర్, పాలు పోసివున్న గ్లాసులుమీద వేలిముద్రలు వచ్చాయి. ఆ తరువాత వాటిని పరిశోధనకు పంపించాడు ఆహారపదార్థాలలో విషం యేదయినా కలిపి వుందేమో తెలియజేయమని.

అక్బర్ తను చేసిన నేరం వొప్పుకున్నప్పటికీ పోస్టుమార్టమ్ రిపోర్టు, కెమికల్ ఎగ్జామినర్ రిపోర్టు అందుకు విరుద్ధంగా వుండటం వలన కేసుపెట్టడానికి వీలులేకుండా పోయింది. అక్బరే విషం యిచ్చి చంపాడని చెప్పడం అసందర్భంగా వుంటుంది. విషం యిచ్చి చంపినవాడు కత్తితో పొడవడం యెక్కడా జరగదు.

అక్బర్ మేనమామ బెయిల్ మీద అతన్ని విడిపించుకుని పోయాడు.

కేసు యెక్కడ వేసిన గొంగళి అక్కడే వున్నట్లుగా మళ్ళీ మొదటికే వచ్చి కూర్చుంది.

# 7

"ఆ పాలగ్లాసులమీద వచ్చిన వేలిముద్రలు యిద్దరివి వున్నాయి. అబ్దుల్లా హాసన్‌వి. మరొకరు ఆడమనిషి" అన్నాడు వేలిముద్రల నిపుణుడు.

ఇనస్పెక్టర్ అనుమానం ధృవపడింది. అతన్ని అక్బర్ కంటే ముందు అతను విడాకులు యిచ్చిన భార్యల్లో ఒకరు విషం యిచ్చి చంపి వుండొచ్చు. అదంతా పది గంటల లోపు జరిగింది.

అక్బర్ కి అతను విషప్రయోగంతో చచ్చాడని తెలియక కత్తితో పొడిచి కసి తీర్చుకున్నాడు. చేతికి దొరికిన సామాను ఎత్తుకొనిపోయాడు. కాబట్టి అతను హంతకుడు కాదు. దొంగ మాత్రమే.

అబ్దుల్లాహసన్ నగరానికి వచ్చిన మొదట్లో పెళ్ళిచేసుకున్న అమ్మాయి ముంతాజ్ బేగం. ఆమె తండ్రి నాలుగు చక్రాల బండీమీద పళ్ళు అమ్ముకుంటూ జీవిస్తున్నాడు. అతని పేరు అహమ్మద్ ఖాన్.

అతనికి ముంతాజ్ బేగం మూడో అమ్మాయి. ఇద్దరు అమ్మాయిలకు యెలాగో పెళ్ళిళ్ళుచేసి పంపేశాడు. ఇంకా ఒక ఆడపిల్ల, ఆ తర్వాత ముగ్గురు మగపిల్లలు వున్నారు. చాలీచాలని సంపాదనతో తిండి తినడమే గగనమై పోతున్నది.

మూడో పిల్లకు పెళ్ళి యెలా చెయ్యాలా అని ఆలోచిస్తూ వుండగా అక్బర్ పెళ్ళి సంబంధం తీసుకొచ్చాడు. అరబ్బీవాడు అయితేనేం డబ్బున్నవాడు, ముసలివాడు అయితేనేం పిల్ల సుఖపడుతుంది. డబ్బు వెనకేసుకుంటే ఆ ముసలాడు పోయాక మరొకడ్ని చేసుకోవచ్చు. ఈ రోజుల్లో డబ్బు వుంటే చాలు యెవడోకడు పెళ్ళి చేసుకోవడానికి ముందుకొస్తాడని అక్బర్ వూదరకొట్టాడు.

అహమ్మద్ ఖాన్ భార్యగూడా యిష్టంలేకపోయినా గత్యంతరం లేక పిల్లకు పెళ్ళయితే చాలని ఒప్పుకొంది. ఆ అరబ్బీవాడు పెళ్ళి ఖర్చులు పెట్టుకొని వెయ్యిరూపాయలు యిచ్చాడు. అందులో రెండు వందలు అక్బర్ తన కమీషన్ అని తీసుకున్నాడు.

పదిహేను రోజులు రోజూ కూతుర్ని రాత్రిళ్ళు హోటల్ కి తీసుకెళ్ళి అల్లుడి దగ్గర వదిలి వచ్చేది తల్లి.

మళ్ళీ తెల్లవారిన తర్వాత తీసుకొచ్చేది.

ఒకరోజు నాకీ భార్య వద్దని పేచీ పెట్టాడు అరబ్బీ వాడు. విడాకులకు సిద్ధమయ్యాడు. కారణం ఏమిటంటే సరిగా చెప్పడు. సరిగా సంసారం చెయ్యడం లేదం టాడు. పిల్ల పుష్టిగా లేదంటాడు. వంట్లో అన్నీ యెము కలే అంటాడు. పిల్ల నల్లగా వుందంటాడు. యిష్టంలేని మొగుడు పెరుగులో రాళ్ళొచ్చాయని చితకబాదినట్లుంది అతని వరుస.

ఇష్టంలేనప్పుడు బ్రతిమాలి యేం లాభమని అహమ్మద్ ఖాన్ నోరు మూసుకొని వూరుకొన్నాడు. అరబ్బీవాడు యిచ్చిన డబ్బు తీసుకున్నాడు.

అదంతా చెప్పి కళ్ళల్లో నీళ్ళు నింపుకున్నాడు అహ మ్మద్ ఖాన్.

ఇనస్పెక్టర్ కి అతన్ని చూసి జాలి కలిగింది.

అతని భార్య మాత్రం అరబ్బీవాడిని తెగ తిట్టింది. వాడు చచ్చాడని తెలిసి సంతోషించింది. ముంతాజ్ బేగం అమాయకంగా అదంతా వింటూ కూర్చుంది.

"ఎవరో అతనికి విషం యిచ్చి చంపేశారు. విషం పాలల్లో కలిపి యిచ్చారు. ఆ గ్లాసుమీద ఒక ఆడమనిషి వేలిముద్రలు దొరికాయి. ఎవరివో తెలుసుకున్న దాకా నేను అందర్నీ అనుమానించాల్సిందే!" అన్నాడు ఇన్ స్పెక్టర్.

అహమ్మద్ ఖాన్ భార్యవి, అతని కూతురు వేలి ముద్రలు తీసుకున్నాడు ఇనస్పెక్టర్. అవసరమయితే మళ్ళీ కలుస్తానని వెళ్ళిపోయాడు.

అబ్దుల్లాహసన్ ముంతాజ్ బేగం తర్వాత పెళ్ళిచేసు కొన్న అమ్మాయి పేరు అమీనా!

ఆ అమ్మాయికి తండ్రి లేడు. తల్లి పనిపాటలు చేస్తూ కూతుర్ని బ్రతికిస్తోంది. ఇంకా యిద్దరు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు వున్నాడు ఆమెకు. మిగతా కథంతా అలాగే వుంది దాదాపు.

అమీనా తల్లిగూడా అరబ్బీవాడు చచ్చాడని విని సంతోషించింది.

వేలిముద్రలు తీసుకొన్నాక "ఇప్పుడు అనిపిస్తోంది బాబూ! నేనే వాడిని చంపివుంటే నా కసి తీరేదని. ఎవరోగాని బాగా చేశారు" అంది ఆమె.

తను కలెక్టు చేసిన వేలిముద్రలు నిపుణుడికి పంపించాడు.

కాని ఫలితం మాత్రం శూన్యం.

విషపు గ్లాసుమీద దొరికిన వేలిముద్రలతో ఎవరివీ టాలీ కాలేదు.

# 8

హోటల్ రెడ్‌లాండ్‌లో 103 వ నెంబర్ గదిలో ఒక అరబ్బీ దిగాడు. అతని పేరు మహమ్మద్. రూమ్‌లో దిగిన వెంటనే పెళ్ళి పెళ్ళి అనసాగాడు. రూమ్ బాయ్ కిళ్ళీకొట్టు అక్బర్‌కి కబురుచేశాడు.

అక్బర్ మహమ్మద్‌ని కలుసుకున్నాడు. మహమ్మద్ మరీ ముసలివాడు కాడు. నలభై ఏళ్ళకు కొంచెం అటూ యిటూ వుంటుంది వయస్సు. కొంచెం నలుపు. లావుగా వున్నాడు. ఉర్దూ బాగా మాట్లాడాడు.

అక్బర్‌ని ఇంపోర్టెడ్ సిగార్ లైటర్ ప్రెజెంట్ చేశాడు. తనకు నచ్చినపిల్ల దొరికితే వెయ్యి రూపాయలు నజ్రానా ఇస్తానని ప్రామిస్ చేశాడు.

వెయ్యి అనగానే యెగిరి గంతేశాడు అక్బర్. కిళ్ళీ కొట్లో తన తమ్ముడిని కూర్చోబెట్టి, అరబ్బీని వెంటేసు

కుని పెళ్ళికావలసిన అమ్మాయిల యిళ్ళకు తిరగసాగాడు.

దాదాపు పాతికమంది కన్నెపిల్లల్ని చూపించాడు అక్బర్. కాని అందులో ఎవరూ అరబ్బీకి నచ్చలేదు. ప్రతి అమ్మాయిలోనూ ఏదోక సాకు వెతికేవాడు. అక్బర్ కి విసుగుపుట్టింది అతని ప్రవర్తన.

'వీడికి నచ్చేపిల్ల లోకంలో యింకా పుట్టలేదు' అనే నిర్ణయానికి వచ్చాడు అక్బర్.

అందుకే మహమ్మద్ తో తిరగడం మానేశాడు.

కాని మహమ్మద్ వూరుకోలేదు. అక్బర్ ని పిలిపించాడు.

"ఏమిటి యింకా ఎవరూ దొరకలేదా?" అన్నాడు.

"ఇక నా వల్లకాదు" అన్నాడు అక్బర్ విసుగ్గా.

"అలా అంటే ఎలా భాయ్! నాకో సంగతి తెలిసింది చెప్పనా?"

"ఏమిటి?"

"అబ్దుల్లా హసన్ ఈ వూళ్ళో రెండు పెళ్ళిళ్ళు చేసుకుని విడాకులు ఇచ్చాడు. మూడో పెళ్ళి కుదిరిందని తెలిసింది. ఆమె చాలా బాగుంటుందట. నీకు తెలుసా?"

"తెలుసుకుంటాను. కాని వాడికి ఆ పిల్లను నేను మాట్లాడలేదు. సయ్యద్ మాట్లాడాడు."

"ఆఁ....అదీ—నువ్వు సయ్యద్ ద్వారా మాట్లాడు. పిల్ల నాకు నచ్చితే చెరోక ఐదొందలు యిస్తాను. ఏం?" అన్నాడు మహమ్మద్.

"అలాగే!" అని ఆ పనిమీద వెళ్ళిపోయాడు అక్బర్.

మర్నాడు ఆ అమ్మాయి తల్లిదండ్రులు వచ్చి మహమ్మద్ తో మాట్లాడారు. పిల్ల నచ్చితే రెండువేలు ఇస్తాననీ, పెళ్ళిచేసుకున్న వెంటనే భార్యను తమదేశం తీసు

కెళ్ళిపోతాననీ చెప్పాడు మహమ్మద్. తను అబ్దుల్లా హసన్‌లా మోసం చెయ్యనని ప్రామిస్ చేశాడు.

ఆ సాయంకాలమే పెళ్ళిచూపులుజరిగాయి హోటల్లో.

ఆ అమ్మాయి పేరు రజియా! వయస్సు ఇరవై పైనే వుంటుంది. ఎత్తుగా, పుష్టిగా వుంది. పసిమి రంగుతో మిస మిసలాడుతున్న రజియాను చూస్తూనే "అచ్ఛా...." అంటూ లొట్టలు వేశాడు అరబ్బీ.

తనకు కాబోయే అత్త మామలకు, భార్యకు హోటల్లో నుంచి ఫలహారాలు, టీ తెప్పించి బాగా మర్యాద చేశాడు.

అమ్మాయి తనకు నచ్చిందని చెప్పాడు.

అరబ్బీవాడు నీకు నచ్చాడా, లేదా అని ఆమెను ఎవరూ అడగలేదు. అవసరం లేదేమో మరి?

మంచిరోజు చూసి నిక్కా ఏర్పాటు చేస్తానని రజియా తల్లిదండ్రులు పిల్లను తీసుకుని వెళ్ళిపోయారు.

## 9

సాయంకాలం ఆరు దాటింది.

అప్పుడే చీకటి పడుతోంది.

హోటల్ రెడ్‌లాండ్ అప్‌స్టెయిర్ ఎక్కి రూమ్ నెంబర్ 103 ముందు ఆగి బెల్ కొట్టింది బురఖాలో వున్న అమ్మాయి.

వెంటనే తలుపులు తెరుచుకున్నాయి.

ఆమె లోపలకు వెళ్ళి వెంటనే తలుపు మూసి బోల్టు పెట్టేసింది.

బురఖా తీసి హేంగర్‌కి తగిలించి నవ్వింది.

"నాకు తెలుసు నువ్వు వస్తావని!" నవ్వుతూ అన్నాడు మహమ్మద్.

ఆమె బిత్తరపోయింది ముందు. తర్వాత తేరుకుని "ఈ

రోజు మీతో ఇక్కడే(విందు తీసుకోవాలని వచ్చా" అంది.

"అలాగే! నువ్వు నోరు తెరిచి అడిగితే కాదంటానా?" అన్నాడు.

"తల నొప్పిగా వుంది. చాయ్ తెప్పించండి" అంది ఆమె.

అతను బెల్ నొక్కాడు తలుపు తీసి.

ఆమె బాత్‌రూంలోకి వెళ్ళింది.

బాయ్ టీ తెచ్చి వెళ్ళాక వచ్చింది.

తలుపు బోల్టు పెట్టింది.

టీ కప్పు చేతిలోకి తీసుకుని, "ఇంత వేడిగా వుందే మిటి?" అంది.

అతను నవ్వాడు "నీలాగే" అన్నాడు.

ఆమె సిగ్గు పడింది.

"తీసుకోండి...."అంటూ టీకప్పు అతనికి అందించింది.

అతను ఆమె చేతిని సుతారంగా పట్టుకొని "ముందు నువ్వు తీసుకో. పాపం తల నొప్పిగా వుందన్నావు గదా" అంటూ ఆ కప్పుని ఆమె పెదవుల దగ్గరికి తీసుకెళ్ళాడు.

ఆమె ముఖం భయంతో కంపించింది.

"వూ....(తాగు...." అన్నాడు.

ఆమె పెదవులు బిగబట్టింది.

"నాకు తెలుసు నువ్వా టీ (తాగవు, అందులో విషం కలిపావు కాబట్టి" అన్నాడు గట్టిగా.

ఆమె ముఖం పాలిపోయింది.

"నీకు పెళ్ళి చేసుకోవడం ఇష్టంలేదు. కాని నీ తండ్రి బలవంతంగా అరబ్బీ వాడికైనా సరే ఇచ్చి పెళ్ళిచేసి భారం వదిలించుకోవాలని చూస్తున్నాడు. అబ్దుల్లా హాసన్ మీద నీకు అసహ్యం. అతనితో కాపురం ఘోరం

అని తలిచావు. పెళ్ళి కుదరగానే అతని ఇంటికి వెళ్ళి మాటలు చెప్పి, పాలలో విషం కలిపి చంపావు కదూ!" అన్నాడు.

ఆమెకు ఏడుపు వచ్చింది, తన సంగతి బైటపడిపోయి నందుకు.

అతను అరబ్బీవేషం వూడదీసి పారేశాడు.

"చూడు, నేను అరబ్బీవాడిని కాదు. సి.ఐ.డీని. నీ కోసమే ఈ అవతారం ఎత్తాను. నిన్న నువ్వు టీ త్రాగిన గ్లాసుమీద వేలిముద్రలు, ఆ రోజు హాసన్ ఇంట్లో నువ్వు పాలలో విషం కలిపిన గ్లాసుమీది వేలిముద్రలూ సరి పోయాయి. నా ప్లాన్ సక్సెస్ అయ్యింది" అన్నాడు అతను.

రజియా నిలువునా కూలిపోయింది.

అరబ్బీ ముసలివాడితో మనసులేని కాపురం చెయ్య డానికి భయపడి....ఆ భయంతో సాహసించి అతన్ని మట్టుపెట్టింది.

ఆమె పాలిట మరొక అరబ్బీ తయారయ్యాడు.

వీడినీ చంపాలనుకుంది.

కాని రోజులన్నీ ఒకలా వుండవు.

అందుకే పట్టుబడిపోయింది.

రజియా వున్నట్లుండి బురఖా వేసుకుని, గదిలోనుంచి పారిపోవాలని ప్రయత్నించింది.

కాని అతను ఆమెను పట్టుకుని "నువ్వింక పారిపోలేవు!" అన్నాడు.

"వాడితో పెళ్ళికంటే నాకు చావే నయం" ఏడుస్తూ ఆవేదనా స్వరంతో అంది రజియా.

—:ఐపోయింది:—

# ఉరి తీసిన శవం!

## సికిందర్

స్కైలార్క్ రెస్టారెంట్ ఆరవ నెంబర్ కేబిన్‌లోకి లాల్ స్వింగ్ డోర్ తోసుకొని వెళ్ళి, "హలో, మీరొచ్చేశారన్న మాట!" అన్నాడు.

జగపతిరావ్ ఉలికిపడి చూసి, "మీరు నిజంగా భయపెట్టేశారు!" అన్నాడు.

లాల్ నవ్వుతూ అతనెదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

"ఈ లోకంలో భయపడేవారిద్దరు: తప్పు చేసేవాళ్ళు, చేసి తప్పించుకున్న వాళ్ళు."

రావ్ ఇబ్బందిగా కదిలి, "నిజంగా ఈ చోటు రహస్యంగా వుంటుందా, మిష్టర్ లాల్?" అన్నాడు.

లాల్ తలూపాడు. "మీరిక్కడ నన్ను కలుసుకున్నట్లు ఎవరికీ తెలియదు. ఈ హోటల్ స్టాఫ్ అంతా నాకు తెలుసు. నమ్మకమైన వాళ్ళు. రహస్యాలు వుంచుతారు. ఇప్పుడు చెప్పండి, మీకొచ్చిన ఆపదేమిటి?"

రావ్ చెప్పబోయి వెయిటర్ లోనికి రావడంతో మానుకున్నాడు. లాల్ రెండు కాఫీలకి ఆర్డరిచ్చి వెయిటర్ని నిరుత్సాహపర్చాడు. కానీ టిప్ అందుకుంటున్నప్పుడు ముఖం చాటంతవుతుందని తెలుసు లాల్ కి.

రావ్ అన్నాడు: "మిస్టర్ లాల్, నేను బ్లాక్ మెయిల్ లో ఇరుక్కున్నాను. ఇది మీకు సామాన్యమనిపించవచ్చు, రొటీన్ గా తోచవచ్చు. కానీ నా చేతి నుంచి అయిదు లక్షలు ఆముదంలా వదిలేలా వున్నాయి. దీన్ని మీరాపాలి."

లాల్ నవ్వాడు, "ఏం బ్లాక్ మెయిల్?"

"ఇందాక ఫోటోలందాయి...."

"ఏం ఫోటోలు?"

"నా ఫోటోలు—మాధురితో కలిసివున్న ఫోటోలు."

"ఆమె ఎవరు? మీ భార్యా?"

"ఓహ్, కాదు! కాల్ గర్ల్."

"ఐ సీ....ప్రతీ పాపం ఓ శిక్షను వెంట తెస్తుందనుకొంటాను."

"మిమ్మల్ని రమ్మన్నది నీతులు నేర్పడానిక్కాదు!"

"మరెందుకో చెప్పండి."

"వాడు ఇందాక ఫోన్ చేసి రేపు రాత్రికల్లా అయిదు లక్షలు సిద్ధం చెయ్యమన్నాడు. రాత్రి 11 గంటలకి కార్లో లోయర్ టాంక్ బండ్ రోడ్డుమీదగా వెళ్తూ, వాడు తర్వాత చెప్పే నిర్ణీతస్థలంలో బ్రీఫ్ కేసు జారవిడవాలట."

"తర్వాత?"

"వెనక్కి చూడకుండా తిన్నగా వెళ్ళిపొమ్మన్నాడు.

డబ్బు సక్రమంగా వుంటే తెల్లారి నెగటివ్స్ అందు తాయట."

"బావుంది. అయితే మమ్మల్నేం చెయ్యమంటారు?"

"ఆ సమయాని కక్కడ మాటువేసి వాడి మక్కెలిర గొట్టమంటాను!" అర్చాడు రావ్.

"ఉష్....అరవకండి! ప్రైవసీ దెబ్బతింటుంది" లాల్ వారించాడు, "బ్లాక్ మెయిలర్ అంత అజాగ్రత్తగా వుండడు. నెగెటివ్స్ ఎక్కడున్నాయో మనకి తెలియదు. ఒకవేళ అతన్ని పట్టుకుంటే, ఆ నెగెటివ్స్ బట్టబయలై మీరు వీధిపాలయ్యే ఏర్పాటు ఏదైనా చేశాడేమో తెలియదు. కాబట్టి అలా చివరి క్షణంలో అతన్ని పట్టుకోడం మంచిది కాదు."

"అయితే ఏం చేస్తారు? యెప్పుడు పట్టుకొంటారు?"

"ముందు అతన్ని ట్రేస్ చెయ్యగలమేమో చూడాలి. రేపు రాత్రిలోగా పట్టుకోవాలి. పట్టుకున్నామంటే బోనులో పడి దిక్కులు చూడ్డం తప్ప, మిమ్మల్ని రచ్చకీడ్చే అవకాశాలూ మార్గాలూ ఏవీ అతనికి వుండకూడదు! ఫోన్‌లో అతని కంఠం గమనించారా? ఎలావుంది?"

"క్రొత్త కంఠం. ఆ కంఠంతో నాకు పరిచయం లేదు."

"ఈ మాష్టురి యెలాంటిది? ఇందులో ఆమె హస్త ముందంటారా?"

"లేదు, ఆమె చాలా నమ్మకస్తురాలు."

"ఫోటో లెలా అందాయి?"

"పోస్టులో."

"ఎక్కడున్నాయి?"

"చూసి వెంటనే కాల్చేశాను."

"ఐ సీ...." లాల్ కోపం అణచుకున్నాడు, "కవరు కూడానా?"

"కవరుతో బాటు కాల్చేశాను."

"ఆ ఫోటో లెక్కడ తీయబడ్డాయో తెలుసా?"

"నా ఇంట్లో తీయబడ్డాయి."

"మీ ఇంట్లోనా! అయితే మీ భార్య—"

"అప్పుడామె వూరికెళ్ళింది, వారం క్రితం. అదే రోజు రాత్రి నేను మాధురిని పిల్చాను."

"ఆ ఫోటో లప్పుడే తీయబడ్డాయా?"

"అవును."

"ఎలా తెలుసు?"

"నేను మాధురిని ఇంటికి ఆ ఒక్కసారే పిల్చాను."

"అయితే అవి రాత్రిపూట తీయబడ్డాయన్న మాట."

"అవును."

లాల్ అన్నాడు, "రాత్రిపూట ఫోటోలు తీయాలంటే కొన్ని ఇబ్బందులుంటాయి. ఫ్లాష్‌గన్ లేకుండా తీయలేరు. కాబట్టి అప్పుడా మెరుపుకి పిట్టలు బెదిరిపోయి, రోజు బాగాలేకపోతే వాళ్ళచేతిలో చావుదెబ్బలు తింటాడు తీసేవాడు! మీకెన్ని ఫోటోలు అందాయి?"

"మూడు."

"ఎన్ని భంగిమల్లో?"

"మూడు భంగిమల్లో."

"నో, ఇంపాసిబుల్. మూడుసార్లు ఫ్లాష్‌గన్ వెల్గినా మీలో ఎవరూ గమనించనంతటి—" లాల్ ఆగిపోయి క్షణం తర్వాత నెమ్మదిగా అన్నాడు, "తమకమా? మైకమా?....అందులో వున్నారంటే అది సమంజసంగా లేదు."

"లాల్, మీకో విషయం చెప్పాలి" అన్నాడు రావ్ వెంటనే.

లాల్ నవ్వాడు. "చెప్పండి, రహస్యాలుండకూడదు. సిగ్గు విడిచిపెట్టాలి. అభిసారిక రాంషాగారు తెలుసా? ఆయన దగ్గర వందలాదిమంది సిగ్గు బిడియం వదలి ఏకరువు పెడతారు సమస్యలు."

"ఏమిటీ, మీతో దాంపత్య విషయాలు చర్చించడానికొచ్చానా? పదేళ్ళనుంచీ చదువుతున్నాను అభిసారికను. కావాలంటే మీకు నేర్పగలను పాఠాలు!"

లాల్ తల గోక్కున్నాడు. "సారీ, ఏదో అనేశాను. మీరిక చెప్పండి."

రావ్ చల్లబడుతూ అన్నాడు: "ఆ రాత్రి మేమిద్దరం చెరో పెగ్గు జిన్ పుచ్చుకున్నాం. కాస్సేపటికే మాధురికేదో మైకం కమ్మి సోలిపోయింది.... ఆ తర్వాత నాకూ అదే జరిగింది. అలా యెందుకు జరిగిందో నాకర్థంగాలేదు. నా లిమిట్ ఆరు పెగ్గులు. ఒక పెగ్గు లెక్కలోనిది కాదు! ఆ పెగ్గు ఎందుకంత తీవ్రంగా పనిచేసిందో తెలియలేదు. సుమారు రెండు గంటల తర్వాత కళ్ళు తెరిచాను. మాధురి ఇంకా అలాగే వుంది. అప్పుడు జరిగింది గ్రహించి ఆ జిన్ పాడయిందనుకొన్నాను. కాని క్రితం రోజువరకూ దాన్ని వాడాను—సగం బాటిల్ పూర్తయింది. ఇంతలోనే చెడిపోవడం అసంభవమన్పించింది. అదెలా చెడుతుందో, అప్పుడు దాని ప్రభావం ఏమిటో నాకు తెలియదు. డీలర్‌కు ఫిర్యాదు చెయ్యాలనుకున్నాను. కానీ ఉదయం లేచాక దాని విషయమే మర్చిపోయాను. వారం గడిచింది.... ఆ బాటిల్ అలాగే వుండిపోయింది."

"ఇప్పుడూ వుందా?"

"ఉంది, ఫ్రిజ్ లో. మరో రెండు సీలు విప్పనివి కూడా వున్నాయి. వాటితో బాటు రెండు నిండు విస్కీ బాటిల్స్, ఒకటి సగం విస్కీ సీసా కూడా వున్నాయి—అరడజను బీరు బాటిల్స్ తో బాటు యింకా ఫాంటా సోడా—"

"నెవర్ మైండ్, మీ ఇంట్లో యింకెవరు తాగుతారు?"

"నేనొక్కడ్నే. నా భార్య ముట్టుకోదు."

"మీరు పెగ్ అందిస్తున్నప్పుడు మాధురి అభ్యంతర పెట్టిందా?"

"లేదు, వెంటనే తాగేసింది."

"ఆమె బాటిల్ ముట్టుకుందా?"

"లేదు, వాటిని నేను ప్రాణంలా చూసుకొంటాను. ఎవర్నీ ముట్టుకోనివ్వను."

"అయితే వాటిమీద మీ వేలిముద్రలే వుండాలి" అన్నాడు లాల్ కాఫీ తాగుతూ, "కానీ ఈ జిన్ బాటిల్ మీద, సీలు విప్పిన విస్కీ బాటిల్ మీదా మరొకరి వేలి ముద్రలు కూడా వుండవచ్చు."

"ఎందుకుంటాయి?"

"ఎందుకంటే—బ్లాక్ మెయిలర్ వాటిలో ఏదో మత్తు మందు కలిపి మిమ్మల్ని సుషుప్తిలోకి పంపి ఫోటోలు తీశాడు గనుక! ఆ ఫోటోల్లో మీరిద్దరూ యాక్టివ్ గా వుండివుండరు. నిస్త్రాణంగా-సోలిపోయి—ఒకరి బాహువుల్లో ఒకరు—"

"ఓహ్, మీకెలా తెలుసు? మీరా ఫోటోలు చూడలేదు!"

"నా మెదడులో క్లోజ్డ్ సర్క్యూట్ టి.వి. వుంది

లెండి" నవ్వాడు లాల్, "లేకపోతే మీ జిన్ ప్రభావానికి ఇంతకంటే ఎక్స్ప్లనేషన్ కన్పించడంలేదు. జిన్, విస్కీలో కూడ—సీలు తెరిచినవి—అతడు మత్తుపదార్థం కలిపి, మీరు తాగి పడిపోయాక కావల్సిన భంగిమల్లో ఫోటోలు తీసుకున్నాడు. అందుకే మీరు ఫ్లాష్‌గన్ మెరుపు చూడలేకపోయారు.

"కాబట్టి ఫ్రిజ్‌లో బాటిల్స్ అన్నింటిమీదా వేలిముద్రలు తీయాలి. అతను ప్రొఫెషనల్ అయివుంటాడు. అమెచూర్ అయివుంటే మీ వంటి పెద్దచేపకు గాలం వేసే సాహసం చెయ్యడు. మీరా ఫోటోలు నాశనంచేసి పొరపాటు చేశారు. వాటిమీద విలువైన సాక్ష్యాధారం లభించవచ్చు—వేలిముద్రలు. మీరు త్వరపడ్డారు.

"వెల్, బాటిల్స్‌మీద పరాయి వేలిముద్రలుంటే వాటిని రికార్డ్సుతో వెరిఫైచేస్తే ఫలితం వుండొచ్చు. అప్పుడతన్ని పట్టుకోవడం సులభం అవుతుంది. మీ భార్య పూర్తిచేసి తిరిగి వచ్చిందా?"

"మూడురోజుల క్రితమే వచ్చేసింది."

"అయితే ఒకపని చెయ్యండి. సాయంత్రం ఆరు గంటలకి ఆమెని తీసుకొని ఎక్కడికైనా వెళ్ళిపొండి. ఇంట్లో వుండకూడదు. సాయంత్రం జాన్ వెళ్ళి వేలిముద్రలు సేకరిస్తాడు. తొమ్మిదిగంటల వరకు సమయమిచ్చి తిరిగిరండి. ఈలోపు జాన్ పని పూర్తి చేసుకుంటాడు. మీవి, మీ భార్యవి వేలిముద్రలు స్పెసిమెన్స్‌గా తీసుకోవాలి. అందుకు సాయంత్రం వెళ్ళేముందు వాటిని వదలండి...."

"ఎలా?"

"మీ మిసెస్‌ను గ్లాసులో మంచినీళ్ళు తెమ్మన్నండి. తెచ్చాక గ్లాసుమీద జాగ్రత్తగా మరోవైపు పట్టుకొని,

తాగి ఫ్రిజ్ మీద పెట్టేయండి."

"అలాగే" అన్నాడు రావ్. "కానీ లాల్, ఆ మర్నాటినుంచి ఆ విస్కీ తాగుతున్నాను. అందులో మార్పేమీ కన్పించలేదు. అందులో మందు కలిపి వుండదు."

"మీకెలా తెలుసు? ఎందుకు కలపదు? ఆ రాత్రి మీరు జిన్ మాత్రమే తాగుతారని అతనికి తెలుసా?"

"మీరు నమ్మండి. ఆ విస్కీ స్వచ్ఛంగా వుంది."

లాల్ కాస్సేపు మౌనంగా వున్నాడు.

"అయితే ఇందులో మాధురి హస్తముండాలి.... మీ అభిరుచులు ఆమెకు తెలుసనుకొంటాను—తెలుసుకొని ఆ ప్రకారం నడచుకోడం ఆమె వృత్తికి ముఖ్యం.

"ఆ రాత్రి మీరు జిన్ తీసుకుంటారని పసిగట్టింది. అందులో పదార్థం కలిపి మీ కనుమానం రాకుండా మీతోబాటు తనూ తీసుకొంది. ఆ తర్వాత ఆమె బాయ్ ఫ్రెండ్ వూడిపడి పని పూర్తి చేసుకున్నాడు. ఇది నా వూహ. ఆమె అడ్రసు యివ్వండి, కనిపెట్టి చూద్దాం."

జగపతిరావ్ చిన్న కాయితంమీద అడ్రసు వ్రాసి, జేబులోంచి ఒక నోట్లకట్టతీసి దానితోబాటు అందిస్తూ, "మీరు నా సమస్యలు చాలా సీరియస్‌గా ఆలోచిస్తున్నారు మిస్టర్ లాల్. చాలా తృప్తిగా వుంది. మీకెలా కృతజ్ఞతలు తెలుపాలో తెలియడంలేదు!" అన్నాడు.

లాల్ నవ్వాడు, "ఇంటి తాళాలెవరి దగ్గర వుంటాయి?"

"ఇద్దరివద్దా వుంటాయి."

"అయితే మీ తాళాలివ్వండి."

రావ్ ఇచ్చాడు.

"వెల్, మీరిక నిశ్చింతగా వుండండి" అన్నాడు లాల్.

"వాడు మళ్ళీ ఫోన్ చేస్తే ఏం చెప్పాలి?"

"అనవసరంగా వర్రీ కావద్దని చెప్పండి."

"అలాగే. రాత్రి ఇంటికొచ్చాక మీకు ఫోన్ చేస్తాను. ఎంతవరకొచ్చిందో చెప్పండి."

తలూపి లేచి బయటకి నడిచాడు లాల్.

## 2

రాత్రి 8 గంటలకి జాన్ బ్రీఫ్‌కేసుతో ఆఫీసులోకి ప్రవేశించాడు.

"పార్ట్‌నర్ నువ్వింక రిటైర్‌మెంట్ పుచ్చుకోవాలి!"

"అలాగా.... ఎందుకు?"

"నీ అయిడియా ఫలించలేదు. బంగాళాదుంపలు ఉడకలేదు!"

"ఏమిటి? ఏం జరిగింది? ఏమటా నవ్వు?"

జాన్ నవ్వాపుకుని అన్నాడు: "వేలిముద్రలవంటి సున్నిత విషయంలో నువ్వు అత్యాశకు పోవడం మంచిది కాదని ఉదయమే చెప్పాను. సమయం, శ్రమా వృధా చేశావు! అక్కడ మరో వేలిముద్రలు లేవు—రావ్‌వి తప్ప. గ్లాసుమీద అతనివి, అతని భార్యవి స్పెసిమెన్స్ సేకరించాను. ఫ్రిజ్‌లో బాటిల్స్ అన్నింటి మీదా రావ్‌వి తప్ప మరే వేలిముద్రలు లేవు!"

"రావ్ తాగిన జిన్ బాటిల్ మీద?"

జాన్ బ్రీఫ్‌కేసులోంచి కొన్ని కవర్లు తీసి, వాటిలో ఒకదాన్ని లాల్‌కిచ్చాడు.

లాల్ దాన్ని తెరిచి ఏడు చతురస్రాకారంలో వున్న సెల్లోఫేన్ టేపు ముక్కల్ని తీశాడు. వాటిలో

పౌడర్‌లో వుత్పన్నమైన వేలిముద్రలు నిక్షిప్తమై వున్నాయి. భూతద్దం అందుకొని పరిశీలించసాగాడు. జాన్ మరొక కవర్లోంచి స్పెసిమెన్స్ తీసి అందించాడు.

ఆ తర్వాత అన్నాడు: "జిన్ బాటిల్ మీద, విస్కీ బాటిల్ మీద, మిగతా అన్ని బాటిల్స్‌మీదా వేలిముద్ర లన్నీ రావ్‌తో సరిపోతున్నాయి. అతని భార్య వేలి ముద్రలు ఆ గ్లాసుమీద తప్ప మరెక్కడా లేవు. ఇంకెవరి వేలిముద్రలు ఎక్కడా లేవు. క్షుణ్ణంగా గాలించాను. అన్ని బాటిల్స్‌మీదా ఆటోమైజర్‌తో ఎంథ్రసిన్ పౌడర్ జల్లి —"

"ఎంథ్రసిన్ జల్లావా!"

"ఓహ్, సారీ. ఇంకా నిషా దిగలేదు.... యూనివర్సల్ గ్రేపౌడర్ జల్లి, కేమిల్ బ్రష్‌తో పల్చగా అద్ది, ఉత్పన్న మైన వేలిముద్రలమీద ఈ టేప్స్ అంటించి లాగాను. పర్‌ఫెక్ట్ జాబ్. ఎక్కడా చెడిపోలేదు. పాయింట్స్, రేఖలు స్పష్టంగా వచ్చాయి.

లాల్ పదినిమిషాలసేపు మిగతా కవర్స్‌లోని వేలి ముద్రల్ని కూడా పరిశీలించి నిట్టూర్చాడు.

"గ్లోవ్స్ ఉపయోగించి వుండాలి. ఏమంటావు?"

జాన్ తలూపాడు. "మరో విషయం. నువ్వు చెప్పినట్లు జిన్‌లో కల్తీ ఏమీ లేదు. నేను రుచి చూశాను. పూర్తి జిన్ తాగేశాను. అది చూపవల్సిన ప్రభావంకంటే శక్తి వంతంగా ఏమీ లేదు. విస్కీ కూడా తాగాను. అది కూడా అసహజంగా ఏమీ లేదు. మిగిలిన బాటిల్స్ ఏవీ సీల్స్ విప్పలేదు.

"ఒకవేళ నీ అనుమానం నిజమై— జిన్‌లో మత్తు మందు కల్సివుంటే నేటికి అది శక్తిని కోల్పోయి

వుండవచ్చు. అది ఆ పదార్థ తత్వంమీద ఆధారపడి ఉంటుంది.

"ఇదీ ఒప్పుకోకపోతే అసలు బాటిల్‌లో కలిపి ఉండకపోవచ్చు. గ్లాసులో పోశాక మాధురి రహస్యంగా రావ్ జిన్‌లో కలిపివుండవచ్చు. ఆమె మామూలు జిన్ తాగి నటించి ఉండవచ్చు. అప్పుడు రావ్ సుషుప్తిలోకి జారుకున్నాక బాయ్ ఫ్రెండ్‌తో మిగతా తతంగం జరిపి ఉండవచ్చు. ఏమంటావు?"

"ఇప్పుడు మార్గం ఏమిటంటాను!" అన్నాడు లాల్ నిస్పృహగా. "ఆ వేలిముద్రలమీద నేను చాలా ఆశ పెట్టుకున్నాను. ఫలించలేదు. ఈ మాధురి కూడా ఎలాటి ఆధారాలు ఇవ్వలేదు. ఉదయంనుంచీ ఇంట్లోనే వుంది. ఆమెనెవరూ కలుసుకోలేదు."

"ఆమెని రాత్రులే కలుసుకుంటారు" అన్నాడు జాన్. "పగలు విశ్రాంతి తీసుకుంటుంది....ఆమె ఈ బ్లాక్ మెయిల్ వ్యవహారం నడుపుతూ విశ్రాంతిగా వుంటుందా? బిజీగా ఉంటుంది-ఫ్రెండ్స్‌తో సమావేశాలు జరుపుతూ, సూచనలిస్తూ. ఆమె ఫ్రెండ్ తప్పక కలుసుకొని ఉండాలి....కాని అతని జాడలేదు. ఉదయంనుంచీ ఆమె ఇంట్లో వంటరిగానేవుంది."

"రాత్రి కలుసుకుంటారేమో — రహస్యంగా ఉంటుంది."

"అవును. పదిగంటలకి సీరాక్‌లో ఆమె ప్రోగ్రాం వుంది. అదయ్యాక కనిపెట్టాలి. వస్తావా?"

సరిగ్గా తొమ్మిదిన్నరకి ఫోన్ మ్రోగింది. లాల్ రిసీవర్ ఎత్తి పలికాడు.

"హలో, లాల్! ఏం తెలుసుకొన్నారు?" రావ్

అన్నాడు.

లాల్ సందేహించాడు. "ఏమీ లేదు, అక్కడ వేలి ముద్రలు లేవు."

"ఓహ్, అయితే ఎలా? ఏం చేస్తారు?"

"మాధురిని కనిపెడుతున్నాం. ఏ క్షణంలోనైనా వాళ్ళిద్దరు బయటపడవచ్చు. సహనం వహించాలి, అంతే. అది ఈ రాత్రికే జరుగుతుంది. ఆమె ఫ్రెండ్ తప్పకుండా ఎక్కడో కలుసుకుంటాడు. అప్పుడతన్ని ట్రాప్ చేస్తాం."

"ఎలా? ఏ మార్గమాలోచించారు?"

"ఇప్పుడే చెప్పలేను. మీరు నిశ్చింతగా వుండండి. రేపు రాత్రిలోగా ఎలాగైనా అతన్ని పట్టుకుంటాం!"

"మిమ్మల్ని నమ్ముతాను, లాల్. నేనిక నిశ్చింతగా వుంటాను. మీరు ఉదయం ఫోన్ చేసి ఏ విషయం—హలో—ఓహ్ గాడ్! ఏమిటిది?"

లాల్ కళ్ళు చిట్లించాడు. "ఏమిటి మీర నేది?"

"ఇక్కడ—ఈ ఫోన్ మీద—ఏమిటిది?"

"ఏమిటిది?" లాల్ అసహనంగా అన్నాడు. అవతల క్లిక్ మన్న శబ్దం విన్పించింది.

లైను కట్—అయింది అకస్మాత్తుగా.

లాల్ అలాగే ఉండిపోయాడు కొన్ని క్షణాలు. ఆ తర్వాత ఉలికిపడి మళ్ళీ డయల్ చేశాడు. కానీ రెస్పాన్స్ లేదు.

"ఏమిటీ గొడవ!" అన్నాడు జాన్.

"రావ్ మధ్యలో ఫోన్ పెట్టేశాడు—ఏమీ చెప్పకుండా."

"ఏం చెప్పకుండా?"

"ఫోన్ మీద ఏదో వుందన్నాడు—"

"ఏం వుంది?"

"అదే చెప్పలేదు! తక్కున పెట్టేశాడు. ఫోన్ మీద-మౌత్ పీస్ మీద ఏమంటుంది, జాన్?"

"బ్లాక్ మెయిలర్ టాప్ చేశాడా? రావ్ దానిమీద బగ్ చూశాడా?"

"బగ్స్ పైకి కన్పించేలా అమర్చరు!"

"అయితే ఏమిటది! బల్లని చూశాడా? లేక బాద్దింకను—"

"దేని తాలూకో చిహ్నం చూశాడు. ఏమిటది? నువ్వక్కడేం చేశావ్? ఫోన్‌ని ముట్టుకొన్నావా విస్కీ చేతులతో? లేక వేలిముద్రలు తీస్తున్నప్పుడు పౌడర్—"

"లేదు, నేను ఫోన్‌ని అసలు ముట్టుకోలేదు."

"ఓహ్, మళ్ళీ డయల్ చేస్తే అతనెందుకు రెస్పాన్స్ ఇవ్వలేదు? ఏం చేస్తున్నాడు?"

"లెటజ్ రన్! వెళ్ళిచూద్దాం."

లాల్ ఉలిక్కిపడ్డాడు, "జాన్!"

"యస్?"

"మా సంభాషణ ఎవరో రహస్యంగా విన్నారు!"

"ఎవరు? ఎలా?"

"రావ్‌తో మాట్లాడుతున్నప్పుడు మధ్యలో క్లిక్‌మని శబ్దమైంది. అతనింట్లో ఎక్స్‌టెన్షన్ ఉండాలి. మా మాటలు వింటున్నదెవరో మధ్యలో కంగారుగా డిస్‌కనెక్టు చేశారు!"

"ఎవరు? అతనింట్లో ఇంకెవరున్నారు, భార్య తప్ప!"

"అవును.... భార్య!" లాల్ ముఖం ప్రసన్నమైంది. "ఈ భార్య ఇందులో ఎక్కడ ఇముడుతుంది, జాన్? ఆమె ఎలా వుంటుంది? ఆమెనోసారి చూడాలి. మా

మాటలు వినివుంటే ఫోన్ మీద వున్నదేమిటో తెలుసు కుంటుంది...."

జాన్ గబుక్కున రిసీవర్ ఎత్తి డయల్ చేశాడు.

వెంటనే రెస్పాన్స్ వచ్చింది.

"హలో, మిస్టర్ రావ్!"

"ఎవరూ?"

జాన్ ఉలికిపడి నిటారుగా కూర్చున్నాడు.

"రావుగారున్నారా?"

"లేరు, నేను మిసెస్ రావ్ ని?"

"ఆయనెక్కడున్నారు?"

"ఇప్పుడే హడావిడిగా వెళ్ళిపోయారు. ఎక్కడికో చెప్పలేదు. మీ రెవరు?"

"సారీ, ఆయనతోనే మాట్లాడాలి" జాన్ డిస్ కనెక్టుచేసి మరో నెంబర్ తిప్పాడు. కాసేపు విని పెదవులు చప్పరించాడు.

ఫోను పెట్టేస్తూ "మాధురి కూడా ఇంట్లో లేదు" అన్నాడు, "క్లబ్ కి వెళ్ళివుండాలి. రావ్ ఎక్కడికో చెప్పకుండా వెళ్ళాడని భార్య అంది. బహుశ క్లబ్ లో మాధురిని కలుసుకోవచ్చు."

"నువ్వక్కడికెళ్ళు. నేను రావ్ ఇంటికెళ్తాను" అన్నాడు లాల్ లేస్తూ. "అతని భార్య గొంతు ఎలా వుంది?"

"ఆడవాళ్ళ గొంతులా వుంది?"

"డామ్యూ!" లాల్ కోపం అణచుకొన్నాడు, "పెద్దమనిషి కంఠమా? వయసులో వున్న కంఠమా?"

"సారీ, బాస్ గమనించలేదు. నీ కెవరికంఠంకావాలి?"

"నీ కంఠం కావాలి! పిసుకుతాను!"

# 3

ఆమెను చూసి ఆశ్చర్యమేసింది లాల్‌కి.

ఆమె వయసు ముప్పై లోపు ఉంటుంది. ఎంతో ఆకర్షణీయంగా వుంది. ప్రపంచంలో అందమైనవాళ్ళు చాలామంది ఉంటారని లాల్‌కు తెలుసు. అతన్ని ఆశ్చర్యపర్చింది యాభై పైబడ్డ జగపతిరావ్‌కి ఆమె భార్య కావడం.

తేరుకొని నవ్వాడు, "మీరు మిసెస్ రావ్, అవునా?"

ఆమె తీక్షణంగా చూసింది.

"అవును. ఆయన లేరని చెప్పాను ఫోన్‌లో."

"లేరని చెప్పలేదు, వెళ్ళిపోయారని చెప్పారు."

ఆమె మరింత తీక్షణంగా చూసింది.

"ఆయనతో ఏం పని?"

"చాలా ముఖ్యమైన పని. ఆయనతో నే మాట్లాడాలి."

"అయితే ఆయన వెళ్ళిపోయారని—లేరని తెలిసి ఎందుకొచ్చారు?"

"ఎక్కడికెళ్ళారో తెలుసుకుందామని."

"ఎక్కడికెళ్తున్నారో నాతో చెప్పలేదన్నాను, ఫోన్‌లో."

"ఇప్పుడాలోచించుకొని చెప్పండి, నాతో. ఎక్కడి కెళ్ళి వుంటారు?"

"ఆయనతో పనేమిటో చెప్పండి, వూహిస్తాను."

"నేను బొంబాయినుంచి వచ్చాను—స్టాక్ ఎక్స్ చేంజ్ ఏజెంట్‌ని—ఆ విషయాలు మీకర్థంకావు. ఆయన్ని అత్యవసరంగా కలుసుకోకపోతే అయిదు లక్షలు నష్టమని మాత్రం చెప్పగలను."

నవ్వింది ఆమె. "మీరు నటించలేరు—మారువేషంలో తప్ప. మీ పాప్యులారిటీ బాగా పెరిగిపోయింది. జనం మిమ్మల్ని ఇట్టే గుర్తుపడ్తారు. లోనికి రండి, డిటెక్టివ్ లాల్. జాన్ ఏడి? మీరంటే నాకెంతో ఇష్టం."

"థాంక్యూ వెరీమచ్," లాల్ నవ్వుతూ లోనికి వెళ్ళాడు. "మీరు పేరు చెప్పనేలేదు. ఇష్టంలేదా? మిమ్మల్ని మిసెస్ రావ్ అనే—"

మళ్ళీ నవ్వింది ఆమె. "నా పేరు మాధవీలత — మాధవి అని పిలవండి."

"వెరీ వెల్!" లాల్ చుట్టూ చూశాడు. ఎక్కడా ఫోన్ లేదు.

"కూర్చోండి, లాల్. మిమ్మల్ని చూస్తే డిటెక్టివ్‌లా వుండరు. చాలా సింపుల్‌గా, ఆర్భాటం లేకుండా వుంటారు."

"నేను డిటెక్టివ్‌నని తెలియడానికి మెళ్ళో భూతద్దం చేతిలో పిస్తోలు పట్టుకోవాలా!" నవ్వాడు లాల్, "మీరు తెలుగు సినిమాలు బాగా చూస్తారనుకొంటాను. సినిమా, డిటెక్టివ్‌లు బఫూన్స్. మమ్మల్ని వాళ్ళలా ఊహించుకోకండి దయచేసి!"

నవ్వేసిందామె, ఈసారి పైకి గట్టిగా.

"ఓ.కే. మాడమ్. ఇక విషయానికొద్దాం. ఆయన ఎందుకలా వెళ్ళిపోయారు?"

ఆమె నవ్వు మాయమై మళ్ళీ తీక్షణంగా చూసింది.

"నాకు తెలియదు. ఈ గొడవేమిటో అసలు అంతు చిక్కడం లేదు!"

"ఆయన ఫోన్ మీద చూసిందేమిటి?"

ఆమె కళ్ళు విశాలం చేసింది. "ఫోన్ మీద ఏం

చూశారు? అది మీకెలా తెలుసు?"

"మీకులాగే నాకూ తెలుసు. ఆయన చెప్పగా నేను ఫోన్‌లో విన్నాను, మీరు ఎక్స్‌టెన్షన్‌లో విన్నారు. అంతే తేడా!"

"నేను ఎక్స్‌టెన్షన్‌లో విన్నానా?"

"ఈ ఇంట్లో ఇంకెవరూ లేరనుకుంటాను."

"మీరేమంటున్నారో అర్థంగావటంలేదు!"

"మీ భాషలోనే అంటున్నాను కదా?"

"నాకేమీ తెలియదు! మీరు పొరబడుతున్నారు."

"మీరు బుకాయిస్తున్నారు. మీరు ఎక్స్‌టెన్షన్‌లో మా మాటలు విన్నారని నాకు నమ్మకంగా తెలుసు."

"ఎలా తెలుసు? ఎలా ఆరోపిస్తున్నారు? అలా ఒకరి మాటలు వినే అలవాటూ, ఒకరి ఉత్తరాలు చదివే దుర్బుద్ధీ నాకెన్నడూ లేవు!"

లాల్ అసహనంగా చూశాడు. "అయితే ఇక్కడింకెవరున్నారు వింటానికి? దెయ్యంగాని విన్నదా?"

"నా ఇంట్లో దెయ్యాలున్నాయంటే వూరుకోను. మీ రాలోచించి మాట్లాడండి. సాయంత్రం మేం బయటికెళ్లాక ఇంట్లోకెవరో వచ్చాడు—"

"ఎవరు?"

"ఎవరో తిండిదొంగ! కిచన్‌లో స్టవ్ వేడిగా వుంది. గిన్నెలో పాలులేవు! కాఫీపొడి, చక్కెర డబ్బాలు స్థానాలు మారాయి. అంతేగాక ఒక ఆమ్లెట్ కూడా మాయమైంది...."

లాల్ ముఖం ఎర్రబడింది. "ఎవరొచ్చి ఉంటాడు?" అన్నాడు బలహీనంగా.

"నాకెలా తెలుసు? మీరు డిటెక్టివ్‌లు, తెలుసు

కోండి. ఈ పొడుగోల నాకంటే మీకే బాగా తెలుసు."

"సరే ఫోన్ ఎక్కడ? దానిమీద ఏం వుందో నేనే చూస్తాను."

"మీరు చూడకూడదు."

"ఎందుకు చూడకూడదు?"

"ఫోన్ బెడ్‌రూంలో వుంది."

"ఉంటే?"

"ఉంటే ఏమిటి! నా ఇంట్లో నాకు ప్రైవసీ ఉండదా? దాన్ని భంగపర్చడానికి మీరెవరు? మిస్టర్ లాల్, మీరొక విషయం బాగా గుర్తుంచుకోండి. మీరు రాత్రిపూట ఒంటరిగా వున్న ఆడదాని ఇంట్లో జొరబడి అఘాయిత్యం జరుపుతున్నారు. చాలా తీవ్రమైన పరిణామాలెదుర్కొంటారు!"

"బెదిరిస్తున్నారా? ఆల్ రైట్, అయితే వినండి. మీ వారు బ్లాక్ మెయిల్లో ఇరుక్కున్నారు. ఆయన ప్రతిష్ఠకు ప్రమాదం వుంది. మేం బ్లాక్ మెయిలర్‌ని ట్రేస్ చెయ్యడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నాం. మీవారికెలాంటి ఆపద రాకుండా చూస్తున్నాం. ఇప్పుడు మీరు పట్టుదల మాని సహకరిస్తారా?"

"సహకరించను. కట్టుకథలు చెప్పకండి! దయచేసి ఆయన వచ్చాక రండి!"

"ఆయనెలా వెళ్ళారు?"

"కార్లో వెళ్ళారు."

"మీరెప్పుడొచ్చారు?"

"తొమ్మిదిన్నర కావస్తోంది."

"భోజనం చేశారా?"

"లేదు. నేను కిచెన్‌లో సర్దుతున్నాను. ఇంతలో ఆయన క్రిందికి దిగివచ్చి హడావిడిగా వెళ్ళిపోయారు."

"ఏమీ చెప్పకుండా నే?"

"అవును. అంతకుముందు ఫోన్‌లో మాట్లాడు తున్నారు."

"ఎక్స్‌టెన్షన్ ఎక్కడవుంది?"

"ఆ ప్రక్కగదిలో!" అర్చింది దామె కోపంగా.

"ఆయన బట్టలు మార్చుకున్నారా?"

"లేదు, అలాగే వెళ్ళిపోయారు."

"అప్పుడు మీ రేం చేశారు?"

"భోజనం చేశాను."

"బట్టలు మార్చుకోకుండా నే?"

"అవును."

"మీ ఆచారం వింతగా వుంది. ఆయన వెళ్తున్నప్పుడు లేక వెళ్ళిపోయాక మళ్ళీ ఫోన్ మోగింది కదూ?"

"అవును, అప్పుడు నేనే ఎత్తాను."

"అప్పుడు ఎత్తలేదు. ఆయన డిస్‌కనెక్టు చేసిన వెంటనే నేను డయల్ చేశాను. అప్పుడు రెస్పాన్స్ లేదు. తర్వాత జాన్ చేసినప్పుడు మీరు పలికారు."

"అయితే మొదటిసారి వినివుండను."

"వినే వుండాలి....ఇది రాత్రి సమయం. శబ్దాలు దూరంగా వ్యాపిస్తాయి. మీ ఇంట్లో మనుషులెవరూ లేరు సందడికి."

"నాకేమీ విన్పించలేదప్పుడు."

"కానీ మిమ్మల్ని చూస్తే భోజనం చేసినట్టులేదు,"

"ఎలా అంటున్నారు? ఏమిటి ఉద్దేశం?"

"మీరు బయటనుంచి వచ్చి ఇంకా ముఖం కడుక్కో

లేదు. మీ బట్టలు బాగా నలిగాయి. తల చెదిరింది. ముఖంమీద చెమట ఉడ్డు .... వెల్, వెల్, మీరు చేతులెందుకు దాస్తున్నారు? అవెందు కలా వణుకుతున్నాయి?"

"మిస్టర్ లాల్! వెళ్ళిపొండి! మీ పిచ్చిమాటలతో నన్ను హింసచేస్తున్నారు!"

"అయాం సారీ, నేనిప్పుడు వెళ్ళదలచలేదు."

"అంటే?"

"ఆయన వచ్చేవరకూ ఇక్కడే ఉంటాను" అన్నాడు లాల్ చుట్టూ చూస్తూ. "మీ ఇల్లు బాగుంది. బాగా అలంకరించారు. మీ అభిరుచికి జోహార్లు. ఆ పెయింటింగ్ మరీ బాగుంది. మీకు ఇందిరాగాంధీ అంటే ఇష్టమా?"

"మావారి కిష్టం."

"చాలా బాగుంది. భర్తల ఇష్టాల్ని తెలుసుకొని నడుచుకొనే భార్యలంటే నాకు చాలా గౌరవం."

ఒక్కసారిగా ఫోన్ మ్రోగింది.

ఆమె కంగారుగా చూసింది. లాల్ నవ్వాడు.

"మీవారు కావచ్చు—"

"మీరిక్కడే వుండండి. నేను చూసివస్తాను!" ఆమె గిరుక్కున తిరిగి, మెట్లెక్కి పైకురికింది.

లాల్ వేగంగా ప్రక్కగదిలో దూరి ఎక్స్‌టెన్షన్ ఎత్తాడు.

అవతలి కంఠం అంటోంది, "హలో ఎవరవతల?"

అది జాన్ గొంతు.

మాధవి అంది, "మీ రెవరసలు?"

"నేను— నేను—అయితే మీరు మిసెస్ రావ్ కమా?"

"ఓహ్, నువ్వా మీరా! నటించకండి, మీరెవరో నాకిప్పుడు తెలుసు! డర్టీ డిటెక్టివ్ జాన్! ఎందుకు ఫోన్ చేశారు?"

"గాడ్... లాల్ అక్కడున్నాడా?"

"ఈ ఇల్లు మీ స్థావరమనుకున్నారా? పెట్టేయండి ఫోను!"

"మాడమ్—"

ఠక్కున లైను కట్ అయింది.

లాల్ వెంటనే రిసీవర్ పెట్టేసి బయటికొచ్చాడు.

"ప్లీజ్ గెటవుట్, లాల్! ఈ పొడుగోల నేనింక భరించలేను!" అర్చింది మాధవి, మెట్లు దిగివస్తూ.

"ఫోన్ చేసిందెవరు?"

"మీ పార్ట్‌నర్."

"ఏమన్నాడు?"

"త్వరగా రమ్మన్నాడు. ప్లీజ్ వెళ్ళిపోండి."

"ఆల్‌రైట్, ఆ ఫోన్ మీద ఏం వుందో ఇప్పుడైనా చూశారా?"

"అబ్బబ్బబ్బ! ఏం వుంటుంది? ఎవరన్నారు? మీకు పిచ్చెక్కింది."

"పిచ్చెక్కింది.... అవును, పిచ్చెక్కింది" అన్నాడు లాల్ సాలోచనగా. "అయితే ఆ గదిలో నాకు ఎంట్రీ-ప్రవేశం లేదన్నమాట?"

"లేదు. లేదుగాక లేదు. వందసార్లు లేదు!"

"అయితే మొదటిసారే వెళ్ళిపోతాను!" అన్నాడు లాల్ వెంటనే "ఆయనొచ్చాక ఫోన్ చేయమని చెప్పారా?"

"చెప్తాను," అందామె చల్లబడుతూ.

ఆమెనోసారి పరీక్షగా చూసి బయటికి నడిచాడు లాల్.

# 4

సమయం 11 కావస్తోంది. బయట చీకటిగా వుంది. లాల్ కారు వేగంగా డ్రైవ్ చేసి వీధి మలుపులో ఆపేశాడు. వెంటనే దిగి చుట్టూ చూశాడు. జనసంచారం లేదు. గబగబా రావ్ ఇంటికేసి నడిచాడు. నడక మూడు నిమిషాలు పట్టింది. రావ్ ఇంట్లో ఇంకా లైట్లు వెలుగుతున్నాయి. ముందు తలుపు మూసివుంది.

లాల్ ప్రహరీ గోడ దూకి, మొక్కల్ని చాటు చేసుకుంటూ ఇంటి వెనక్కి ఉరికాడు. మేడమీదకి మెట్లు ఇంట్లోంచి వున్నాయి....ఇంటి వెనుక ఎడమవేపు పైనుంచి డ్రైనేజి పైపులున్నాయి. వాటిని పట్టుకొని ఎగబ్రాకసాగాడు. రెండు నిమిషాల్లో పైకి చేరుకొని బాల్కనీలో ప్రవేశించాడు. అలికిడి కాకుండా, నెమ్మదిగా వెలుతురు వస్తోన్న గది కిటికీ దగ్గర వెళ్ళి ఆగాడు.

గదిలో ఎవరూ లేరు.

గ్రాంఫోన్‌లో పాప్ మ్యూజిక్ తక్కువ స్థాయిలో వినిపిస్తోంది. గదిలో ఫోంబెడ్, రెండు పేము కుర్చీలు, టీపాయ్, ఒక టేబిల్ మొదలైనవి ఉన్నాయి.

టీపాయ్‌మీద ఒక సిగరెట్ ప్యాకెట్, లైటర్, ఆష్‌ట్రే వున్నాయి. ఆష్‌ట్రే అంచున ఒక సిగరెట్ సగంవరకు కాలి ఆరిపోయి వుంది. లోపల చాలా పీకలు కుక్కి వున్నాయి.

టీపాయ్ చివర ఒక గ్లాసు, విస్కీ, సోడా సీసా వున్నాయి.

ఇంతలో మాధవి ప్రవేశించింది గదిలో.

ఆమె వస్తూనే వింత భంగిమలో వచ్చింది— మ్యూజిక్‌కి అనుగుణంగా శరీరాన్ని కదిలిస్తూ.

లాల్ ఒక్కక్షణం ప్రక్కకు తొలగి మళ్ళీ చూశాడు.

ఇప్పుడు గ్రాంఫోన్ హెచ్చు స్థాయిలో విన్పిస్తోంది.

ఒక్క గుక్కలో గ్లాసు ఖాళీచేసి లేచింది. సిగరెట్ ఒక దమ్ము గట్టిగా లాగి ఆష్‌ట్రేలో కుక్కింది. తిరిగి నృత్యం ప్రారంభించింది.

లాల్ దృష్టి ఆమెమీదనుంచి టేబిల్ మీదనున్న టెలిఫోన్ పైన పడింది. దాన్ని తదేకంగా చూశాడు. ప్రత్యేకంగా ఏమీ కన్పించక పోవడంతో, కొన్ని క్షణాలు ఆమె నృత్యం ఉత్సాహంగా చూసి వెనుదిరిగాడు.

కారెక్కి వేగంగా మెయిన్ రోడ్ చేరుకొన్నాడు. బిజీగా వున్న ఒక రెస్టారెంట్‌లో కెళ్ళి, సీరాక్ హోటల్‌కు ఫోన్ చేశాడు. రిసెప్షనిస్టుతో ఆ కాల్ అక్కడే వున్న డిటెక్టివ్ జాన్ కివ్వమన్నాడు.

"హాలో, జాన్. లాల్ హియర్" అన్నాడు జాన్ గొంతు విని.

"లాల్! నువ్వెక్కడున్నావ్!"

"ఇప్పుడే రావ్ ఇంటినుంచి వస్తున్నాను."

"కానీ నువ్వక్కడ లేవని ఆమె చెప్పింది—"

"ఆమె అలాగే చెప్తుంది. నువ్వెందుకు ఫోన్ చేశావ్?"

"రావ్ గురించి....అతనిక్కడికి రాలేదు."

"మాధురి?"

"వచ్చింది....ఇప్పుడే ఆమె ప్రోగ్రాం ముగిసింది— బోనీ—యమ్: రాస్పుటిన్ నెంబర్ అద్భుతంగా అభినయించింది—వారెవా!"

"వెల్, నువ్వక్కడ పబ్లిక్ డాన్సు చూశావు, నేనిక్కడ ఫ్యామిలీ డాన్స్ చూశాను."

"అంటే....?"

లాల్, మాధవి గురించి అంతా చెప్పాడు.

"అరె బ్రదర్, నీకేం తెలుసు! ఆ అదృష్టం నాకు గనుక లభిస్తేనా!"

"మాధురి ఎక్కడుంది?"

"ప్రస్తుతం గ్రీన్ రూంలో."

"ఏం చేస్తోంది?"

"అవతారం మార్చుకుంటోంది."

"ఆమెతో ఎవరున్నారు?"

"ఎవరూ లేరు....లాల్, మనం అనుకొనే బ్లాక్ మెయిలర్ ఇక్కడ ప్రత్యక్షంగా లేరు. మాధురి ఈ రాత్రి ఇక్కడే వుంటుందో. ఇంటికెళ్తుందో తెలియదు. నేనామెతో గడపాలనుకొంటున్నాను—ఓహ్, నా ఉద్దేశం అది కాదు, బాస్—అందుకామె ఒప్పుకొంటే ఆమె ఫ్రెండ్ ఈ రాత్రి కలవడని స్పష్టమవుతుంది. ఒప్పుకోకపోతే కలుసుకొనే అవకాశం ఉండవచ్చు. అలా ఏ విషయం తెలిస్తే వాళ్ళని కనిపెట్టి ఇద్దర్నీ ట్రాప్ చెయ్యవచ్చు. ఏమంటావు?"

"నీకీ ఆలోచన ఎలా వచ్చిందో తెలియడంలేదు. ఆమెను చూస్తే వాడిపోయిన పువ్వులా—"

"డామ్ హర్ గ్లామర్! ఎవడిక్కావాలి? పిచ్చాపాటి మాటలతో కాలక్షేపానికి గ్లామర్ కావాలా? లాల్, నన్నిలా చపలుడిగా ట్రీట్ చెయ్యకు. నీరసం వస్తోంది!"

"జాన్, నిన్ను వేలిముద్రల కోసం వంటగదిలోకెవరు వెళ్ళమన్నారు?"

"వంటగది....? ఏ వంటగది? ఎవరన్నారు?"

"మాధవీ లత అంది. నువ్వక్కడ ఓ ఆమ్లెట్ కాజేసి కాఫీ చేసుకు తాగావు."

"ఓహ్, డామ్ హార్....! మరేం చెయ్యమంటావు? డిటెక్షన్‌లో తాగేసిన విస్కీ, జిన్ కలిసి నోళ్ళు తెలియకుండా చేశాయి. ఆమ్లెట్ తినేసి, మూడు కప్పుల కాఫీ తాగాను. ఆ పని చెయ్యకపోతే నా గతేంకాను! అక్కడే పడిపోయి—వాళ్ళొచ్చాక ఆమె చేత తిట్లూ, దెబ్బలు తినమంటావా?"

"వద్దు—ఆమ్లెట్ తిని మంచి పని చేశావు. ఇప్పుడు రావ్ సంగతేమిటి?"

"అన్నీ నా నెత్తిన వెయ్యకు! నువ్వేం చేస్తావ్? ఇంటికెళ్ళి పడుకుంటావా? మర్యాదగా రావ్ ఇంటిదగ్గర నిఘా వేస్తే సరేసరి! లేదా మళ్ళీ నీకు కన్పించను. దోస్త్ దోస్త్ నారహా....అని పాడుకొంటూ వెళ్ళిపోతాను. అర్థమైందా?"

"శాంతించు! రావ్ నేరుగా బ్లాక్ మెయిలర్ దగ్గరికెళ్ళాడని నా అనుమానం, జాన్. ఫోన్ మీద అతనికేదో క్లూ దొరికింది. దాంతో బ్లాక్ మెయిలర్ ఎవరో తెలిసిపోయి వుండవచ్చు. అది మనకు తెలియనివ్వకుండా వెళ్ళిపోయాడు."

"అయితే మర్డర్ కవకాశముంది, లాల్. నివారించే మార్గం ఆలోచించాలి! ఆ క్లూ ఏమిటో తెలిసి చావటం లేదు! కొన్ని క్లూస్ ఎదురువచ్చి పలకరిస్తాయి, క్లూ ఇచ్చిన కాకిపిల్లలా. కొన్ని క్లూస్ దాగుడుమూతలాడుతూ సతాయిస్తాయి ఇలా!

"లాల్, మాధవి అబద్ధం చెప్తోంది. ఎక్స్టెన్షన్‌లో

ఆమె తప్ప ఎవరూ వినలేరు. కానీ ఏదో మోటివ్‌తో ఆ విషయం దాస్తోంది. ఫోన్ మీద రావ్ చూసిందేమిటో ఆమెకు తెలిసి ఉండవచ్చు—లేదా—ఉండకపోవచ్చు—రావ్ దాన్ని తొలగిస్తే.

"అయితే ఆమె ప్రవర్తన నా కాశ్చర్యంగా వుంది. ఆమె మద్యం ముట్టుకోదని రావ్ అన్నాడు. అలాగే ఫ్రీజ్‌లో ఆమె వేలిముద్రలులేవు. కానీ ఇప్పుడామె విస్కీతోబాటు సిగరెట్లు కాల్చడం నమ్మలేకపోతున్నాను. నిజమేనా, లేక అలా నీవు కలగన్నావా? పిసలైన బ్రహ్మచారివి!"

"షటప్, నిజమే! నాకలాంటి కలలురావు."

"ఓ.కే! సిగరెట్లు ఏ బ్రాండ్‌వి?"

"రావ్ బ్రాండ్ కాదు."

"వెల్, ఆమె ధైర్యాన్ని మెచ్చుకోవాలి లాల్! లేక ఆమె ప్రవర్తనను అనుమానించాలా? భర్త ఆమెతో ఎక్కడికెళ్తున్నాడో, ఎప్పుడొస్తాడో చెప్పకుండా వెళ్ళిపోతే; ఆమె ఏ ధైర్యంతో తాగుతూ ఆడుతూ ఎంజాయ్ చేస్తోంది? హాఠాత్తుగా అతను వచ్చేస్తే? అంత త్వరగా రాడని ఆమెకు తెలుసా? ఎలా తెలుసు? అయితే ఎక్కడికెళ్ళాడో కూడా తెలిసి వుండాలి—"

"జాన్, నువ్వెక్కువ మాట్లాడేస్తున్నావు. అక్కడెవరూ లేరా?"

"మూసే వేళయింది, ఎవరూ లేరు. రిసెప్షనిస్టు దూరంగా వ్రాసుకొంటున్నాడు. ఓ.కే. నేను మాధురిని కనిపెడ్తాను. నువ్వు రావ్ ఇంటిదగ్గరే వుండు, అతనొచ్చే వరకూ. మళ్ళీ మనం కలుసుకునేది ఇంట్లోనే. అదుగో.... ఆమె వస్తోంది! వెంట ఎవరో వున్నాడు—"

"ఎవరు? ఎలా వున్నాడు?"

"సింథీలావున్నాడు. బాంబే డైయింగ్ మోడల్‌లా ఆరోగ్యంగా వున్నాడు. ఇద్దరూ మాట్లాడుకోడంలేదు. బయట టాక్సీ ఎక్కుతున్నారు....డోర్ గ్లాస్‌లోంచి కన్పిస్తోంది. ఆల్ రైట్ లాల్, నేనిక వెళ్లాలి గుడ్ నైట్!"

"గుడ్ నైట్, జాన్."

# 5

సమయం 12 కావస్తోంది. లాల్ తిరిగి కారెక్కి రావ్ ఇంటికి పోనిచ్చాడు. ఈసారి ఇంటి వెనుక వీధిలోకి డ్రైవ్ చేస్తూ ఆలోచించసాగాడు. కారు సరిగ్గా రావ్ ఇంటి వెనుక ప్రాంతాల చేరుకొంటుందనగా, హెడ్ లైట్స్ వెలుగులో రోడ్డుమీద పొడుగ్గా ఏదో మరక కన్పించింది.

లాల్ కారాపేసి హెడ్‌లైట్స్ ఆర్పేశాడు. డాష్ బోర్డునుంచి డ్యూలక్స్ మినీ టార్చి అందుకొని దిగాడు. ఓసారి వీధి రెండువైపులా చూసి, ఆ మరక దగ్గరికెళ్ళి టార్చివేశాడు.

అది పేడ మరక. ఇంకా పచ్చిగా వుంది. అందులో టైరు గుర్తులున్నాయి. అవి నాలుగడుగుల దూరం వెళ్ళి అదృశ్యమయ్యాయి.

తల ఎత్తి మళ్ళీ ఇరువైపులా చూశాడు. ఎవరూ లేరు. రావ్ పెరటి తలుపు దగ్గర ఆగి నెట్టి చూశాడు. తెరచుకోలేదు. ఓ క్షణం ఆలోచించి అక్కడినుంచి గబగబా కదిలి వెళ్ళిపోయాడు.

వేగంగా ఇంటిముందు వీధిలోకొచ్చి గేటు దగ్గర ఆగాడు. లైట్లు వెలగడంలేదు. లోపల కారు కన్పిస్తోంది. సందేహించకుండా వెంటనే గోడమూకి దాన్ని చేరు

కొన్నాడు. టార్చి వేసి టైరు పరిశీలించాడు. ముందువైపు ఎడమ టైరుకి పేడ అంటివుంది. బాయ్‌నెట్ తెరిచి ఇంజన్ ముట్టుకొని చూశాడు. వేడిగా వుంది....

డోర్ తెరిచి లోన చూశాడు. ఏక్సిలేటర్, బ్రేక్ పెడల్స్ పరిశీలించాడు. వాటిమీద ఫుట్‌బోర్డుమీద తడసిన మట్టి కన్పించింది. దాన్ని కర్చీఫ్‌లో ఎత్తి చుట్టాడు. ఇంకేమీ అతని దృష్టి నాకర్షించలేదు.

డోర్ మూసి ఇంటి వెనక్కి నడిచాడు. బావి దగ్గర నేల మెత్తగా తగిలింది. టార్చి వేసి చూశాడు. అక్కడ రెండు అడుగుజాడలున్నాయి. వేగంగా పెరటి తలుపును చేరుకొని చూశాడు. గడపమీద మట్టి అంటుకొని వుంది. దాన్ని కర్చీఫ్‌లో మట్టితో సరిపోల్చుకున్నాడు.

వెనక్కి తిరిగి వరండా తలుపు నెట్టి చూశాడు. లోపల గడియ వేసి వుంది. అక్కడనుంచి ఎడమదిక్కు పరిగత్తి పైపు పట్టుకొని చరచరా పైకి ప్రాకసాగాడు.

రెండు నిమిషాల్లో పైకి చేరుకొని బాల్కానీలో దూకాడు. అడుగులో అడుగువేసుకుంటూ బెడ్‌రూం కిటికీ దగ్గర కెళ్ళి ఆగాడు.

లోపల మసగ్గా లైటు వెలుగుతోంది. గది ఇందాకటిలాగా శుభ్రంగా వుంది. బెడ్‌మీద మాధవి కిటికీ వైపు నిద్రపోతోంది. ఆమె ప్రక్కన రావ్ అటు తిరిగి పడుకొని వున్నాడు....

లాల్ వాళ్ళిద్దర్నీ కాసేపు తదేకంగా చూసి అక్కడి నుంచి కదిలాడు. అలసటగా ఇంటికి చేరుకొనేటప్పటికి అక్కడ జాన్ మెట్లమీద సిగరెట్ కాలుస్తూ కన్పించాడు.

"హాయ్! అప్పుడే వచ్చేశావేమిటి?"

"నువ్వు కూడా వచ్చేశావేమిటి?" లాల్ అన్నాడు.

"నా డ్యూటీ అయిపోయింది."

"నా డ్యూటీ కూడా అయిపోయింది."

ఇద్దరూ ఒకర్నొకరు చూసుకొన్నారు అనుమానంగా.

"నిన్ను నమ్మను" అన్నాడు జాన్.

"నిన్నెలా నమ్మమంటావు?" అడిగాడు లాల్.

"ఆల్ రైట్ కూర్చో చెప్తాను. వెన్నెల చక్కగా కాస్తోంది, కమాన్ మాధురి గురించి మనం అపోహ పడ్డాం. ఈ వ్యవహారంలో ఆమెకేమీ సంబంధంలేదు. పూర్తిగా నిర్దోషి. ఆమె ఆ సింధీతో బాటు అతనింటి కెళ్ళింది. అతనికి ముప్ఫై ఏళ్ళుంటాయి. బేగం పేట పోష్ ఏరియాలో పెద్ద బంగళావుంది. బాగా డబ్బుగలవాడు. అంత డబ్బున్నవాడు బ్లాక్ మెయిలర్ ఆయ్యే అవకాశం లేదు కదూ?"

"అసలా డబ్బు బ్లాక్ మెయిల్ ద్వారా గడిస్తే ఉండవచ్చు."

"వెల్, అతను బ్లాక్ మెయిలర్‌లా కన్పించలేదు. బిజినెస్ మైండ్ ఫెలో. అలాగే మాధురి ప్రొఫెషన్ మైండెడ్. ప్రక్క దార్లు తెలియవు.

"వాళ్ళతో నేను ఇంట్లోకి అనుసరించాను. వాళ్ళ మాటలకీ మన అనుమానాలకీ సంబంధమే లేదు. వాళ్ళిద్దరి మధ్య వ్యామోహం తప్ప మరే సంబంధంలేదు! అక్కడి నుంచి నిష్క్రమించాను."

"తర్వాత?"

"వెంటనే మాధురి ఇంటికెళ్ళాను. ఎవరూ లేరు. ఆమె బ్లాక్ మెయిలర్ అనేందుకు, లేదా బ్లాక్ మెయిలర్‌తో సంబంధముందనేందుకూ ఆధారాలేమీ దొరక

లేదు. కాబట్టి ఇంకా ఆమెని అనుమానించడం అనవసర మనుకున్నాను....

"ఇప్పుడొక్కటే మార్గముంది. ఈ బ్లాక్ మెయిలర్ ఎవరో తెలియాలంటే మనం రావ్‌ని అనుసరించాలి. అతను ఫోన్ మీద ఏం చూశాడో, ఎక్కడికెళ్ళాడో తెలుసుకుంటే బ్లాక్ మెయిలర్ దొరికిపోతాడు. నువ్వేం తెలుసుకున్నావు?"

లాల్ అన్నాడు. "చాలా తెలుసుకున్నాను. కానీ ఫ్రెష్ న్యూస్ ఏమిటంటే, రావ్ తిరిగి వచ్చాడు. అతని రాక చాలా మిస్టీరియస్‌గా వుంది. కారు ఇంటివెనుక వీధిలో ఆపి, ముందుకు నడిచివచ్చి లోనికెళ్ళాడు. ఇంట్లో అతనేదో చేయాల్సింది చేసి, లేదా చూడవల్సింది చూసి- పెరటి తలుపు ద్వారా కారుచేరుకొని ఇంట్లో తెచ్చి పెట్టాడు. ఆ తర్వాత సుఖంగా నిద్రపోయాడు."

"ఏమిటీ గొడవ! ఏమిటతని ఉద్దేశం?"

లాల్ సిగరెట్ వెల్గించి అన్నాడు.

"ఎలిబీ కావచ్చు. బ్లాక్ మెయిలర్‌ని ఎదుర్కోవ డంలో ఏదైనా అనర్థం జరిగిందేమో."

"ఆ బ్లాక్ మెయిలింగ్ బ్రూట్ ఎవరసలు! రావ్ ఎందుకలా ప్రవర్తించాడు, మనల్ని నిర్లక్ష్యం చేసి?"

జాన్ ఉలిక్కిపడి నెమ్మదిగా అన్నాడు, "లాల్, నాదొక సందేహం."

"చెప్పు."

"రావ్ ఒకవేళ ఇంటివెనుక కార్లో కాచుకున్నా డేమో?"

"దేనికి?"

"ఏదైనా అనుమానంతో.... భార్యని అనుమానిస్తుం

డవచ్చు. ఆమె కారెక్టర్ నువ్వు చూశావుగా? రావ్ ఫోన్ మీద ఏమీ లేకుండానే బుకాయించి వుండాలి. అదేమిటో బ్లాక్ మెయిలర్ని వెలికిలాగే ఆధారమనుకొని రావ్ అక్కడికెళ్ళాడని మనం అనుకుంటాం...అనుకుంటున్నాం. కానీ అతనలా తప్పుదోవ పట్టించి ఇంటివెనుక భార్యమీద నిఘా వేశాడని ఎందుకనుకోకూడదు?"

"ఒక పాయింట్ ఉంది—"

"షూట్!"

"ఆమెమీద నిఘా వేస్తే, ఆమెని రెడ్ హాండెడ్‌గా పట్టుకోవాలనుకుంటే, ఆమె యాక్షన్‌లో ఉన్నప్పుడే ఎంచక్కా నడిచివెళ్ళి అప్‌సెట్ చెయ్యావచ్చు. కానీ అతనలా వెళ్ళలేదు. కిమ్మనకుండా వెళ్ళి భార్యతో నిద్ర పోయాడు. ఆ నిద్ర కూడా అంతలోనే ఎలా ముంచుకొచ్చిందన్నది కూడా మిస్టరీయే!"

"ఎలా?"

"నేను చూసినప్పుడు అతని కారు ఇంజన్ వేడిగా ఉంది. అంటే, నేనక్కడికి వెళ్ళిన సుమారు పదినిమిషాల క్రితం అతనొచ్చి ఉండాలి. ఈ పదినిమిషాల్లోనే భార్య తలుపు తీయడం, అతను లోనికెళ్ళి బట్టలు మార్చుకోడం, లైటార్పేసి నిద్రలో జారుకోవడం ఎలా జరిగాయి? నో, జాన్. రావ్ ఏదో గూడుపురాణి సాగించాడు. దాన్ని కప్పిపుచ్చడానికి మన జోక్యం నివారించడానికి నిద్ర నటిస్తున్నాడు—"

"ఓహ్, అయితే మళ్ళీ మొదటికే వచ్చాం. అయితే రావ్ ఫోన్ మీద చూసిందేమిటో నిజమన్నమాట! ఈ మాధవి వ్యవహారం మరీ తల తినేస్తోంది! భర్త ఎప్పుడొస్తాడో తెలియంది ఎలా డాన్సు చేసింది? అసలా క్లూ

ఏమిటో తేల్చకపోతే ఎవరు ఏమిటో బోధపడదు!"

"వెల్, ఎలా తేలుస్తావు?"

జాన్ క్షణం మౌనంగా వున్నాడు.

"రైట్—హో! నువ్వామె డాన్సు చూశావు, తాగటం చూశావు, పేల్చడం చూశావు. ఆమె చాటు వ్యవహారం భర్తకు తెలియకుండా కాపాడాలంటే, ఫోన్ మీద చూపించేదేమిటో చెప్పమను!"

"అది బెదిరింపు. బ్లాక్ మెయిల్. ఆ పద్ధతి నాకు నచ్చదు. పైగా ఆ క్లూ ఆమెకు తెలుసని ఎలా అనుకుంటాం? రావ్ తొలగించి ఉండొచ్చు. ఈ విషయం నువ్వే చెప్పావు...రావ్ వచ్చిన వెంటనే నాకు ఫోన్ చెయ్యమని ఆమెకు చెప్పావు. చెయ్యలేదు. ఆమె చెప్పి ఉండకచ్చు. కానీ రావ్ గిల్టీ కాన్షస్‌తో చెయ్యలేక పోయాడు."

"వెల్, మనకా కాన్సస్ లేదు. మనం చెయ్యొచ్చుగా?"

"అవును, మనమే చేద్దాం."

ఇద్దరూ లేచి ఇంట్లో కెళ్ళారు. లాల్ ఫోన్ ఎత్తి డయల్ చేశాడు.

"హలో, ఎవరూ?"

"హలో, మాధవిగారూ. నేనెవరో మీకు తెలుసు. ఆయన వచ్చారా?"

"ఓహ్, మళ్ళీ మీరా!"

"ఆయన వచ్చారా?"

"వచ్చారు."

"ఎన్ని గంటలకి?"

"పన్నెండు కావస్తోంది."

"ఎక్కడికెళ్ళారో చెప్పారా?"

"లేదు."

"మీరడిగారా?"

"అడిగినా చెప్పలేదు."

"వచ్చినపుడు మనిషెలా వున్నారు?"

"గాభరాగా కన్పించారు."

"నాకు ఫోన్ చెయ్యమని చెప్పారా?"

"చెప్పాను. కానీ ఉదయం కలుసుకుంటానన్నారు. బహుశా నా సమక్షంలో ఆ విషయాలు మాట్లాడ్డం ఇష్టం లేదనుకొంటాను."

"ఏ విషయాలు, మాధవిగారూ?"

"మీ ఇద్దరికీ తెలిసిన విషయాలు."

లాల్ నవ్వాడు, "ఇప్పుడేం చేస్తున్నారాయన?"

"నిద్రపోతున్నారు. లేపమనకండి! ఆయనకు విశ్రాంతి కావాలి. నిద్రపోనివ్వండి. మీ డిటెక్టివ్‌లకు రాత్రికీ పగటికీ తేడా తెలియకపోతే మాకు తెలుసు!" ఈ మాటలతో లైను కట్ అయింది.

లాల్ ఫోన్ పెట్టేసి జాన్‌కు విషయం చెప్పాడు.

"....కాబట్టి జాన్, మనం కూడా నిద్రపోవడం మంచిది. రాత్రికీ పగటికీ తేడా మనకూ తెలుసు, సిగరెట్‌కూ సిగార్‌కులా! రేపుదయం రావ్ కలుసుకునేంత వరకు విశ్రాంతి. బ్లాక్ మెయిలర్ రేపు రాత్రివరకు గడు విచ్చాడు. ఆలోపు ఏదో మార్గం తట్టకపోతుందా?"

"మనసుంటే మార్గం ఇప్పుడే తట్టవచ్చు."

"నాకు తట్టదు, అలసిపోయాను."

"నాకు నిద్రపట్టదు. కాలక్షేపం కావాలి."

"నీ కాలక్షేపానికి నేను అడ్డులేను."

"నా కాలక్షేపానికి నువ్వే కావాలి."

"అంటే?"

జాన్ నవ్వాడు. "ఈ బ్రెయిన్ టీజింగ్ క్లూ కోసం కాస్సేపు కుస్తీపడదాం. అదేమిటో తేల్చకపోతే మన శ్యాంతి వుండదు! కమాన్, లెటజ్ స్టార్టు - నాకు తోచింది నేనొకటి చెప్తాను, నువ్వొకటి చెప్పాలి: ఒకటి, సిగరెట్ నుసి."

లాల్ విసుగ్గా చూసి అవులించాడు. "కాదు, గ్యాస్ టవ్ మసి."

"జోక్ చెయ్యకు. రెండు, సబ్బు నురుగు."

"నో, గొంగళిపురుగు. ఇది కూడ ప్రాసకుదిరింది."

"షటప్! నన్ను రెచ్చగొట్టకు, లాల్. మూడు, వానిషింగ్ క్రీమ్."

"ఊహుఁ! అదీ కాదు, చూయింగ్ గమ్."

జాన్ ఉలికిపడ్డాడు. "అలాగా? అయితే విను.... చుంబనమ్! వహ్వా!"

లాల్ తల విదిలించాడు. "చుంబనమ్ ...? అంటే?"

"ముద్దాడుట! కిస్సింగ్, మైడియర్!" అర్చాడు జాన్.

"కిస్సింగ్ ....?" లాల్ తికమక పడ్డాడు.

"యురేకా!" జాన్ అర్చాడు మళ్ళీ, "పార్ట్నర్! రావ్ ఫోన్ మీద చూసిందేమిటనుకున్నావ్?"

"ఏమిటి?"

"డోంట్ బి చైల్డిష్! లిప్ స్టిక్ యార్. లిప్ స్టిక్ మరక!"

"లిప్ స్టిక్ మరక...? ఎలా వచ్చింది?"

"ఎలా వస్తుంది! మాధవి కిస్ ఇచ్చింది. అది సరిగ్గా మౌత్ పీస్ మీద వుంది!"

"ఎవరికిచ్చింది?"

"ఎవరికిస్తుంది! భర్తకనుకున్నావా? అనుకుంటే నువ్వు ఫూల్ వి! బాయ్ ఫ్రెండ్ కిచ్చింది! అతనెవరో రావ్ కు తెలుసు. ఫోన్ మీద ఆ మరక చూసి, కుట్ర పసిగట్టాడు. అతనే బ్లాక్ మెయిలర్ అనుకొని పరిగెత్తాడు—"

"ఆగు, జాన్. బ్లాక్ మెయిలర్ ఎవరో రావ్ కు తెలిసి ఉంటే, హెచ్చరిక చేసినపుడు అతని గొంతు గుర్తించే వాడు. కానీ ఆ కంఠంతో పరిచయంలేదని నాతో అన్నాడు."

"గొంతు మారిస్తే గుర్తించలేడు. రావ్ కి బ్లాక్ మెయిలర్ ఎవరో తెలుసు—మాధవి బాయ్ ఫ్రెండ్."

"అయితే రావ్ అతని దగ్గరికెళ్ళాడా? వెళ్ళి ఏం చేశాడు, మేసన్ ది జూనియర్?"

"నేనెవరికీ జూనియర్ ని కాదు, బాస్. అభిమానిని. ఆదర్శంగా తీసుకొనేవాడిని. నీకు తెలుసు, రావ్ ఆ బాయ్ ఫ్రెండ్ ని పట్టుకొని వీపు బ్రద్దలు చేసి నెగటివ్స్ లాక్కొని ఉంటాడు. లేదా—"

"లేదా...?"

"ఇంటినుంచి బయలుదేరిన ఆవేశంలో ఆ బాయ్ ఫ్రెండ్ ని...వద్దు, ఆ శిశువుని దేవుడు రక్షించుగాక!"

"వెల్, అంతా నీ వూహాగానం. నువ్వు చెప్పిన క్లూ నిజంకాకకపోతే మళ్ళీ మరో థియరీ అల్లుకురావాలి..' ఇక నిద్రపోనిస్తావా? విష్యూ గుడ్ నైట్ అండ్ హారిబుల్ డ్రీమ్స్" అన్నాడు లాల్.

# 6

తెలతెలవారుతుండగా లాల్ బెడ్ ప్రక్కన ఫోన్ మ్రోగనారంభించింది. బద్ధకంగా కళ్ళు తెరిచి రిసీవ రెత్తాడు.

"ఇంకా తెల్లవారకుండా ఎవరది!" కసిరాడతను.

"లాల్," మాధవి కంఠం అర్చింది, "మీరు త్వరగా రావాలి."

లాల్ పూర్తిగా తేరుకున్నాడు. "ఎందుకు? ఏం జరిగింది?"

"ఓహ్...ఎలా చెప్పను! ఆయన—ఆయన—"

"చెప్పండి! ఆయనకేమయింది?"

"ప్రాణాలు తీసుకున్నారు!"

"ఎలా?"

"ఉరిపోసుకున్నారు! పెరట్లో.... వేపచెట్టుకి!"

"ఎప్పుడు?"

"తెలియదు! మీరు త్వరగా రండి! నేనిక్కడ—"

"వెంటనే వస్తున్నాం—" లాల్ రిసీవర్ పెట్టేసి బెడ్ మీంచి దూకాడు. జాన్ బెడ్ మీద కూర్చొని కలవరంగా చూస్తున్నాడు.

"ఏదైనా ఘోరం జరిగిందా, పార్టనర్?"

"దారుణం జరిగింది! రావ్ ప్రాణాలు తీసుకున్నాడు...." అని మాధవి మాటలు చెప్పాడు లాల్.

"ఇంపాసిబుల్!" అర్చాడు జాన్. "జగపతిరావ్! సూసైడ్! వీల్లేదు! ఆత్మహత్య చేసుకొనే కారణం ఏదీ లేదు! పరిస్థితి ఏమీ విషమించలేదు!"

"ఎలా తెలుసు? బ్లాక్ మెయిలర్ని డీల్ చేసి ఉంటే- వ్యవహారం బెడిసికొట్టిందేమో? పరిస్థితి అతని ప్రతిష్టకు

భంగకరంగా పరిణమించిందేమో?"

"ఓహ్, నువ్వింకా పాత థియరీ ఆలోచిస్తున్నావు. కొత్త థియరీలో క్లూ దొరికింది! బాయ్ ఫ్రెండ్ ప్రవేశించాడు! ఇప్పుడది ఆత్మహత్య అంటే అనుమానాస్పదంగా వుంది. నేను నమ్మను. ఎవరూ నమ్మించలేరు.... ఏదో కిటుకువుంది లాల్, ఎక్కడో ఏదో తట్టి తప్పిపోతోంది. లెట్ మీ సీ.... వెల్, వెల్! నీకేం తెలుసు! ఈ ట్రిక్ చూడు కాస్త—"

జాన్ తటాలున బెడ్ దూకి ఫోన్ అందుకున్నాడు.

చకచకా ఒక నెంబర్ తిప్పాడు.

"హలో.... ఎవరూ?" అంది అవతలి కంఠం.

జాన్ అకస్మాత్తుగా మెలికలు తిరగ సాగాడు. కంఠం మార్చి తాగినవాడిలా గజిబిజిగా మాట్లాడ సాగాడు.

"హల్లో! మధుసూ డాళింగ్.... నేను.... నేను.... ఏయ్, బేరర్! ఐ విల్ కిల్ యూ! దూరంగా వుండు! నన్ను డాళింగ్.... డాళింగ్ తో మాట్లాడనీయ్...."

"ఓహ్, సావన్! ఏం జరిగింది?"

"డాళింగ్.... నేనిక్కడ.... బార్ రలో...."

"ఏమైంది? బార్ లో ఏం చేస్తున్నావ్?"

"ఓహ్, డియర్! టాగేసాను బాగా.... పిత్తుగా టాగేసాను! ఆ పని షేసినప్పటినుంచీ మనషు పాడయింది.... అందుకే టాగేసాను—"

"ఓహ్, ఇంటికెళ్ళలేదా నువ్వు?"

"ఏమిటీ.... హింటికా?.... లేదు. ఇక్కడే.... బార్ లో యూ బేరర్! ఐషే.... ఐషే.... అవుట్ యూ గో!"

"సావన్! ఏం జరుగుతోందక్కడ?"

"డాళింగ్ ....షిట్టుగా టూగేస్తాను....మత్తుగా...."

"ఓహ్, బార్‌లో ఏం చేస్తున్నావ్? ఎందుకెళ్ళావ్? తిన్నగా ఇంటికెళ్ళమన్నానా?"

"ఇంటికి....దారెక్కడ డాళింగ్?"

"షటప్! ఆగ్లోవ్స్ నీదగ్గరే వున్నాయా?"

"గ్ వ్ ఫ్ .. ఆ అవునుఁ! ...ఉన్నాయ్."

"వాటిని పారేయ్. వెంటనే ఇంటికెళ్ళిపో!"

"కానీ దారి....దారి....డాళింగ్, దారి తెలియదు! అంతా మాయ! జగమే మాయ....అంతా మోషం. దగా! డబ్బు చేయించే పనులు—బేరర్! యూ లిటిల్ బాష్టర్డు! ఐ విల్ రియల్లీ కిళ్ యూ నా! స్కామ్—"

"సావన్! ఏమిటది?"

జాన్ వెంటనే గొంతు మార్చేసి ప్రాధేయపడుతూ అన్నాడు.

"మేం సాబ్, ఈయన బాగా డోస్ పుచ్చుకొని పడిపోయారు. కదలడం లేదు. రాత్రినుంచీ.... తెల్లారింది. ఇంటికి పంపుదామంటే దారి తెలియదంటున్నారు. మీరన్నా చెప్పండి, లేదా మీరే ఇక్కడికి రండి. ఏదో ఒకటి చెయ్యండి త్వరగా! ఈయనతో వేగలేక పోతున్నాం.—"

"ఓహ్, సావన్. ఎందుకిలా చేశావ్! సరే, బేరర్. ఆయన్ని ఆటో ఎక్కించి మెహదీ పట్నంలో...."

జాన్ వెంటనే ఆష్‌ట్రేలో వేలుముంచి సిగరెట్ నుసితో టీపాయ్‌మీద పొడుగ్గా వున్న ఇంటి నెంబర్ గీశాడు.

క్షణంలో ఆ నెంబర్‌ని మెదడుకెక్కించి, "అలాగే మేంసాబ్, థాంక్యూ!" అని రిసీవర్ పెట్టేశాడు.

లాల్ కళ్ళప్పగించి చూస్తున్నాడు.

"ఏమిటది, జాన్?"

"నువ్వెంటనే మాధవి దగ్గరికెళ్ళు! నేను త్వరగా వస్తాను. కారు తీసుకెళ్తున్నాను. నువ్వు టాక్సీలో వెళ్ళు!" అంటూ క్షణం కూడా ఆగకుండా పైజామా లోనే బయటికి పరిగెత్తాడు జాన్.

# 7

పావుగంటలో లాల్ రావ్ ఇంటిముందు టాక్సీదిగి లోనికి పరిగెత్తాడు. మాధవి హాల్లో ఎదురై పట్టుకుంది.

"నన్ను క్షమించండి, లాల్! ఇలా అవుతుందనుకోలేదు! మీతో చాలా దురుసుగా ప్రవర్తించి—"

లాల్ ఆమెని విడిపించుకొని, "ముందు అతన్ని చూడనివ్వండి!" అంటూ ముందుకు సాగిపోయాడు.

మరికొన్ని నిమిషాలలో తెల్లవారుతుంది. మసక వెలుగులో పెరట్లో నిశ్శబ్దంగా వుంది.. వాతావరణం చలిగా వుంది. పెరట్లో ఎడమవైపు గోడదగ్గర బావి, బాత్ రూం వగైరా వున్నాయి. కుడివైపు పెద్ద వేపచెట్టువుంది. దాని బలిష్టమైన శాఖలు కొన్ని గోడదాటి వీధిలోకి వ్యాపించాయి...లోపలివైపు ఒక కొయ్యకు ఒక మానవాకారం వ్రేలాడుతూ కన్పిస్తోంది.

జగపతిరావ్ నిర్జీవాకారాన్ని లాల్ దగ్గరగా, స్పష్టంగా చూశాడు. అతను లుంగీ బనియన్‌లో వున్నాడు. మెడకి బిగుతుగా ఉక్కు తీగతో ఉరి వుంది. దేహం నేలకి మూడడుగుల ఎత్తున వ్రేలాడుతోంది.

లాల్ అయిష్టంగానే శవం ముఖం చూశాడు.

అన్యమనస్కంగా, నిర్లిప్తంగా, కాళ్ళీడ్చుకుంటూ తిరిగి ఇంట్లోకెళ్ళాడు.

మాధవి వెక్కి వెక్కి ఏడుస్తోంది సోఫాలో. లాల్ ఆమె ఎదురుగా కూర్చొని సిగరెట్ వెల్గించి పోయిన చైతన్యం పుంజుకున్నాడు.

"వెల్, ఇది దారుణం. నేనిలాంటి పరిణామం ఆశించలేదు. మీ ఇద్దర్లో ఎవరూ మాతో సహకరించలేదు. మీకిప్పుడు గిల్టీ కాన్షస్ తప్ప ఏమీ మిగల్లేదు. చెప్పండి, అయన్నెప్పుడు చూశారు?"

ఆమె తేరుకొంటూ అంది. "ఇందాకే చూశాను— మామూలుగానే తెల్లవారకుండానే లేచానీవాళ. ప్రక్కన ఆయనలేరు. ఆయన బాగా పొద్దుపోయాక గానీ లేవరు, ఎప్పుడూ - బాత్ రూంకెళ్ళి వుంటారేమో ననుకొని పెరట్లోకెళ్ళాను. అప్పుడే చూశాను—"

"రాత్రి తిరిగివచ్చాక ఆయనెలా కన్పించారు?"

"చాలా అప్ సెట్ అయ్యారు. ఆందోళనగా కన్పించారు. నాతో ఏమీ చెప్పలేదు. మీ గురించి చెప్పాను. కానీ ఇప్పుడంతా మించిపోయిందనీ, ఎవరూ చేయగల్గిందేమీ లేదని అన్నారు."

"ఐసీ...ఆయన వచ్చినప్పుడు మీరేం చేస్తున్నారు?"

"అప్పుడే నిద్రకుపక్రమించాను."

"ఆయన వచ్చి భోజనం చేశారా?"

"లేదు...పన్నెండు కావస్తోంది. రావడంతోనే పైకెళ్ళి నిద్రపోయారు."

"ఆయన చెప్పు లెక్కడున్నాయి?"

"పైన బెడ్ రూంలో. ఎందుకు?"

"వాటిని చూడాలి."

"వాటికేమైంది?"

"మట్టి అంటింది."

"మీ కెలా తెలుసు?"

"చెప్పులకి మట్టిగాక బంగారం అంటుతుందనుకోను."

"కానీ ఇప్పుడెలా అంటిందని!"

"ఏమిటది?"

"మట్టి."

"చెప్తాను, పదండి."

"ముందు—ముందాయన్ని—" గొణిగిందామె.

"ఆయన్ని మనం ఏమీ చెయ్యలేం, పోలీసులొచ్చే వరకూ."

లాల్ లేచి మేడమెట్లెక్కసాగాడు. ఆమె ఆత్రంగా వెంబడించింది. లాల్ బెడ్‌రూంలోకెళ్ళి ఆగిపోయాడు. అతని దృష్టి నలుమూలలా పడింది. ఎక్కడా అసహజంగా, ప్రత్యేకంగా ఏమీ కన్పించలేదు. టేబిల్ దగ్గర రావ్ చెప్పుల్ని చూసి వాటిని అందుకున్నాడు. కాని అవి అతను ఆశించినట్టుగా లేవు. అక్కడ మరో జత లేదు.

"మీ రేదో మట్టి అన్నారు—" మాధవి గొణిగింది.

"ఈ చెప్పులకి లేదు" లాల్ అన్నాడు.

"ఆయనకున్నది ఇదొక్కటే జత."

"అయితే నేను పొరబడివుంటాను, ఫోన్ ఎక్కడ?" అన్నాడతను ఫోన్ వైపు కదుల్తూనే. మాధవి తటాలున ముందుకెళ్ళబోయింది. కానీ నిర్ణయం మార్చుకుంది.

లాల్ రిసీవరెత్తి చూస్తున్నాడు. ఎక్కడా మరకలు లేవు. మౌత్‌పీస్ శుభ్రంగా వుంది. తలెత్తి ఆమెని ఓరగా చూసి ఒక నెంబర్ డయల్ చేశాడు.

మౌత్‌పీస్ ముక్కుకానించి వాసన పీలుస్తూ, "ఎవరక్కడ?" అన్నాడు.

మాధవి కళ్ళప్పగించి చూస్తోంది.

"యస్! డిసీజ్ సార్జెంట్ నవీన్‌చంద్ర ప్లీజ్!" వచ్చింది సమాధానం.

"ఓహో....కలం ఉందా?"

"ఉంది,"

"అయితే వ్రాసుకో."

"చెప్పండి."

"సోమాజిగూడ నెహ్రూ కాలనీలో నూటనాల్గో నెంబర్ ఇల్లు. ముందు గేటు, లోన తోట, వెనుక పచ్చటి మేడ వుంటాయి...."

"ఏం జరిగిందక్కడ?"

"ఈ రెండింట్లో ఏదైనా కావచ్చు. సూసైడ్, మర్డర్. వెంటనే మీ స్క్వాడ్‌ని నిద్రలేపి పంపు!"

"హలో, హలో, ఎవరుమీరు?"

"లాల్!" చెప్పి ఫోన్ పెట్టేశాడు.

# 8

ఇన్స్‌పెక్టర్ బాలకృష్ణన్ కారు దిగి ఠీవిగా నడచి వచ్చాడు.

"హలో, ఫ్రెండ్! గుడ్‌మార్నింగ్ ఎర్లీ మార్నింగ్. రిసెప్షన్ కమిటీలో ఏదో లోపం కన్పిస్తోంది...."

"జాన్ మరో గెస్టుకోసం వెళ్ళాడు" లాల్ అన్నాడు.

"ఎవరా గెస్టు?"

"చాలా ఉపోద్ఘాతముంది, తర్వాత చెప్తాను."

"ఆల్‌రైట్. కమాన్ బాయ్స్, రన్ ఎలాంగ్."

నిపుణుల సిబ్బంది కారు దిగి ఇంట్లోకి పరిగెత్తారు.

లాల్ వెనక కృష్ణన్‌తో వెళ్ళాడు.

"డాక్టర్ ఏడి?"

"కబురు పంపాను, వచ్చేస్తాడు. ఈ చావుకి కారణ

మేమిటి?"

"బ్లాక్ మెయిల్."

"ఐసీ...." కృష్ణన్ అన్నాడు.

"యూ విల్ సీ ఏ లాటాఫ్ థింగ్స్, కమాన్" లాల్ వేగంగా పెరట్లోకి దారితీశాడు.

ఇప్పుడు పూర్తిగా తెల్లారింది. రావ్ మృతదేహం వ్రేలాడుతూ స్పష్టంగా కన్పిస్తోంది. ఇద్దరు ఫోటో గ్రాఫర్లు స్నాప్స్ తీశారు. లాల్ ఇప్పుడు శవాన్ని పరీక్షగా చూస్తున్నాడు. కళ్ళు, నోరు మూసివున్నాయి. ముఖం ప్రకాశవంతంగా వుంది ...చావు అతన్ని బాధించినట్లులేదు. అతని మెడచుట్టూ సన్నటి ఉక్కుతీగ రెండు చుట్లు తిరిగివుంది. మిగిలిన మూడడుగుల రెండవ వివర అతని కుడిచేతికి చుట్టివుంది. చెయ్యి అరపిడికిలి బిగుసుకొని వుంది. ఎడమ చేతివేళ్ళు నిక్కబొడుచుకొని, కొయ్యబారి వున్నాయి.

నేలమీద, అతని కాళ్ళదగ్గర ఒక చిన్న స్టూలు అడ్డంపడి వుంది. లాల్ దాన్ని కర్చీఫ్‌తో ఎత్తి కాళ్ళ క్రింద పెట్టాడు. పాదాలు దానిమీద అనలేదు. నాలుగంగుళాలు పైకి వున్నాయి. కృష్ణన్ ఆశ్చర్యంగా చూశాడు. లాల్ ఓ క్షణం సాలోచనగా నిలబడి స్టూలు మీద వేలి ముద్రలు, పాదముద్రలకోసం పరిశీలించమన్నాడు.

ఆ తర్వాత వంగి శవం అరికాళ్ళను పరీక్షించాడు. అతని ముఖకవళికలు మారాయి.

అక్కడినుంచి వేగంగా కదిలి బావిదగ్గరికెళ్ళాడు. అక్కడ నేలలో అడుగుజాడలు అలాగే వున్నాయి. లాల్ చేతిలో వున్న రావ్ చెప్పుతో ఆ అడుగుజాడల్ని

పోల్చి చూశాడు. అవి రావ్ అడుగుజాడలు కావు. అతనికంటే పొడవైన పాదాలవి. బూట్స్ జాడలు.

వెంటనే తలుపుతీసి వెనుక వీధిలోకెళ్ళాడు. వీధిలో సరిగ్గా తలుపుకెదురుగా, పేడముద్దలోంచి వెళ్తున్న టైరు గుర్తులు కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి-సిమెంట్ రోడ్డు మీద ఆరిపోయి. అతనక్కడ నిలబడి చుట్టూ చూడసాగాడు చురుగ్గా.

"ఏమిటి చూస్తున్నారు?" కృష్ణన్ అన్నాడు వెనుక నుంచి.

"సిగరెట్ బట్స్. డిటెక్షన్‌లో సిగరెట్ పీకలకి చాలా ప్రాధాన్యత వుంది. అలవాటుచొప్పున కాల్చేవారు సమయం, సందర్భం, స్థలం మొదలైనవి విచక్షణా జ్ఞానం లేకుండా కొన్ని పొరపాట్లు చేస్తుంటారు....అదుగో పీక!"

లాల్ మెరుపులా వెళ్ళి రోడ్డువారగా పడివున్న సిగరెట్ పీకను చూశాడు. దాన్ని కర్చీఫ్‌తో అందుకొని, "వెల్, వెల్, ఇది రావ్ బ్రాండ్ కాదు" అన్నాడు.

"ఇది రావ్ ప్రాపర్టీ కాదు. పబ్లిక్ వీధి. ఎవరైనా పారేసి వుండవచ్చు."

"ఎవరు పారేశారో నాకు తెలుసు. ఇదే బ్రాండ్ రాత్రి ఒకరి దగ్గర చూశాను. మీరు బావిదగ్గర అడుగు జాడలు చూశారా?"

"చూశాను. పోతపోసినట్లున్నాయి."

"ఫోటోలు తీయండి. ఈ టైర్ ప్రింట్స్ కూడా తియ్యండి. అలాగే రావ్ కారుమీద వేలిముద్రలు చూడండి. ముఖ్యంగా డోర్ హేండిల్, స్టీరింగ్, గేర్ లివర్ మీద."

"....అయితే ఇది హత్య అన్నమాట!" అన్నాడు కృష్ణన్.

"ఇన్స్పెక్టర్ ఎక్కడ?" లోపలినుంచి డాక్టర్ అరుపు వినిపించింది.

లోపల డాక్టర్ రఘునాథ్ శవాన్ని చూస్తూ నిల బడ్డాడు. వెనుక ఇద్దరు మార్గ్ అటెండెంట్లు స్ట్రెచర్ తో నిలబడివున్నారు.

లాల్ డాక్టర్ని విష్ చేశాడు.

డాక్టర్ శవంచుట్టూ ఓ ప్రదక్షిణం చేసి ఆగాడు. అతని ఎక్స్ రే కళ్ళు గ్రహించవల్సిన అంశాల్ని అన్వే షిస్తున్నాయి. అతని ముఖంలో ఆశ్చర్యం వ్యక్తమవ సాగింది. చివరికి కృష్ణన్ వైపు తిరిగి అన్నాడు.

"గుడ్ గాడ్, ఇన్స్పెక్టర్, ఇదేం కేసనుకున్నారు?"

"ఏం కేసు?"

"పోస్టుమార్టమ్ హేంగింగ్!"

కృష్ణన్ లాల్ ని చూశాడు. లాల్, డాక్టర్ వేపు చూశాడు.

డాక్టర్ అన్నాడు మళ్ళీ. "అతను ఉరిపోసుకోలేదు. ఇది ఆత్మ హత్యకాదు. ఉరిపోసుకొన్న చిహ్నాలెక్కడా లేవు. చెట్టుకొమ్మకు తీగముడి చూశారా? ముడి పై భాగంలోవుంది. అతను ఉరిపోసుకునుంటే అది క్రిందికి వుండాలి—ముడి సాధారణంగా క్రిందివైపుకే వేస్తారు. ఒకవేళ పైకే వేసారనుకోండి, అప్పుడు దేహం బరువుకి, అదిచ్చే జర్క్ వల్లా ముడి తప్పకుండా క్రిందివైపుకు తిరుగుతుంది. అదే శవాన్ని వ్రేలాడదీస్తే తీగ పైకిలాగి ముడతాము గనుక ముడి పైన వుండిపోతుంది—స్థిరంగా. అప్పుడు జర్క్ కు అవకాశం వుండదు."

"అవును, ఇక్కడ ముడి పైకే వుంది" అన్నాడు లాల్.

"మరోవిషయం. క్రింద ఆధారం చూడండి. స్టూలు పాదాల కానడంలేదు. నాలుగంగుళాలు పైకివున్నాయి. వురి పోసుకుంటే దేహం కుంచించుకుపోదు-పైగా దాని బరువుకి మెడసాగవచ్చు. తీగ, లేక తాడుకూడా సాగే అవకాశముంది. అంతేగాక పైన ఆధారం—ఇక్కడ చెట్టుకొమ్మ-క్రిందికివంగే అవకాశం వుంది. కాబట్టి నిలబడ్డ ఆధారంకంటే కాళ్ళు కొన్ని సందర్భాల్లో ఇంకా క్రిందికి వ్రేలాడుతుండే వీలుంది. కాని ఇక్కడ అందుకు వ్యతిరేకంగా కన్పిస్తోంది...."

డాక్టర్ ఇంకా అన్నాడు. "వురి పోసుకుంటే నాలిక బయటికొచ్చి వుండాలి. ఏదీ?కళ్ళు పెల్లుబికిరావాలి. అదీ లేదు. ముక్కునుంచీ, చెవులనుంచీ రక్తం స్రవించాలి ... ఇవీలేవు. అతి సామాన్యంగా కన్పించే చిహ్నాలేవీలేవు. కాబట్టి ఇతను ఉరిపోసుకోలేదు— మరణించాక వ్రేలాడ దీయబడ్డాడు.... పోస్టుమార్టమ్ హేంగింగ్."

"ఎలా మరణించాడు?" కృష్ణన్ అడిగాడు.

డాక్టర్ లాల్ వైపు తిరిగాడు, "డిటెక్టివ్ ఫ్రెండ్, కేసు ఎలాటిది?"

"ఎమర్జెన్సీ కేసు....ఇంతకు చాలాపూర్వంనుంచి మేం దర్యాప్తు చేస్తున్నాం—అంటే ఈ చావుకు ముందునుంచీ. చాలా ఆధారాలూ, సందేహాలూ ఉత్పన్నమయ్యాయి. మీరిపుడు కొంచెం శ్రమతీసుకుని మరణం ఎప్పుడు ఎలా సంభవించిందో ఇక్కడే తెలియజేస్తే, కేసుకూడా ఇప్పుడే తేలిపోవచ్చు."

"ఆల్ రైట్, శవాన్ని దించండి! ఇక్కడే నమూనా

పోస్టుమార్టమ్ ప్రారంభిద్దాం, లాల్ కోరికమీద."

"థాంక్యూ వెరీమచ్."

శవాన్ని దించుతున్నప్పుడు డాక్టర్ అన్నాడు. "చూడండి ఈ దృశ్యాన్ని సృష్టించిన వ్యక్తుల ఉద్దేశం హతుడు స్టూలుమీద నిలబడి, కొమ్మకు కట్టిన తీగను మెడచుట్టూ బిగించుకొని, దాని రెండో చివర చేతికిచుట్టు కొని బలంగా లాగుతూ క్రింద ఆధారాన్ని తన్నేసినట్లు కన్పించాలని."

"అవును. అయితే మీరు 'వ్యక్తులు' అనడంలో ఉద్దేశం ఏమిటి?" కృష్ణన్ అడిగాడు కుతూహలంగా.

"శవాన్ని వ్రేలాడదీయడం ఒక్కరివల్ల కాదుగనుక."

"అయితే ఎందరు కావచ్చు?"

"ఇద్దరు కావచ్చు," లాల్ అన్నాడు.

వరండాలో దుప్పటి పరచి దానిమీద శవాన్ని చేర్చారు.

డాక్టర్ మోకాళ్ళమీద కూర్చొని పరీక్ష ప్రారంభించాడు.

లాల్ శవం అరికాళ్ళను తదేకంగా చూడసాగాడు. అది పసిగట్టి కృష్ణన్, "లివిడిటీ అరికాళ్ళలో లేదు!" అన్నాడు.

డాక్టర్ కళ్ళెత్తి ఓరగాచూశాడు. కృష్ణన్ గర్వంగా నవ్వాడు.

డాక్టర్ అన్నాడు, "అవును. లివిడిటీ అరికాళ్ళలో లేదు. చేతి వేళ్ళలోను, నడుములోనూ లేదు. ఉరిపోసు కుని వ్రేలాడుతున్నపుడు గురుత్వాకర్షణకి దేహంలోని రక్తమంతా క్రింది వైపుకి లాగివేయబడి, దేహం పాలి పోయినట్టు కన్పిస్తుంది. అలా క్రిందికి దిగిన రక్తమంతా

అరికాళ్ళలోచేరి అక్కడ గడ్డకడుతుంది. అప్పుడు చర్మం నుంచి ఆ మచ్చలు స్పష్టంగా కన్పిస్తాయి.... చేతుల మునివేళ్ళలోనూ,నడుములోను కూడా అస్పష్టంగా కన్పిస్తుంది ఈ లివిడిటీ.

"కానీ ఈ కేసులో అలాలేదు. పోస్టుమార్టమ్ లివిడిటీ శవం పృష్టభాగంలో డెవలప్ అయింది—భుజాల మీదా, వీపుమీద. కాబట్టి దీన్నిబట్టి చావు సంభవించాక శవం చాలాసేపు— అంటే దేహంలోని రక్తమంతా ఘనీభవించడానికి పట్టేకాలం సుమారు నాలుగుగంటల సేపు వెల్లికిలా పడివుందన్నమాట. ఆ తర్వాత వ్రేలాడదీయబడింది.

"అలా శవస్థితి మారినప్పుడు దాని కనుగుణంగా—ఒకవేళ ద్రవరూపంలో రక్తం ఇంకా మిగిలివుంటే—లివిడిటీకూడా ఆయాభాగాలకి మారవచ్చు. కానీ మౌలిక ప్రాంతాల్లో దాని తాలుకు చిహ్నాలు అస్పష్టంగానైనా వుంటాయి. ఈ శవం మౌలికస్థితిలో ఉన్నప్పటి మచ్చలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. రక్తం పూర్తిగా గడ్డకట్టడం వల్ల మారిన శవస్థితి కనుగుణంగా లివిడిటీ మారలేదు."

"అయితే మరణం ఎప్పుడు సంభవించింది?" కృష్ణన్ అడిగాడు.

"రఫ్ అయిడియా—రాత్రి ఎనిమిదీ పది మధ్య."

"ఏమిటీ....ఎనిమిదీ పది మధ్యా?"లాల్ ఆశ్చర్యంగా అన్నాడు.

"అవును,"

"కాదు! అప్పుడతను మరణించే అవకాశంలేదు! మీరు పొరబడుతున్నారు,"

డాక్టర్ పెద్దగా నవ్వాడు. "ఇన్నేళ్ళ సర్వీసులో

కూడా పొరపాట్లూ!"

"మీరు నమ్మకంగా చెప్తున్నారా?"

"లేదు, మీరు మర్చిపోతున్నారు. ఇది నమూనా పోస్టుమార్టమ్. అందువల్ల ఇది రఫ్అయిడియా. రిగర్ మార్టిస్ దేహమంతటా వ్యాపించింది.... వాతావరణంలో తేమ ఎక్కువ వుంది. మంచు కురిసింది. కనీసం ఎనిమిది గంటలు వెనక్కి కొలవండి. రాత్రి పది గంటలవుతుంది. మరి కాస్త సడలించాలనుకొంటే మరో రెండు గంటలు కలపండి. అంతే, అది లిమిట్. మామూలు గృహస్థ వాతావరణంలో, అంటే ఇన్ డోర్ లో రిగర్ మార్టిస్ పూర్తిగా ఆక్రమించుకోడానికి పన్నెండు గంటలవ్యవధి పడుతుంది."

"అయితే చావు ఎలా సంభవించింది?"

"స్పృహ పోగొట్టి వ్రేలాడదీయలేదని మీకు తెలుసు. అప్పుడు లివిడిటీ అరికాళ్ళలో కన్పించేది. పోతే తీగతో గొంతు నలిపి చంపలేదు. అలా వూపిరందక చనిపోయినప్పుడు— ఉరిపోసుకున్నప్పుడుకూడా—లివిడిటీ ఎరుపు కలిసిన ఊదారంగులో ఏర్పడుతుంది. సైనేడ్ వంటి విష ప్రయోగంలో గాఢమైన ఎరుపు రంగులోనూ, చలి, లేదా ఫ్రిజ్ వాతావరణానికి గురైనప్పుడు ఊరక్తవర్ణం నారింజ రంగులోనూ వుంటాయి.

"కానీ ఇక్కడ అలాంటి నిదర్శనాలులేవు. నావూహ చావు మెదడులో బ్లీడింగ్ వల్ల సంభవించిందని."

"ఎలా?"

"ఇక్కడ చూడండి తలమీద—మూడుచోట్ల బొప్పి కట్టింది. దేనితోనో కొట్టివుండాలి. మెదడులో రక్తనాళికలు చిట్లి హెమరేజివల్ల ప్రాణంపోయింది."

"ఐసీ, డాక్టర్..."

డాక్టర్ మళ్ళీ అన్నాడు, "ఇప్పుడు ఈ తీగను చూడండి. చాలా గరుకుగా వుంది. ఇతను గనుక ఈ తీగను మెడికి చుట్టుకొని, రెండో చివరను చేతికి చుట్టుకొని లాగివుంటే అరచెయ్యి గాయపడేది. కాని చెయ్యి ఎక్కడా గీరుకుపోలేదు. చర్మం కూడా ఎక్కడా చిట్లలేదు. అసలు ఇలాంటి తీగతో ఇంతటి బాధాకరమైన చావు నెవరు కోరుకుంటారు? ఈ తీగతో శవాన్ని వ్రేలాడదీసిన వ్యక్తి ఎవరో చేతులకి కవచం తొడుక్కొని వుండాలి."

"గ్లోవ్స్," అప్రయత్నంగా అన్నాడు లాల్.

"ఆ గ్లోవ్స్ తప్పక చిరిగివుండాలి, తీగ రాపిడికి." కృష్ణన్ అన్నాడు.

డాక్టర్ తలూపాడు. "ఇంతకంటే నేను చెప్పవల్సిందేమీ లేదు ప్రస్తుతం. ఏమైనా సందేహాలున్నాయా, మిస్టర్ లాల్?"

"నో, డాక్టర్. థాంక్యూ."

"ఆల్ రైట్, ఈ ఎడమ చేతిను ఒకసారి చూడండి. బొటనవ్రేలికేమిటిది?"

లాల్ వేలుపట్టి చూశాడు "ఎర్రటి మరక—"

"రక్తం కాదుగదా?" కృష్ణన్ ముందుకువంగి వాసన చూశాడు, "ఈ వాసన—ఇది లిప్‌స్టిక్ రంగు!" అరిచాడతను.

లాల్ ఒక్క క్షణం కొయ్యబారిపోయాడు. తేరుకొని "వెరీ వెల్, ఆ క్లూ ఇలా స్థానం మారిందన్నమాట!" అన్నాడు మెరుస్తున్న కళ్ళతో.

"ఇది ఏం క్లూ మిస్టర్ లాల్?"

"నా పార్ట్‌నర్ చెప్పిన క్లూ! థాంక్యూ వెరీమచ్, డాక్టర్! మీరు చాలా సహాయపడ్డారు."

లాల్ లేచి వేగంగా ఇంట్లోకి దారితీశాడు.

# 9

బెడ్‌రూంలో మాధవి ఉలికిపడి చూసి, "ఏంజరిగింది లాల్!" అంది.

లాల్ లోనికెళ్లి ఆమె ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు. సిగరెట్ వెల్గించి ఆమెనోసారి చూశాడు.

"మిమ్మల్ని చూసి నాకూ చాలా ఆశ్చర్యమేసింది," అన్నాడు నెమ్మదిగా, "జగపతిరావ్ భార్య అంటే ఎంతో హుందాగా, పెద్దరికం ఉట్టిపడుతూ, నా తల్లి వయసులో ఉంటుందనుకున్నాను....మీరాయన రెండవ భార్యా"?

ఆమె అయోమయంగా తలూపింది.

"వెల్, ఆయన మళ్లీ పెళ్ళిచేసుకున్నారని నాకు తెలియదు. సరే, జరిగిందానికంతటికీ మీరే బాధ్యులు. నేను పూర్తిగా నమ్ముతున్నాను. మొదట మీరు భర్తకు ద్రోహంచేశారు. దానికి సప్లిమెంట్‌గా ఇప్పుడు ప్రాణాలు తీశారు ... మీ చేతులిపుడు మంచివికావు. అవి పాప పంకితమయ్యాయి ఆయన ప్రాణాలుతీసి."

"ఆయన ప్రాణాలు నేను తీశానా!"

"మీరే తీశారు."

"ఎలా అంటున్నారు?"

"నా అంతరాత్మ అంటోంది."

"యూ బ్లడీ——"

లాల్ నవ్వాడు "తెలుగులో తిట్టండి, మంచి ఎఫెక్ట్

వుంటుంది. మీ బాయ్ ఫ్రెండ్ కూడా తాగి తెలుగులోనే తిట్టాడు."

"ఎవరూ?"

"మీ బాయ్‌ఫ్రెండ్. బార్లో తాగి బాగా గొడవ చేశాడు."

"మీ కెలా తెలుసు?"

"అప్పుడు మేం అక్కడే వున్నాం."

"కానీ నేను మీ ఇంటికి ఫోన్ చేశానుకదా?"

"అవును, చేశారు. బార్ కూడా మా ఇంట్లోనే వుంది."

"అంటే సావన్ మీ ఇంట్లో—మీ ఇంటినుంచి—"

లాల్ మళ్ళీ నవ్వాడు. "వెల్, సావనా అతని పేరు? గుడ్, నా పార్ట్‌నర్ జాన్ మీ సావన్‌లా మాట్లాడాడు. ఏదో వాసన పసిగట్టి వుంటాడు, అర్జంటుగా నిషా తెచ్చుకొని సావన్ అవతారమెత్తాడు. మీరతని వల్లో పడ్డారు! మీ మాటల్లో ఏదో గ్లోవ్స్ ప్రసక్తి వచ్చినట్టు కూడా విన్నాను .... బహుశ వాటికోసమే వెళ్ళి వుంటాడు."

"సావన్ ఇంటికా?"

"అడ్రసు మీరే చెప్పివుండాలి"

"యూ రోగ్స్! రాస్కేల్స్! ఎంత మోసం చేశారు?"

"వెల్, ఇక ఆపండి. ఈ తిట్లూ, పొగడ్తలు అన్నీ మా కలవాటే. పట్టించుకోం—మీరు చాలా తెలివిగల వారు, మాధవి. మీ రిద్దరూ కలిసి మమ్మల్ని బాగా ఆడించారు, బఫ్లాన్స్ చేసి. ఇప్పుడు మీకు రక్షణలేదు. ఏ విధంగానూ రక్షించుకోలేరు. కాస్సేపట్లో జాన్ మీ బాయ్ ఫ్రెండ్‌తో—"

అప్పుడే కృష్ణన్ లోనికొచ్చాడు.

"వెల్, ఇన్స్పెక్టర్ వచ్చేశారు. మీరిద్దరూ ఇక ఆయనతో స్టేషన్ కెళ్ళిపోండి!" అనేసి ఊరుకున్నాడు లాల్.

కృష్ణన్ మాధవిని పరీక్షగా చూశాడు. "మీరిక్కడే స్టేట్ మెంట్ ఇస్తారా?"

"ఓహ్, ఏమిటీ న్యూసెన్స్! ఏమిటి వాగుతున్నారు? మీరు నామీద ఏమీ బనాయించలేరు! ఏదీ నిరూపించలేరు!" అంది మాధవి ఆవేశంగా.

"పొరబడకండి! మీ మీద అన్నీ నిరూపించగలం. ఏమంటారు, లాల్?"

లాల్ తలూపాడు అనాసక్తిగా.

"ఏం నిరూపిస్తారు? ఎలా నిరూపిస్తారు?" అర్చిం దామె.

"ఆల్ రైట్. అయితే వినండి, మాధవిగారూ!.... రాత్రి మీవారితో నా ఫోన్ సంభాషణ ఎక్స్టెన్షన్లో విని, లేదని బుకాయించినప్పుడే మీమీద అనుమానం కల్గింది. అప్పటివరకు మీమీద దృష్టిపోలేదు. అప్పుడే సస్పెక్ట్ లిస్టులో మీరు కూడా చేరిపోయారు.

"ఈమధ్య మీరు మీ వారిని కనిపెడ్తున్నారు. జాగ్రత్తగా మసలుకొంటున్నారు. కాని ఒక చిన్న పొరపాటు చేశారు. తీవ్రమైన పొరపాటు. అదే ఆయన ప్రాణం తీయడానికి మిమ్మల్ని పురిగొల్పింది. అంతా అనూహ్యంగా క్షణాల్లో జరిగిపోయింది పిడుగుపాటులా. మీమధ్య ఘర్షణ రగిలి, ఆ క్షణికావేశంలో మీరాయన తలమీద దేనితోనో కొట్టి—కొట్టి—కొట్టి—చంపేశారు."

మాధవి ఊపిరి బిగబట్టింది.

లాల్ తల విదిలించాడు, "అప్పుడే ముగింపు చెప్పేశానా! వెల్, అది సరైన ముగింపుకాదు. ఇప్పుడు వినండి. మీకో బాయ్ ఫ్రెండ్ వున్నాడు. అతన్ని ప్రేమిస్తున్నారు. మీరతని అడ్రసు చెప్తున్నప్పుడు జాన్ ఇంటి నెంబర్ టీపాయ్‌మీద గీశాడు. ఆ వార్డ్ నెంబర్ మెహదీ పట్నంలో ఒక వీధి. మెహదీ పట్నం నాకు బాగా తెలుసు. ఆ వీధిలో అంతా మధ్యతరగతి కుటుంబాలూ, వర్కింగ్ క్లాస్ వాళ్ళూ నివశిస్తున్నారు. కాబట్టి మీ బాయ్ ఫ్రెండ్ కూడా ఆ తరగతులకి చెందినవాడై వుండాలి. మీరు లక్షాధిపతి పత్ని. అతను సామాన్యుడు. మీ మధ్య ఈ అంతరాలున్నాయి. కానీ మీ ప్రేమముందు అవి నిలబడలేవు. మీ ప్రేమ అంత గొప్పది.

"అతని కోసం మీ భర్తకు ద్రోహంచేశారు. చివరికి ప్రాణాలు తీశారు. మీకు భర్తా, అతని ఆస్తి ముఖ్యమనిపించలేదు. మీ ఫ్రెండ్ సాన్నిధ్యం కావాలి. జీవితం అతనితో సాగాలి....కాబట్టి అతనితో ఎక్కడికైనా వెళ్ళిపోవాలి, లేదా అధికంగా అతన్ని పైకి తేవాలి. ఏది చెయ్యాలన్నా డబ్బు అవసరం. అందువల్ల ఈ ఉపాయం ఆలోచించారు. మీ భర్తని బ్లాక్ మెయిల్ చేశారు. ఈ బ్లాక్ మెయిల్‌కు నే చెప్పిన మోటివ్ సరైనది కాకపోవచ్చు. అది నా వూహ. ఇక్కడ నిరూపించవల్సింది మీమీద హత్యను."

మాధవి రెప్పవేయకుండా చూస్తోంది. మాట్లాడలేదు.

లాల్ అన్నాడు. "డబ్బుకోసం మీవాణ్ని మీ ఫ్రెండ్‌తో బ్లాక్ మెయిల్ చేశారు. మీవారి బలహీనతలు మీకు తెలుసు. వాటిని ఎక్స్‌ప్లాయిట్ చేశారు. వారం

క్రితం మీరు ఊరికెళ్ళి మూడు రోజుల తర్వాత వచ్చారు. అది మీ పథకంలో భాగం. మీరు వెళ్ళిన రోజు రాత్రి మీ వారు మాధురి అనే డాన్సర్‌తో ఇంటికొచ్చారు. అలా వస్తారని మీకు తెలుసు. అందువల్ల వెళ్ళేముందు మీరు ఆయన విస్కీలోను, జిన్‌లోనూ మత్తుపదార్థం ఏదో కలిపి వెళ్ళారు. వాళ్ళు దాన్ని తాగేసి నిద్ర పోయాక, సావన్ కెమెరాతో వచ్చి కావల్సిన భంగిమల్లో స్నాప్స్ తీసుకొన్నాడు."

కృష్ణన్ కుతూహలంగా వింటున్నాడు.

"స్నాప్స్ తీసుకొని, మందుకలిపిన సీసాల్లోని విస్కీ, జిన్‌లను పారబోసి, వెంటతీసుకువచ్చిన స్వచ్ఛమైన అవే బ్రాండ్ డ్రింక్స్‌ని ఆ సీసాల్లో అదే మేరకు నింపి, యథాస్థానాల్లో పెట్టేశాడు.

"ఈ వ్యవహారానికి సంబంధించి మీరూ, మీ ఫ్రెండ్ వేలిముద్రలు పడకుండా గ్లోవ్స్ ఉపయోగించారు.

"ఆ తర్వాత నాలుగు రోజులకి ఫోటోలందాయి. అయిదు లక్షలకి డిమాండ్ చేశారు. ఈ రోజు రాత్రి వరకు గడువిచ్చారు. నిన్న ఉదయం ఆయన నన్ను కలిశారు. ఈ పని ఎవరో ప్రొఫెషనల్ చేసి వుంటాడను కున్నాంగానీ, స్వంత మనిషి అనుకోలేదు. డిటెక్షన్ ప్రారంభించాం. కాని ఎటువంటి క్లూ దొరకలేదు. నిన్న సాయంత్రం జాన్ ఇక్కడికొచ్చి ఫ్రిజ్‌లో సీసాలన్నిటి మీదా వేలిముద్రలు సేకరించాడు. వాటిలో మీ భర్తవి తప్ప మరెవరివీలేవు. మాధురిని అనుమానించాం. కాని ఆమె నిర్దోషిగా తేలింది....

"చాలా నిరాశ చెందాం. అప్పుడే మీరు రంగంలో ప్రవేశించారు—వెతకబోయిన తీగ కాలికి తగిలినట్టు మీరు

వెలుగులోకి వచ్చారు. ఎక్స్టెన్షన్‌లో మా మాటలు వినే తెలివితక్కువ పనిచేసి—అంటే వినకూడదనికాదు. ఆయన కదలికల్ని కనిపెడుతుండాలి కాబట్టి విని తీరాలి. అయితే వినేపద్ధతి మీకు తెలియదు. లేక కంగారులో మీరు పట్టించుకోలేదు. లైను పూర్తిగా డెడ్ అయ్యేవరకు ఆగవల్సింది—కాని మీరు మధ్యలో ఫోను పెట్టేసి నన్ను ఎలర్టు చేశారు. దొరికిపోయారు.

"మీ భర్త మాటలు విని, ఆయన ఫోన్ మీద ఏం చూశారన్న కంగారుతో ఆయన గదిలో కురికారు. అక్కడాయన ఫోన్ మీద లిప్‌స్టిక్ ముద్ర చూశారు. ఏమంటారు? సాయంత్రం ఆయన ఆఫీసునుంచి త్వరగా వచ్చేస్తున్నట్లూ, ఫలానా చోటుకి కలిసి వెళ్ళాలనీ ఫోన్ చేశారనుకుంటాను. అవునా? అప్పుడు ఈ విషయం వెంటనే మీరు సావన్‌కు తెలియజేశారు. అప్పుడతనితో మాటల్లో వీడ్కోలు చెబుతూ ముద్దు అందించి వుంటారు- మీ లిప్‌స్టిక్ మౌత్ పీస్ మీద పడింది."

మాధవి కళ్ళు విశాలమై, నిశ్చలంగా వుండిపోయాయి.

"కానీ మీరది గమనించలేదు. రాత్రి మీరొచ్చాక నాకు ఫోన్ చేసినప్పుడు అది ఆయన కంటపడింది. కానీ దానిగురించి చెప్పకుండా గాభరాగా లైను కట్ చేసేశారు. అప్పుడే మీరు గదిలోకొచ్చారు. మిమ్మల్ని చూసి ఆయన ఉగ్రుడయ్యారు. మిమ్మల్ని అనుమానిస్తుండవచ్చు. సావన్ గురించి తెలిసివుండవచ్చు—ఫోన్ మీద ఆ మరక బొటనవ్రేలితో తుడిచి అదేమిటని మీకు చూపించారు. మీరు బెదిరిపోయారు. ఏమీ చెప్పలేకపోయారు.

"అప్పుడాయన ఇంకా రెచ్చిపోయారు. మీరు ముద్దును ఆయన కందించిందని బుకాయించలేరు. మరి

ఎవరిచ్చారు? ఆడస్నేహితుల కనడం ఎబ్బెట్టుగా వుంటుంది. సావన్‌తో మీ వ్యవహారం ఇప్పుడు రుజువవుతోందని ఆయన అన్నారు. మీరు వ్యతిరేకించారు. వాదించారు. గొడవ పెరిగింది. ఇద్దరూ పెనుగులాడారు. ఆయన మిమ్మల్ని కొట్టారు. మీరు తిరగబడ్డారు. అప్పుడు ఆవేశంతో దేనితోనో ఆయన తలమీద ఆగకుండా బాదసాగారు. ఆయిన కుప్పకూలిపోయారు.... అంతే మరిక లేవలేదు. మీరు భయపడి చేతిలో వస్తువు విసిరికొట్టారు. ఆయన చనిపోయారు. వెల్, మీరు దేనితో కొట్టారు?" అని ఆగాడు లాల్.

ఆమె ముఖం మాడిపోయింది. మాట్లాడలేకపోయింది.

లాల్ చుట్టూ చూశాడు. సిగరెట్ నలిపేసి లేచి తిరిగాడు. గదిని తీక్ష్ణంగా చూస్తూ బెడ్ క్రింద వంగి చూశాడు. వెంటనే అక్కడ కూర్చుండిపోయాడు.

"వెల్, వెల్, వెల్! అదేమిటి? అదే ఆయన ప్రాణాలుతీసింది!" అంటూ కర్చీఫ్‌తో దాన్నందుకొని కృష్ణన్‌కు చూపాడు.

"పేపర్ వెయిట్!" అన్నాడు కృష్ణన్.

"దట్స్ రైట్. దీనితోనే కొట్టివుండాలి." అంటూ దాన్ని కిటికీ దగ్గర పరీక్షగా చూశాడు లాల్, "వెల్, నూనెమరకలు కన్పిస్తున్నాయి.... పేపర్ వెయిట్‌ని ఇలా నిర్లక్ష్యంగా ఎవరూ పారేసుకోరు. నూనెమరకలు దుమ్మూ ధూళీ కాయితాల్ని పాడుచేస్తాయి. కృష్ణన్, దీనిమీద రావ్ తలనూనె, మాధవి వేలిముద్రలు లభిస్తాయి, ఉంచుకోండి."

కృష్ణన్ అందుకున్నాడు. మాధవి ఇంకా అలాగే వుంది.

"ఓ.కే!" లాల్ అన్నాడు మళ్ళీ, "జరిగింది గ్రహించి మీరు తారె త్తిపోయారు, మాధవి. వెంటనే సావన్‌కు ఫోన్ చేసి రమ్మన్నారు. ఈ మధ్య రెండుసార్లు ఫోన్ మ్రోగింది. ముందు నేను చేశాను. కానీ ఇక్కడ ఘర్షణ జరుగుతుండడంవల్ల రెస్పాన్స్ ఇవ్వలేదు. తర్వాత జాన్ చేసినపుడు ఇక్కడంతా అయిపోయింది....అప్పుడు మీ వారు బయటికెళ్ళిపోయారని మీరన్నారు. మేం ఎక్కడ వస్తామోనన్న భయంతో మీవారు ఇంట్లోలేరని సూచించడానికి వెంటనే కారెక్కి ఇంటివెనుక డ్రైవ్ చేసి అక్కడ ఆపారు. పెరటిదారిగుండా లోనికొచ్చారు. ఈలోపు సావన్ కూడా వచ్చేశాడు. మీరిద్దరూ ఈ గదిలో మా కోసం కాచుకున్నారు; శవం మంచంక్రింద తోశారు.

"అప్పుడు నేనొచ్చాను," లాల్ ఇంకా కొనసాగిస్తూ అన్నాడు, "నన్ను క్రింద హాల్లోనే ఆపడానికి మీరు శాయశక్తులా ప్రయత్నించి సఫలమయ్యారు. ఈ గదిలో కొచ్చి ఫోన్‌ని చూడనివ్వలేదు. మీ ప్రవర్తన, వేషం, వాలకం నా కనుమానం కల్గించాయని మీరు గమనించారు. నేను వెళ్ళిపోయాక, రహస్యంగా వస్తానని అనుమానించారు.

"అందువల్ల మాధవిగారూ, 'ఈ గదిలో ఏముందన్న నా క్యూరియాసిటీని తీర్చడానికి' మీరు చక్కని సన్నివేశం సృష్టించారు. సావన్ ఈ గదిలోంచి వెళ్ళిపోయాడు. అతను తాగిన సిగరెట్లు ఆష్ట్రేలో వున్నాయి. టీపాయ్‌మీద విస్కీ గ్లాసులున్నాయి. గ్రాంఫోన్ సన్నగా పెట్టారు....ఇవన్నీ సిద్ధంచేసి, నా రాకను పసిగట్టి అప్పుడు మీరు గదిలో ప్రవేశించారు డాన్సు

చేస్తూ. నేను గమనిస్తున్నానని తెలిసి సిగరెట్ ముట్టించు కున్నారు.

విస్కీ కూడా తాగారు. సౌండ్ పెంచి డాన్సు ఉధృతం చేశారు. అదంతా చూసి నేను నిజమే కాబోలు అనుకొంటానుగానీ, 'మంచం క్రింద శవం వుంద'ని ఎలా అనుకుంటాను? అందుకే మీరు గదిలోకి రానివ్వలేదని ఎలా వూహిస్తాను!"

మాధవి ముఖంలో రక్తం వేగంగా ప్రసరించింది.

"అలా అపార్థం చేసుకొని నేను వెళ్ళిపోయాను. అమాయకుడ్ని. అది చూసి పావన్ పెరటిదారిగుండా వెళ్ళి కారు తెచ్చి ఇంట్లో పెట్టాడు. అయితే మీ భర్తని గాలించి మళ్ళీ మేం మీ ఇంటికి రావచ్చని వూహించారు. అందువల్ల మీరు మరో దృశ్యం సృష్టించి నన్ను ఫూల్ చేశారు."

"ఏం చేశాను?" మొదటిసారి పలికింది। మాధవి. పేలవంగా.

"మీ భర్త మేం అనుకొన్నట్లు మాధురిని కలుసుకో లేదు. కాబట్టి ఫోన్ మీద ఏదో సూచనతో బ్లాక్ మెయిలర్ ఎవరో తెలిసిపోయి, అతన్ని నేరుగా కలుసు కున్నారనుకున్నాం.

అందువల్ల ఆయన రాకకోసం మీ ఇంటివద్ద నిఘా వేయాలనుకున్నాను. అప్పుడు కారుని మీ ఇంటి వెనుక ఆపాలని ఆ వీధిలోకి డ్రైవ్ చేశాను. అక్కడ—పెరటి తలుపు దగ్గర పేడలో టైర్ ప్రింట్స్ కన్పించాయి. అనుమానంతో ఇంట్లోకి వచ్చిచూస్తే లోపల కారుంది. టైరుకి పేడ లోపల మట్టి, బావిదగ్గర అడుగుజాడలు— ఇవి చూసి ఆయనేదో గూడుపుఠాణీ సాగించారను

కున్నాను. అప్పుడు బాల్కనీలో ఎక్కి ఆ కిటికీలోంచి చూశాను. మీరిద్దరూ నిద్రపోతూ కనిపించారు...

"కానీ మీరు నిద్రనటిస్తున్నారనీ, మీ ప్రక్కన మీ వారు శాశ్వత నిద్రలో వున్నారని నేనప్పుడు తెలుసుకోలేకపోయాను!"

"ఏమిటీ! ఆయన శవం ప్రక్కన పడుకో బెట్టి—" కృష్ణన్ అరిచాడు.

"చూడండి, ఆమె ఎంత తెలివిగా ప్రవర్తించిందో! సమయానుసారంగా సన్నివేశాల్ని సృష్టించింది. ఆ సమయంలో రావ్ సజీవంగా వున్నాడని నన్ను నమ్మించి, నన్నే సాక్షిగా ఎలిబీ సృష్టించుకోవాలనుకుంది. కానీ మెడికల్ ఎవిడెన్స్ గురించి ఆలోచించలేదు. వెల్, నేను ఇంటికెళ్ళిపోయి ఫోన్ చేస్తే ఆయన తిరిగివచ్చి నిద్రపోతున్నారనీ, లేపడం ఇష్టంలేదనీ అబద్ధమాడింది.

"ఇహ వీళ్ళకి ప్రమాదం తొలగింది. శవాన్ని ఏదో ఒకటి చెయ్యాలి. ఈ హత్య వీళ్ళ మెడకి చుట్టుకోకూడదు. కాబట్టి దాన్ని ఆత్మహత్యగా రూపొందించాలనుకున్నారు. పరిస్థితులన్నీ చక్కగా సరిపోతాయి. రావ్ బ్లాక్ మెయిల్ లో ఇరుక్కున్నాడని మాకు తెలుసుగాబట్టి వ్యవహారం బెడిసి అవమాన భారంతో ఆత్మహత్య చేసుకున్నాడని మేమనుకొంటామనుకొన్నారు. ఈ ఆలోచనతో ఆయన మెడకి తీగచుట్టి—"

బయట అడుగులు వినిపించడంతో లాల్ ఆగిపోయాడు.

అందరూ ద్వారంకేసి చూశారు.

"మెడకి తీగచుట్టినంతమాత్రాన ఆత్మహత్య అంటే ఎవరు నమ్ముతారు, చుట్టినవాళ్ళు తప్ప?" అన్నాడు జాన్

లోనికొస్తూ, "హలో! ఇన్స్పెక్టర్."

"హలో ఫ్రెండ్, ఇట్స్ సాడ్ మార్నింగ్."

"అండ్ ఎ సక్సెస్‌ఫుల్ మార్నింగ్. మీట్ అవర్ ఫ్రెండ్ మిస్టర్ సావన్‌కుమార్."

జాన్ ప్రక్కన ఒక ముఫ్ఫైఏళ్ళ యువకుడు ఎవరితోనూ కళ్ళు కలుపలేక, నేల చూపులు చూస్తూ నిల్చున్నాడు.

మాధవి అతన్ని దిగ్గున తలెత్తి చూసి, చూపులు మరల్చుకొంది.

"వెరీ వెల్, జాన్! మీకోసమే ఎదురు చూస్తున్నాం" అన్నాడు లాల్.

జాన్ నవ్వాడు, "క్లూ.... నే చెప్పిన క్లూ ఏమైంది?"

"అక్షరాల నిజమైంది, అది స్థానంమారి రావ్ బొటనవేలి కంటుకుంది."

"ఈజిట్? అయితే ఇవిచూడు. గ్లోవ్స్, నెగటివ్స్" జాన్ అందిస్తూ అన్నాడు, "నేనలా ఫోన్‌లో అమర్యాదగా మాట్లాడినందుకు మాధవిగారు క్షమించరనుకుంటాను."

"యూ ఆరే రోగ్ —"

"ధన్యుడ్ని."

"వెల్, ఇక ఆపండి!" లాల్ అడ్డుకున్నాడు, గ్లోవ్స్ పరిశీలిస్తూ. అవి అక్కడక్కడ చిరిగివున్నాయి.

నెగెటివ్స్‌లో రావ్ — మాధురి భంగిమలున్నాయి.

"వెల్, మాధవి. నే చెప్పిన ఆలోచనతో శవం మెడకి తీగచుట్టి ఈ గ్లవ్స్‌తో లాగాడు మీ ఫ్రెండ్. తర్వాత ఇద్దరూ మోసుకెళ్ళి పెరట్లో వ్రేలాడదీశారు. అయితే అతి సామాన్యమైన విషయాల్ని విస్మరించారు.

మీ ఫ్రెండ్ వొట్టిచేతులతో తీగలాగితే గిరుకుపోతా యనుకున్నప్పుడు, రావ్ లాగినప్పుడు కూడా గిరుకు పోవాలని తట్టలేదనుకొంటాను. పైగా తీగను చేతికి చుట్టారు. అంతేగాక ఈ గ్లోవ్స్ నాశనం చెయ్యడం కూడా బాధకమనిపించిందనుకొంటాను. ఇలాంటి ఎన్నో పొరపాట్లు లోపాలతో ఈ హత్యను ఆత్మహత్యగా పకడ్బందీగా సృష్టించలేకపోయారు.

"ఒక విషయం గుర్తుంచుకోండి. హత్యనెవరూ ఆత్మ హత్యగా నిరూపించలేరు. నేర పరిశోధన సైంటిఫికల్‌గా చాలా అభివృద్ధి చెందింది—లీగల్ మెడిసిన్ ప్రాధాన్యత సగటు నేరసుడికి తెలియదు. సర్క్యుమ్‌స్టేన్షియల్ ఎవిడెన్స్‌ని సృష్టించగలరుగానీ, మెడికల్ ఎవిడెన్స్ నెవరూ మార్చలేరు!"

లాల్ టైము చూసుకొని లేచి నిలబడ్డాడు. "దట్సాల్, కృష్ణన్. ఇక మిగిలింది నీ వంతు."

కృష్ణన్ తలూపి లేచాడు, "ఇన్‌స్టెంట్ కాఫీలా కేసు తేల్చేశారు!" అన్నాడతను.

జాన్ నవ్వాడు, "భూటన్ విస్కీలా కామెంట్ చేశారు, థాంక్స్!"

లాల్ ఓసారి మాధవినీ, సావన్‌నీ చూసి వెను దిరిగాడు.

—:ఐ పో యిం ది:—

## ఫోన్‌కాల్

### టెంపోరావ్

భర్త నాగేష్ ఆఫీసుకు వెళ్ళాడు. అతడు రాత్రిదాకా తిరిగిరాడు. ఒక్కపూట మాత్రం యింట్లో భోజనం చేస్తాడు. ఒకటిన్నర సంవత్సరాల బాబుకి బాటిల్లో పాలు పోసిచ్చి, తాగడం పూర్తయ్యాక అతడిని పరుపు మీద పడుకోబెట్టి జోకొట్టసాగిందామె. నోట్లో వేలు పెట్టుకుని బాబు కళ్ళుమూశాడు.

బాబు నిద్రపోయాక ఆమె వంట ప్రారంభించాలి. తనొక్కతికే తను వండుకోవాలి. వంటపూర్తయ్యేసరికి బాబులేస్తాడు. బాబుకి తిండిపెట్టి, తను తిని హాయిగా నిద్రపోవచ్చు! కాని ఆమెను బాబు ఒకంతట నిద్ర పోనివ్వడు.

రోజూ జరిగే యీ కార్యక్రమాలను గురించి సింహావలోకనం చేసుకుంటూ అనసూయ పడగ్గది కిటికీ దగ్గర నిలబడి బయటకు చూసింది. మిడ్‌లాండ్ డిపార్టుమెంట్స్ పెద్ద భవనం. అందులో ఆరు ఫ్లాట్లు వున్నాయి.

వాళ్ళుండే ఫ్లాట్ రెండో అంతస్తులో వుంది. మారింలో మెయిన్ గేటు కనిపిస్తోంది. గేటు దాటాక వెడల్పుగా వున్న బిసంత్ రోడ్డు.

ఆమె టైముచూసింది. తొమ్మిది దాటింది. పదకొండు దాటాక బాబులేస్తాడు. తను వంటముగించాలి, ఆ లోపల. వాడు లేస్తే ఏ పనీ చెయ్యనివ్వడు. ఆమె ఆలోచిస్తోంది.

పక్క హాల్లో వున్న టెలిఫోన్ మ్రోగింది. ఎక్కడి నుంచో భర్త ఫోన్ చేస్తూ వుండాలి! ఉషారుగా వెళ్ళి ఆమె రిసీవర్ని అందుకుంది.

"హలో!" అందామె.

"అనసూయా?" అడిగిందో పురుష కంఠం అటు వైపునుంచి.

"ఎవరు మీరు?"

"నువ్వు అనసూయవైతే నేనెవరో చెప్తాను."

"అనసూయనే," అందామె.

"నీతో నాకు పరిచయం లేకపోవచ్చు. నీ భర్త నాకు తెలుసు. వాడొక కిరాతకుడు," అందా కంఠం.

"హలో, ఎవరు నువ్వు?"

"ప్రస్తుతం నీకనవసరం. త్వరలో నీ భర్తను కలుసుకుంటాను."

"ఎందుకు?"

"నువ్వింత తెలివితక్కువదానివని నేనెరగను! బకాసురుడు దగ్గరకు భీముడు ఎందుకెళ్ళాడు?"

అటువైపునుంచి వెటకారంగా నవ్వు ధ్వనించింది.

"మిస్టర్, నువ్వెవరో తెలియదు. హద్దులుదాటి వాగుతున్నావు...."

"నీ మొగుడు చేసిన ఘోరాలకు హద్దులులేవు!"

"అతడు చేసిన ఘోరాలేమిటి?"

"వాడొక బ్లడీ రేపిస్టు? నిన్ను పెళ్ళాడేముందు ఎందరో యువతుల్ని నమ్మించి, బలాత్కారించి పరారీ అయ్యాడు."

"నేను నమ్మను!" అందామె.

"ప్రేమ గుడ్డిది అన్నారందుకే పెద్దలు. వాడు చక్కగా మాట్లాడి నిన్ను వల్లో వేసుకున్నాడు. నిన్ను పెళ్ళాడాడు. నీ ఆస్తంతా వాడిచేతుల్లో వుంది. ఎప్పుడో నిన్ను కూడా వదిలేసి వుడాయిస్తాడు."

"షటప్!" అర్చిందామె కోపంగా.

"ఒక అమాయకపు యువతి నోరెత్తకుండా వాడి మోసాన్ని కొంతకాలం భరించింది. సంఘం నోరు నొక్కలేక ఆమె నూతిలోపడి ఆత్మహత్య చేసుకుంది. ఆమె నాకు బాగా తెలుసు."

"ఆమె నీ మూలంగానే మరణించి వుంటుంది."

"నీ భర్త తన గతాన్ని చీకట్లో పడేసి మీముందు పెద్దమనిషిలా నటిస్తున్నాడు. ఒకసారి వాడిని అడిగి చూడు! వాడు పిరికిపంద. వాడిని భయపెట్టు. అంతా ఒప్పేసుకుంటాడు. నీ కాళ్ళమీదపడి తన్ని కాపాడమంటాడు. కాని నువ్వేకాదు, ఎవ్వరూ, వాడిని కాపాడలేరు. వాడు నా చేతుల్లో చస్తాడు!"

"నీ గురించి పోలీస్ రిపోర్టిస్తాను."

"అందుకు నీ భర్త ఒప్పుకోడు. పోలీసులంటే వాడికి భయం. తన గతాన్ని వాళ్ళు కనుక్కుంటారేమో అని వాడెప్పుడూ భయపడ్తూ వుంటాడు."

"అంతేనా నువ్వు చెప్పవలసింది?"

"ఇంకా చాలావుంది. ఇవాళకు యిది చాలు. మరో

సారి ఫోన్ చేసి మరి కొంత చెప్తా. బై బై!"

అటువైపునుంచి రిసీవర్ పెట్టేసిన శబ్దం వినపడింది. తన చేతిలోని రిసీవర్ని పెట్టేసి ఆమె హాల్లోని సోఫాలో కూర్చుండిపోయింది.

తనతో మాట్లాడిన వ్యక్తి యెవరు? అనవసరంగా లేని పోనివి కల్పించి అతడు తనతో యెందుకు చెప్పాడు? నాగేష్మీద అతడికి పగా? ఫోన్లోని కంఠాన్ని ఆమె యింతకు ముందు యెన్నడూ వినలేదు. ఎంత ఆలోచించినా ఆమెకు ఏమీ అర్థంకాలేదు.

ఆమె ముందు తలుపువైపు చూసింది. తలుపు గడియలు బిగించి వున్నాయి. తను జాగ్రత్తగా వుండాలి. ఎవరేనా వచ్చి తట్టగానే తలుపు తెరవకూడదు!

సోఫాలో కూర్చుని ఆమె గతాన్ని జ్ఞప్తికి తెచ్చుకో సాగింది. నాగేష్తో ఆమెకు పరిచయమై మూడేళ్ళయింది. అతడు మెడికల్ రిప్రసెంటేటివ్. ఒక థియేటర్లో అతడిని ఆమె మొదటిసారిగా చూసింది. పొట్టిగా, పచ్చగా, స్మార్టుగా వున్న నాగేష్ ఆమెను బాగా ఆకర్షించాడు. ఆమెవైపు చూసి అతడు సిగ్గుపడేవాడు. కొన్నిరోజులు దాకా అతడామె ముందు యెక్కువగా మాట్లాడనేలేదు. స్నేహం పెరిగాక అతడు యెంత చక్కగా మాట్లాడ తాడో ఆమె తెల్సుకుంది.

అతడిని పెళ్ళాడ్డానికి ఆమె నిశ్చయించుకొంది. తండ్రి కళ్యాణమూర్తితో చెప్పింది. అతడు ఒప్పుకోలేదు.

"మెడికల్ రిప్రసెంటేటివ్ నా అల్లుడా! నాన్ సెన్స్!" అని తోసిపుచ్చాడు తండ్రి.

కాని రహస్యంగా ఆమె అతడిని కల్సుకొంటూనే

వుంది. ఇంతలో ఆమె తల్లి చనిపోయింది. కళ్యాణమూర్తి రెండు ఫ్యాక్టరీలను నడుపుతున్నాడు. వాటిలో నాల్గోవంతు వాటా అనసూయ తల్లి పేరుంది. ఆమె పోయే ముందు తన వాటాను అనసూయ పేర వీలునామా రాసింది. తను నాగేష్‌నే పెళ్ళాడతాననీ, తన తల్లి వాటా తన కివ్వమనీ అనసూయ పట్టుబట్టింది.

నాల్గోవంతు వాటా ఇవ్వడం తండ్రికి ఇష్టంలేదు. వీలునామా ప్రకారం ఆమెకు రావలసిన వాటాకు విలువకట్టి, ఐదులక్షలిచ్చి కూతుర్ని బయటకు పొమ్మన్నాడు కళ్యాణమూర్తి.

"ఈ డబ్బుతో పోయి వాడితో గంగలో దూకు!" అన్నాడతను.

ఆమె నాగేష్‌ని పెళ్ళాడింది. రెండు లక్షలు పెట్టి ఆ ఫ్లాట్ కొంది. తతిమ్మా డబ్బును ఫిక్సెడ్ డిపాజిట్‌లో భద్ర వుంచాడు. అంత డబ్బువున్నా అతడు వుద్యోగం మానలేదు. కష్టపడి పనిచేస్తున్నాడు. జీతం రాగానే అంతా ఆమెకిస్తున్నాడు. వాళ్ళ జీవితం సుఖంగా, హాయిగా సాగుతోంది. ఆ పండంటి జీవితానికి యీ ఫోన్ కాల్ గొడ్డలిపెట్టులా పరిణమిస్తోంది.

అనసూయ కన్నీళ్ళను తుడుచుకుంది. ఎవరో ఏదో చేప్తే తను నమ్మకూడదు. ధైర్యంగా పెళ్ళాడినట్లే ధైర్యంతో తను వ్యవహరించాలి. తనతో తెగతెంపులు చేసుకున్న తండ్రి యెవరిచేతో అలా ఫోన్ చేయించే దేమో!

అమ్మ పోగానే ఆమె తండ్రి మళ్ళా పెళ్ళిచేసుకున్నాడు. తన సవితల్లి యిదంతా చేయిస్తోందేమో.

ఎవరో తలుపును తట్టారు. ఆమె వులిక్కిపడింది. తలుపు

దగ్గరగా వెళ్ళింది. గుండె దడదడ కొట్టుకొంటోంది.

"పోస్టు!" అందో కంఠం అటువైపునుంచి.

తాళంచెవి చిల్లులోంచి ఆమె బయటకు చూసింది. తలుపు తెరిచే ధైర్యం ఆమెకు లేదు. "పోస్టు" అంటూ హాంతకులు లోపలకు ప్రవేశిస్తారు.

"తలుపు కిందనుంచి వుత్తరాలు లోపల పడేయి" అర్చిందామె.

ఒక కార్డు, కవరు తలుపు కిందనుంచి లోపలకు వచ్చాయి. బయటనున్న వ్యక్తి నిజంగా పోస్టుమన్నే.

ఆమె వుత్తరాలను తీసుకొని వెనక్కి తిరిగింది. టెలిఫోన్ మ్రోగింది. మళ్ళా వాడేనా? మెల్లిగా వెళ్ళి రిసీవర్ని అందుకుంది.

"హాలో" అందామె.

"అనూ, ఏం చేస్తున్నావు?"

భర్త కంఠం. తన భర్త నాగేష్.

"నాగేష్, నాకు భయంగా వుంది...."

"ఎందుకు భయం? క్రయిమ్ నవలలు చదవొద్దంటే వినవు!"

"అదికాదు నాగేష్. నువ్వు యెప్పుడొస్తావు?"

"రోజూలా ఏడింటికి."

"ఇవాళ తొందరగా రా! నా కోసం."

"నువ్వు రమ్మంటే రాకుండా వుండగలనా? ఐదింటికి వస్తాలే."

"థాంక్స్" అందామె.

"బాబుగాడు ఏం చేస్తున్నాడు?"

"పడుకున్నాడు."

"వంట అయిందా?"

"ఇంకా మొదలెట్టలేదు."

"నేను యింట్లో లేకపోడం వలన లంచ్ మీద నీకు శ్రద్ధ క్షీణిస్తోంది. అన్నీ రాత్రి వండుతున్నావు!"

"ఒక్కపూట బాగా తింటే చాలు, బతకడానికి."

"మైడియర్, అక్కడే పొరబడుతున్నావు. నేను నీ కోసం తింటున్నాను. నీకోసం జీవిస్తున్నాను. అలాగే నువ్వు నాకోసం రెండు పూట్లా తినాలి. నాకోసం బతకాలి" అన్నాడతను.

"మన పెళ్ళి నిన్నో, మొన్నో అయినట్లు మాట్లాడుతున్నావు."

"అనూ, ప్రతిరోజూ నా కళ్ళకు నువ్వు పెళ్ళికూతురులాగే కనిపిస్తావు."

"నాగేష్, తొందరగా రా" అందామె.

"ఈట్ వెల్, మైడియర్, బై బై" అన్నాడతను.

ఆమె రిసీవర్ని పెట్టేసి వంటగదిలోకి వెళ్ళింది.

## 2

ఐదింటికి వస్తానన్న నాగేష్ యింటకొచ్చేసరికి ఎనిమిది దాటింది. అతడు తలుపు తట్టాడు.

"ఎవరు?" అంది అనసూయ లోపలనుంచి.

"నేనే" అని అతడు జవాబిచ్చాక ఆమె తలుపు తెర్చింది.

ఒంటరిగా కారమ్స్ ఆడుతున్న బాబు రెండు పిక్కల్ని దూరంగా విసిరి "నాన్నా!" అంటూ నాగేష్ వైపు తప్పటడుగులు వేశాడు.

బాబును ఎత్తుకుని, ముద్దాడుతూ నాగేష్ సోఫాలో కూర్చున్నాడు. తలుపుమూసి, గడియాలు బిగించి ఆమె అతడి కెదురుగా వున్న మరో సోఫాలో కూర్చుంది.

"అనూ యిలారా" అన్నాడతను.

"నాన్నా, బిక్కి" అన్నాడు బాబు.

తన బాగ్‌లోంచి చిన్న బిస్కట్ల పాకెట్ తీసి అతడు బాబుకిచ్చాడు. ఆమె లోపలకు వెళ్ళి, కాస్సేపట్లో కాఫీ తెచ్చి భర్తకిచ్చింది. అతడామె చెయ్యి పట్టుకులాగాడు. ఆమె ఆతడి పక్కనే కూర్చుంది.

నాగేష్ చెయ్యి ఆమె నడుమును చుట్టేసింది.

బాబు బిస్కట్ నవుల్తున్నాడు.

"అనూ, ఏమిటలా వున్నావు?" అడిగాడతను.

ఆమె సీరియస్‌గా ఆతడివైపు చూసింది.

"నాగేష్, నీకెవరేనా శత్రువులు వున్నారా?" అడిగిందామె.

"వుంటే వుండొచ్చు. గాంధీజీ లాంటి వ్యక్తికే శత్రువులుండేవారు. మనలాంటి వాళ్ళకు వుంటే ఆశ్చర్య పడనక్కరలేదు."

"నీ కంపెనీలో వున్నారా?"

"వుండొచ్చు. మా కంపెనీలో నాలా యెందరో రిప్రసెంటేటివ్స వున్నారు. నాకు జీతం యెక్కువ. జీతం కాక, ఆంధ్రా, తమిళనాడు రాష్ట్రాలలోని సేల్సుమీద నాకు 1/4 పర్సంట్ కమిషన్ వస్తుంది. ఈ రెండు రాష్ట్రాల్లోనూ మా కంపెనీ మందులు సాలుకి కోటిరూపాయలు పైన అమ్మబడతాయి. నా రాబడి చూసి మా కంపెనీలోని కొందరు అసూయపడొచ్చు."

ఆమె అతడివంక సూటిగా చూసింది.

"నాగేష్, యీ ఫ్లాట్ నీ పేరుంది. ఫిక్స్‌డ్ డిపాజిట్లు అన్నీ నీ పేరులోనే వున్నాయి...."

"నేను నీ హృదయంలో వున్నాను. నా హృదయంలో

నువ్వన్నావు" అన్నాడతను నవ్వుతూ.

"ప్లీజ్, జోక్‌గా మాట్లాడొద్దు" అందామె.

అతడామెను చేతుల్లో పట్టుకుని, పెదిమాలను ముద్దెట్టు కున్నాడు. ఆమె పక్కకు తిరిగిపోయి, తిరగలేక వూరు కుంది.

"అనూ, ఇవన్నీ యెందుకు అడుగుతున్నావు?"

ఆమె జవాబివ్వలేదు.

"నీ గతాన్ని గురించి చెప్పు, నాగేష్."

"నా గతంలో చెప్పుకోదగినది ఏమీ లేదు. నా తలి దండ్రులు పోయాక మావయ్య యింట్లో పెరిగాను. ఎవరి మీద కోపం వచ్చినా మావయ్యా నన్నే కొట్టేవాడు. అతడు యింట్లో లేనప్పుడు అత్తయ్య నన్ను కొట్టేది. ఆ బాధ పడలేక నేను యిల్లువిడిచి పారిపోయాను. ఎన్ని కష్టాలో పడి చివరికి యీ మందుల కంపెనీలో చేరాను. నాకు మనుషులంటే అసహ్యమేసేది. నా తెలివి తేటల్తో వాళ్ళను ఓడించి ఆనందించేవాడిని. నీ పరిచయం అయ్యాక నా మన స్తత్వం మారింది. నీదగ్గర ఓడిపోయి, ఓడిపోడంలో కూడా ఆనందం వుందని గ్రహించాను."

"నాగేష్, నువ్వు ఏ యువతినైనా రేప్ చేశావా?" ఆమె కంఠం పిస్టల్ షాట్‌లా వుంది.

అతడి మొహంలోని చిరునవ్వు మాయమైంది.

"చేశాను."

"ఎవరా అభాగ్యురాలు?"

"నువ్వే!" అన్నాడతను పకపక నవ్వుతూ.

"నీకంతా హాస్యమే" అందామె చిరాకుగా.

"మైడియర్, శేకిట్ యీజీ! ఏమైందో చెప్పు! ఈ పిచ్చిప్రశ్నలు యెందుకు అడుగుతున్నావు? డొంక చుట్టూ

తిరగడం మాని ముక్కు సూటిగా రా!"

టెలిఫోన్ కాల్ గురించి ఆమె వివరంగా చెప్పింది. ఆతడు నవ్వేశాడు.

"ఎవడో మూర్ఖుడు యివాళ ఏప్రిల్ ఫస్టు అనుకొని పొరబడ్డాడు. ఫర్ గెట్ హిమ్!" అన్నాడతను.

"వాడు సీరియస్‌గా చెప్పాడు. ఆ అమ్మాయి నూతిలో పడి చచ్చిందట."

నాగేష్ ఆమెవంక సూటిగా చూశాడు. ఆమె చెయ్యి పట్టుకున్నాడు. "నువ్వు చెప్పింది విన్నాక ఒక విషయం గుర్తుకొస్తోంది. ఇది కాకినాడలో జరిగింది. ఒక యింట్లో గది అద్దెకు తీసుకుని నేను వుండేవాడిని. తల్లి, కొడుకు, కూతురు ఆ యింట్లో వుండేవారు. ఆ అమ్మాయి నన్ను వదిలేది కాదు. ఒకనాటి రాత్రి ఆమె నా గదిలో కొచ్చి నా పక్కనే పడుకొంది. నన్ను ఆవేశపర్చింది. ఏం జరుగుతోందో తెలిసేలోపలే అంతా జరిగిపోయింది. నన్నా విధంగా బంధించి పెళ్ళాడాలని ఆమె కోర్కె. అది గ్రహించి నేను రహస్యంగా యిల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాను. తర్వాత ఆమె గురించి నాకు తెలియదు. ఆమెకు నేను ఏ ఆశలూ చూపించలేదు. ఆమె ప్రోత్సాహం మూలంగానే అంతా జరిగింది. అది నీతో చెప్పకపోవడం నేను చేసిన తప్పు" అన్నాడతను.

ఆమె అతడివైపు కోపంగా చూసింది. కొంచెం దూరంగా జరిగింది.

"నీ జీవితంలో మొదటి యువతి నేనే అని పొరబడి, సంతోషించాను" అందామె గాయపడినట్లు అతడివేపు చూస్తూ.

"మనస్ఫూర్తిగా నన్ను నేనర్పించుకొన్నది నీకే.

తార్కికంగా అదే నా తొలి అనుభవం అవుతుంది" అన్నాడతను.

ఆమె పళ్ళు పటపట కొరికింది.

"మనుషులను మాటల్లో తృప్తిపర్చడం నీకు బాగా తెలుసు" అందామె.

అతడామె దగ్గరగా జరిగాడు. ఆమెను పట్టుకోడానికి ప్రయత్నించాడు. ఆమె సోఫాలోంచి లేచింది. వంటగది లోంచి ఏదో చప్పుడు వినపడి ఆమె అటు పరుగెత్తింది. పెద్ద అల్యూమినం డబ్బా కింద పడివుంది. బాబు మొహం నిండా, చేతులు నిండా గోధుమపిండి.

"మామాం" అన్నాడు బాబు.

"రాస్కెల్, యిక్కడికెప్పుడొచ్చావు" అర్చిందామె వాడిని గుడ్డతో తుడుస్తూ.

వంటగది గుమ్మంలో నిలబడి వున్నాడు నాగేష్. బాబును యెత్తుకొని ఆమె గుమ్మం ముందుకు వెళ్ళింది.

"పక్కకు జరుగు" అందామె.

"నీ జీవితంలోంచి జరిగిపొమ్మంటావా?" అడిగాడతను.

"ఎలా అర్థం చేసుకొంటే అలా చేయొచ్చు" అంది ఆమె.

నాగేష్ వెనక్కి తిరిగి ముందు హాల్లోకి వెళ్ళిపోయాడు. సోఫాలో కూర్చుని సిగరెట్ వెలిగించాడు. పొగవదుల్తూ నలువైపులా చూశాడు. ఆమె బాబుతో పక్కగదిలో వుంది.

అననూయలో తనమీద ఆగ్రహం బాగా రగులుకొంది. ఇప్పుడు తనేం చెప్పినా ఆమె వినదు.

అలా యెందుకు జరిగిందె? తను లేని సమయంలో ఇంటి కెవరొచ్చారు? ఆమె మనసులో తనమీద ద్వేషం పుట్టే

టట్లు వాళ్ళేదో చెప్పుండాలి. ఫోన్ కాల్ రావడం హంబగ్! ఎవరో వచ్చి, తనమీద యెంతో చెప్పి వెళ్ళిపోయివుండాలి. ఫోన్ వచ్చినట్లు ఆమె తనతో అబద్ధం ఆడివుండాలి.

నిమిషాలు గడుస్తున్నాయి. రాత్రి పది కావస్తోంది. ఆమె హాల్లోకొచ్చి దూరంగా నిలబడింది.

"వంటింట్లో డైనింగ్ టేబులుమీద అన్నీ వున్నాయి. నేను తినేశాను. వెళ్ళి పెట్టుకుతిను" అని ఆమె వెనుదిరిగి వెళ్ళిపోయింది.

## 3

"అమ్మా, పాలు" అరిచింది కన్నమ్మ.

ఎన్నిసార్లు తలుపుతట్టినా యెవ్వరూ రాలేదు. తలుపును తోసిందామె. తలుపు తెరిచేవుంది. ఆమె హాల్లోకి వెళ్ళి, టీపాయిమీద రెండు పాలపాకెట్లను పెట్టి "అమ్మా!" అని మళ్ళా పిల్చింది.

లోపలనుంచి ఏదో ఏడుపు వినపడింది. బాబు ఏడుస్తున్నాడని గ్రహించి ఆమె లోపలకు వెళ్ళింది. బాత్‌రూమ్‌లో నేలమీద అనసూయ శవం నగ్నంగా, రక్తం మడుగులో పడుంది. ఆమెమీద పడి బాబు ఏడుస్తు వున్నాడు.

గదిలోకొచ్చిన కన్నమ్మవంక బాబు చూశాడు. అతడి కళ్ళు ఏడ్చి, ఏడ్చి యెర్రబడ్డాయి.

"ఆయా, అమ్మ!" అన్నాడు బాబు ఆమెను చూసి.

కన్నమ్మ నేలమీద పడున్న అనసూయవైపు మళ్ళా చూసింది. కత్తితో యెవరో ఆమెను పొడిచి, పొడిచి చంపారు. అనేక చోట్ల ఆమె ఒంటిమీద రక్తం గడ్డ కట్టింది. సమీపంలో కత్తి పడుంది.

బాబును యెత్తుకోబోయి, ఆగి, ఆమె వెనక్కి తిరిగి పరుగెత్తింది. పక్క ఫ్లాట్ లో వున్న అడ్వకేటు రామచంద్ కి అంతా చెప్పింది. అతను కన్నమ్మతో వెళ్ళి శవాన్ని చూశాడు.

"అంకుల్" అన్నాడు బాబు అడ్వకేట్ ని చూసి.

రామచంద్ వెనక్కి తిరిగాడు. బాబు ఏడుపు వినిపిస్తోంది.

"కన్నమ్మా, నేను పోలీస్ రిపోర్టు యిస్తాను. నువ్వు వెళ్ళిపోకు" అన్నాడతను.

"అలాగే వుంటానయ్యా! ఆ పసిబిడ్డను చూస్తే గుండె కరిగిపోతోంది. వాడికి ఏ పాలో యిస్తే బాగుంటుందయ్యా" అందామె.

"పోలీసులు వచ్చినదాకా మనం ఏమీ చెయ్యకూడదు" అన్నాడు రామచంద్.

కన్నమ్మ ఫ్లాట్ ముందు నడవలో కూర్చుండిపోయింది. లోపలనుంచి బాబు ఏడుపు వినిపిస్తోంది. అడ్వకేట్ రామచంద్ టెలిఫోన్ చేసి బయటకొచ్చాడు.

"కొన్ని నిమిషాల్లో పోలీసులు యిక్కడుంటారు" అన్నాడతను, విచారవదనంతో కూర్చున్న కన్నమ్మను చూసి.

ఇన్స్పెక్టర్ నాయర్ అరడజన్ కానిస్టేబుల్స్ తో పైకొచ్చాడు. నడవలో అనేకమంది గుమిగూడారు.

"నా పేరు రామ్ చంద్. మీకు ఫోన్ చేసింది నేనే," అడ్వకేట్ తనని పరిచయం చేసుకొన్నాడు.

"రామ్ చంద్ గారూ, పదండి, శవాన్ని చూద్దాం." అన్నాడు ఇన్స్పెక్టర్.

"నడవలో గుమిగూడిన వాళ్ళను యిద్దరు కాని

స్టేబుల్సు వెనక్కి తరిమేసారు. ఇన్స్పెక్టర్ నాయర్, అడ్వకేటు రామ్‌చంద్ ఫ్లాట్ లోపలకు వెళ్ళారు. విశాల మైన బాత్ రూమ్. మెరుస్తూన్న మొజాయిక్ ఫ్లోర్ మీద పడున్న శవాన్ని ఇన్స్పెక్టర్ పరీక్షించాడు. గదిలో కొచ్చిన వాళ్ళను చూసి బాబు భయంతో ఏడ్వసాగాడు.

బాబువైపు సానుభూతితో చూశాడు నాయర్. అతడు ధరించిన లాగు మూత్రంతో తడిసివుంది. అతడి బనియన్‌కి రక్తం మరకలున్నాయి. ఇన్స్పెక్టర్ నాయర్ సమీపంలో వున్న కానిస్టేబుల్ వంక చూశాడు.

"ఫోటోలు వెంటనే తీయించు. ఆ కుర్రాడిని మనం యిక్కడనుంచి బయటకు తర్వాత తీసుకుపోవచ్చు," అన్నాడు ఇన్స్పెక్టర్.

ఇన్స్పెక్టర్ నాయర్ గది నలువైపులా చూశాడు. గోడవారగా బేతింగ్ టబ్ వుంది. టబ్ నిండా నీళ్ళు ఉన్నాయి. హత్యకు ఉపయోగించిన కత్తిని పరీక్షగా చూశాడు నాయర్.

నేలమీద సిల్కు చీర, నల్లటి పావడా, జాకెట్, బ్రాసియర్ పడున్నాయి. ఫోటోలు తీశాక ఇన్స్పెక్టర్ నాయర్ పక్కనున్న అడ్వకేటువైపు తిరిగాడు.

"ఈ పసివాడిని శుభ్రపర్చి, పాలు యివ్వమనండి," అన్నాడు నాయర్.

రామ్‌చంద్ దూరంలో వున్న కన్నమ్మకు సౌజ్ఞ చేశాడు. ఆమె గదిలోకొచ్చింది.

"బాబును మా యింటికి తీసుకెళ్ళి కడుగు. బాటిల్లో పోసి పాలిమ్మని నా భార్యతో చెప్పు," అన్నాడు రామ్‌చంద్.

కన్నమ్మ బాబును ఎత్తుకోబోయింది. కాని వాడు

తల్లిని వదల్లేదు.

"అమ్మా! అమ్మా!" అని పిచ్చిగా ఏడుస్తున్నాడు.

బాబును లాగి, ఎత్తుకొని కన్నమ్మ బయటకు నడిచింది.

ఇన్స్పెక్టర్ నాయర్ రామ్‌చంద్‌తో హాల్లోకొచ్చాడు.

"ఈ ఫ్లాట్ ఎవరిది?"

"మిస్టర్ నాగేష్‌ది. హత్యచేయబడిన వ్యక్తి అతడి భార్య అనసూయ. బాబు ఒక్కడే వాళ్ళకు సంతానం. ఆమె తండ్రి కళ్యాణమూర్తి యీ పట్నంలోనే వుంటున్నారని విన్నాను."

"అతడి అడ్రస్ తెలుసా?"

"టెలిఫోన్ డైరక్టరీలో వుంటుంది."

"శవాన్ని మొదట ఎవరు చూశారు?"

"బాబును తీసుకెళ్ళిన కన్నమ్మ. ఇక్కడి ఫ్లాట్స్‌లో వుండేవాళ్ళకు మిల్క్ డిపోనుంచి ఆమె పాలపాకెట్లు తెచ్చిపెడ్తుంది."

ఇన్స్పెక్టర్ నాయర్ కాస్సేపు ఆలోచిస్తూవుండి పోయాడు.

"నాగేష్ ఏమయ్యాడు?"

"నిన్న పొద్దుట అతడిని చూశాను."

"అతడికి కారుందా?"

"ఫియట్ కారుంది. కారు షెడ్లు బిల్డింగ్ వెనకవైపున వున్నాయి."

"వెళ్ళి చూద్దాం, రండి!"

ఇన్స్పెక్టర్ నాయర్, అడ్వకేట్ రామ్‌చంద్ కిందకు దిగారు. బిల్డింగ్ వెనకవైపుకు వెళ్లారు. వరుసగా ఆరు కారుషెడ్లు వున్నాయి. నాగేష్ ఫ్లాట్‌కు చెందిన కారుషెడ్ ఖాళీగా వుంది. ఫియట్ కారులేదు.

"నాగేష్ ఎక్కడికో వెళ్ళుండొచ్చు," అన్నాడు అడ్వకేటు రామ్‌చంద్.

షెడ్‌లోంచి వాళ్ళు బయటకొచ్చారు.

"మీ యింట్లో ఫోనుందిగా?" అన్నాడు ఇన్స్పెక్టర్.

"వుంది. అక్కడనుంచే మీకు ఫోన్ చేశాను."

"పదండి. కొన్ని కాల్సు చెయ్యాలి," అన్నాడు నాయర్.

టెలిఫోన్ డైరెక్టరీ పేజీలు తిప్పిచూసి నాయర్ ఒక నంబర్ని తిప్పాడు.

"హలో, కళ్యాణమూర్తి హియర్," అంది అటువైపు కంఠం.

"ఇన్స్పెక్టర్ నాయర్ స్పీకింగ్! మీరు వెంటనే మిడ్‌లాండ్ అపార్టుమెంట్స్‌కు రండి. మీ అమ్మాయి అనసూయను ఎవరో హత్య చేశారు!"

"గుడ్ హెవన్స్!" అరిచాడు కళ్యాణమూర్తి.

"వేగంగా రండి," అని నాయర్ రిసీవర్ పెట్టేశాడు.

రిసీవర్ ఎత్తి మరో నెంబర్ తిప్పాడు నాయర్.

టెలిఫోన్‌లో మాట్లాడి యిన్స్పెక్టర్ నాయర్ అడ్వకేట్‌కి థాంక్స్ చెప్పాడు.

"ఇన్స్పెక్టర్, నేను కోర్టుకు వెళ్ళాలి," అన్నాడతను.

"నాగేష్‌ను గురించి మీరు ఏమైనా చెప్పగలరా?"

"ఈ బిల్డింగ్స్‌లో మొత్తం ఆరు ఫ్లాట్లు వున్నాయి. బాగా డబ్బున్నవాళ్ళు యిక్కడ నివసిస్తూ వుంటారు. ఒకే అంతస్థులో వుండడంవలన అనసూయ మా ఫ్లాట్‌కి వచ్చి నా భార్యతో మాట్లాడుతూ వుండేది. నిజం చెప్పాలంటే వాళ్ళను గురించి నాకంతగా తెలియదు."

"థాంక్స్, మీరు వెళ్ళండి," అని నాయర్ బయటకు నడిచాడు.

## 4

మేడమెట్లెక్కి పైకి వెళ్ళాను. నడవలో ఇన్స్పెక్టర్ నాయర్ నా కెదురయ్యాడు.

"బ్రదర్, నీ రాకకోసం ఎదురుచూస్తున్నాను," అన్నాడతను.

నడవలో యిరవైమంది పైన నిలబడివున్నారు. ఒక కానిస్టేబులు వాళ్ళను ముందుకు రానివ్వడంలేదు. ఫ్లాట్ నెంబర్ 5 లోపలకు యిన్స్పెక్టర్ నాయర్తో వెళ్లాను. విశాలమైన హాలు. సోఫాలో లెదర్ బాగ్ వుంది.

లోపలున్న బాత్రూమ్లోకి వెళ్ళాను. అనసూయ శవం నగ్నంగా పడుంది. డాక్టర్ సుధాకర్ శవాన్ని పరీక్షిస్తున్నాడు. శవంవైపు చూశాను. ఆమె అంత అందమైనది కాకపోయినా యవ్వనంలో వుంది. చెవులు, మెడ, చేతులు బోడిగా వున్నాయి. కత్తితో ఆమెను నాలుగుసార్లు పొడిచి వుండాలి.

శవం సమీపంలో వున్న కత్తివంక చూశాను. కూరలూ అవీ కోసే స్టెయిన్ లెస్ స్టీల్ కత్తి. కర్ర పిడి వుంది. కత్తిమీద రక్తం మరకలున్నాయి.

ఎదురుగా వున్న టబ్ దగ్గరకు వెళ్ళాను. పైదాకా నీళ్ళు వున్నాయి. టబ్ లోని నీళ్ళు శుభ్రంగా వున్నాయి. స్నానంచేయాలనే ఉద్దేశంతో ఎవరో టబ్ టాప్ తెరిచి నింపివుంటారు. కాని స్నానం చేసుండదు!

శవంవైపు చూశాను. ఆమె స్నానం చెయ్యాలనుకుందా? ఈ లోపల హంతకుడొచ్చి ఆమెను హాత మార్చాడా? డాక్టర్ సుధాకర్ దగ్గరకు వెళ్లాను.

"పరశురామ్ గారూ. గతరాత్రి పన్నెండూ, ఒంటి గంట మధ్య యీమె మరణించి వుండొచ్చు!" అన్నా డతను.

"ఆమె రేప్ చేయబడిందా?"

"అటువంటి సూచనలు లేవు."

డాక్టర్ సుధాకర్ ఆమె ఒంటిమీద సమీపంలో వున్న చీరను కప్పేశాడు. కత్తిపిడిని వేలిముద్రల కోసం చూస్తున్నారు. ఫింగర్ ప్రింట్ ఎక్స్పర్టు రుద్రయ్య విజయవంతంగా నావంక తిరిగాడు.

"కుడిచేతి వేలిముద్రలు వున్నాయి సార్," అన్నాడు రుద్రయ్య.

ముందు హాల్లోకి వెళ్లాను. ఇన్స్పెక్టర్ నాయర్ టీపాయిమీదున్న రమ్‌బాటిల్ చూస్తున్నాడు.

"బ్రదర్, దానిమీద నాగేష్ వేలిముద్రలు వున్నాయి. ఈ గ్లాసుమీద, ఆ లెదర్ బాగ్ మీద కూడా అతడి వేలి ముద్రలు వున్నాయి," అన్నాడు నాయర్.

గబగబా రుద్రయ్య హాల్లోకొచ్చాడు.

"ఇన్స్పెక్టర్, కత్తి పిడిమీదున్న వేలిముద్రలూ, ఈ రమ్‌బాటిల్ మీద వున్నవీ ఒకడివే!" అన్నాడు రుద్రయ్య.

"నాగేష్‌వి!" అన్నాడు నాయర్.

ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించి పొగవదుల్తూ నాయర్ వైపు చూశాను. "బ్రదర్, నాగేష్ తనభార్యతో దేన్ని గురించో పోట్లాడివుంటాడు. ఆతడు ఈ రమ్ బాటిల్లోంచి మూడొంతుల పైన తాగేశాడు. అటు పైన ఆమెను బాత రూంలోకి తీసుకెళ్ళి అక్కడ చంపి కారులో పారిపోయాడు," అన్నాడు నాయర్.

రమ్‌బాటిల్ వైపు చూశాడు. 750 ఎమ్.ఎల్ ద్రవం వుండవలసిన బాటిల్లో నాలోవంతు మాత్రం వుంది. అంత రమ్ తాగిన వ్యక్తి కదిలే స్థితిలోవుండడు. ఎక్కడో పడి మూలుగుతూ వుంటాడు. ఆ స్థితిలో అతడు భార్యను చంపే అవకాశంలేదు.

"నాయర్ భాయ్, నాగేష్ తన భార్యను ఎందుకు చంపివుంటాడు?"

"అది కనుక్కోవాలి!" అన్నాడు నాయర్.

పంచ, లక్నోజుబ్బా ధరించిన ఒక వ్యక్తి అరుస్తూ హాల్లోకొచ్చాడు.

"నాకు మొదటనుంచీ తెలుసు. ఆ దుర్మార్గుడెప్పుడో యిలా చేస్తాడని," అన్నాడతను.

"కళ్యాణమూర్తిగారు మీరేనా?" అడిగాడు యిన్స్పెక్టర్ నాయర్.

"అవును, నేనే. అనసూయ తండ్రిని."

అతడివైపు సూటిగా చూశాను.

"ఈ పెళ్ళి మీ అనుమతి లేకుండా జరిగిందా?" ప్రశ్నించాను.

"వాడిని పెళ్ళాడవద్దని నేనెంతగానో చెప్పాను. అది వింటేగా! ఏ మందో పెట్టి దాని మనసును పూర్తిగా వాడు దోచుకున్నాడు. నేనిచ్చిన ఐదులక్షలు తీసుకొని బయటకుపోయి వాడిని పెళ్ళాడింది."

"మీ రెందుకంత డబ్బిచ్చారు?"

"నా భార్య పోయింది. నా కంపెనీలో నా భార్యకుండే వాటా కూతురికి వీలునామా ప్రకారం యివ్వవలసి వచ్చింది. నా కంపెనీలో అదీ, దానితో వాడూ వుండడం యిష్టంలేక డబ్బిచ్చి వదిలించుకున్నాను," అన్నాడతను.

"మీ అమ్మాయితో మీరు మాట్లాడేవారా?"

"నేను మాళ్లీ దాన్ని ఎన్నడూ చూడలేదు. నేనిచ్చిన డబ్బుతో వాడు యీ ఫ్లాట్ కొన్నాడని ఎవరో చెప్పారు. తతిమా డబ్బంతా ఏం చేశాడో!"

బాత్ రూమ్‌లోకి కళ్యాణమూర్తిని తీసుకెళ్ళాను. నేలమీద పడున్న శవంవైపు అతడు ఓసారి చూసి వెనక్కి తిరిగాడు.

"నాగేష్ చెడ్డవాడని మీకు బాగా తెలుసా?"

"లెదర్ బాగ్ పట్టుకుని ఊళ్ళమ్మట తిరిగే మెడికల్ సేల్సుమన్ వాడు. తన వాళ్ళెవరూ లేరు. పెళ్ళిముందు అతడిని గురించి వివరాలన్నీ కనుక్కోమని ఒక డిటెక్టివ్ ఏజన్సీని నేను కోరాను. వాళ్ళు పెద్ద రిపోర్టు పంపారు. వాడు జులాయిగా తిరిగే మనిషి, బాగా తాగుతాడు, అని రిపోర్టులో వాళ్ళు రాశారు."

"ఆ రిపోర్టు మీ దగ్గర వుందా?"

"ఫైల్లో వుండొచ్చు"

"ఆ రిపోర్టును మీ అమ్మాయికి చూపించారా?"

"లేదు. నేను తెలుసుకున్న విషయాలు ఆమెతో చెప్పాను. నేను వద్దన్నకొద్దీ వాడిమీద ఆమె ప్రేమ మరీ పెరిగిపోయింది!"

"కళ్యాణమూర్తిగారూ, ఆ రిపోర్టు నాకివ్వండి. అది మా పరిశోధనకు వుపయోగపడొచ్చు," అన్నాను.

"ఇస్తాను, సార్. నా కూతుర్ని చంపిన ఆ దురాత్ముడు మీకు చిక్కేందుకు నేనన్నివిధాలా తోడ్పడతాను."

కళ్యాణమూర్తి నాతో హాల్లోకి నడిచాడు. అక్క

డున్న సోఫాలో అతడు విచారవదనంతో కూర్చున్నాడు. ఇన్స్పెక్టర్ నాయర్ నన్ను గెస్టు రూమ్‌లోకి తీసుక వెళ్ళాడు.

"బ్రదర్, ఈ గదిని మనం కొన్ని గంటలవరకూ ఆఫీసుగా వుపయోగించుదాం. అలా కూర్చో," అన్నాడు నాయర్.

సోఫాలో కూర్చున్నాను. ఎదురుగా నాయర్ కూర్చున్నాడు.

"బ్రదర్, నాగేష్ యీ హత్య చేశాడని వేలిముద్రలనుబట్టి అనుకున్నాను. కాని అది సిల్లీగా కనిపిస్తోంది. ఈ యిల్లు నాగేష్ పేర్నవుంది. కళ్యాణమూర్తి యిచ్చిన తతిమ్మా డబ్బు ఏమైందో మనం కనుక్కోవాలి. కన్నమ్మతో నువ్వు మాట్లాడాలి. ఈ బిల్డింగ్ వాచ్‌మన్ మస్తాన్ని కూడా యీ గదిలోకి పంపుతాను."

"గుడ్! వాళ్ళను రమ్మను," అన్నాను.

ఇన్స్పెక్టర్ నాయర్ బయటకు వెళ్ళాడు. సోఫాలో కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. టైమ్ చూశాను. పది కావస్తోంది. హాల్లోని టెలిఫోన్ వైపు నడిచాను. నాయర్ నా దగ్గరకొచ్చాడు.

"టెలిఫోన్ వుపయోగించవచ్చు. ఫింగర్ ప్రింట్స్ వాళ్ళ పని అయిపోయింది" అన్నాడు నాయర్.

డైరక్టరీలో నంబరు చూసి రూపా ఫార్మచ్యూటికల్సు ఆఫీసుకు ఫోన్ చేశాను. అటువైపునుంచి ఆపరేటర్ "హాలో!" అంది.

"మీ మేనేజర్‌కి కనెక్షన్ ఇయ్యి" అన్నాను.

"ఎవరు మాట్లాడుతున్నారు సార్?"

"డిటెక్టివ్ పరశురామ్."

వెంటనే ఆమె కనక్షన్ యిచ్చింది.

"కామదేవ్ స్పీకింగ్, మిస్టర్ పరశురామ్."

"నాగేష్ ఆఫీసుకు వచ్చాడా?" అడిగాను.

"నో, సార్, రాలేదు. అతడు ప్రతిరోజూ రాడు. రోలింగ్ సేల్స్‌మన్ అతను. నెలకు రెండుసార్లు మాకు రిపోర్టు పంపుతాడు. పట్నంలో వుంటే ఎప్పుడేనా యిక్కడకు వస్తూంటాడు."

"అతడు యెక్కడున్నాడో మీకు తెలిస్తే వెంటనే నాకు ఫోన్ చేసి చెప్పండి" అని అనసూయ నంబరు యిచ్చాను.

"అలాగే చెప్తాను, సార్. ఏమైంది, అతడు దేనిలోనైనా యిరుక్కున్నాడా?" ప్రశ్నించాడతను.

"ఇంతకుముందు అతడిని గురించి యెవరేనా మీకు కంప్లెయిన్ చేశారా?"

"గత మూడేళ్ళనుంచి యెవరూ కంప్లెయిన్ చెయ్యలేదు. ఇంతకు ముందు అతడిని గురించి కొందరు మాకు ఆకాశరామన్న వుత్తరాలు రాసేవారు."

"ఏమని?"

"అతడు కాకినాడలో వున్నపుడు యెవరో యువతిని రేప్ చేశాడట. ఆమె నూతిలోపడి చనిపోయిందట. అతడిని వుద్యోగంలోంచి తీసేయమని మాకు వాళ్ళు రాశారు."

"మీరు ఏం చేశారు?"

"ఆ కంప్లెయింట్ గురించి నేనే విచారించాను. గిట్టని వాళ్ళెవరో రాసివుంటారని వదిలేశాం. అతడికి వార్నింగ్ యిచ్చాను. నాగేష్ చాలా కష్టపడి పనిచేసే మనిషి."

"ఆకాశరామన్న వుత్తరంలో ఆ అమ్మాయి పేరు

రాశారా?"

"లేదు. 1974 లో మార్చిలో అతడామెను రేప్ చేశాడట. అదే సంవత్సరం ఆగస్టులో ఆమె ఆత్మహత్య చేసుకొందిట. ఈ వివరాలు నా కింకా గుర్తున్నాయి."

"థాంక్స్ ఫర్ ది యిన్ఫర్మేషన్!" అన్నాను.

"పరశురామ్‌గారూ, పెళ్ళయినాక నాగేష్ మంచి వాడై పోయాడు. ఎవ్వరూ అతడిని గురించి చెడుగా మాకు రాయలేదు."

"మీకు నాగేష్‌తో బాగా పరిచయముందిగా?"

"అఫ్‌కోర్స్."

"అతడు బాగా తాగుతాడా?"

"క్వార్టర్ బాటిల్ వరకూ వెళ్ళగలడు. అంతకు పైన అతడు తాగడు."

"అతడిలో కిల్లర్ సూచనలు ఏమైనా మీకు కనిపించాయా?"

"అతడు పొట్టిగా, సన్నగా వుంటాడు. మాటల్తో అనేకమందిని ఆకట్టుకొనే శక్తి అతడిలో విశేషంగా వుంది. వెరీ చార్మింగ్ కాన్వర్ సేషనలిస్టు!"

అతడికి మళ్ళా థాంక్స్ చెప్పి రిసీవర్ని పెట్టేశాను.

"బ్రదర్, ఏదేనా తెలిసిందా!" అడిగాడు యిన్‌స్పెక్టర్ నాయర్.

"చక్రం తిరుగుతోంది. త్వరలో ఏదో తెలుస్తుంది," అని వేగంగా గెస్టురూమ్‌లోకి నడిచాను.

# 5

ఇన్‌స్పెక్టర్ నాయర్ తెచ్చిన పెళ్ళి ఫోటోవైపు చూశాను. నాగేష్, అనుసూయ నవ్వుతూ వున్నారు ఆ ఫోటోలో. ఫోటోను చూస్తూంటే కామదేవ్ చెప్పింది

అక్షరాలా నిజమనిపించింది.

నాగేష్ పొట్టిమనిషి కాని అతడిలో ఏదో ఆకర్షణ కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

"నాయర్ భాయ్, నాగేష్ ఫియట్ కారు ఏమైందో మనకు తెలియాలి. రాష్ట్రంలోని ప్రతివూరుకీ ఆ కారు నంబర్ వివరాలు తెలియాలి. ఆంధ్రాలో కూడా ఆ కారు కోసం పోలీసులు వెతకాలి" అన్నాను.

"అదంతా చేయిస్తున్నాను."

ఒక మనిషి వచ్చి గుమ్మంలో ఆగాడు.

"మస్తాన్, లోపలకిరా" అన్నాడు నాయర్.

వాచ్‌మన్ మస్తాన్ లోపలకొచ్చాడు. అతడు పొడుగ్గా, బలంగా వున్నాడు. ఖాకీపాంట్, ఆదేరకం స్లాక్ వేసుకొన్నాడు. చేతుల్లో లాఠీ వుంది. అతడివైపు సూటిగా చూశాను.

"నిన్నరాత్రి పరాయివాళ్ళు యెవరైనా పది తర్వాత యీ భవనంలో ప్రవేశించారా?" ప్రశ్నించాను.

"చాలామంది వచ్చి, వెళ్ళడం నేను చూశాను సార్."

తను చూసిన వ్యక్తులను అతడు వర్ణించసాగాడు.

"నాగేష్ ఫియట్ కారు రాత్రి బయటకు వెళ్ళడం నువ్వు చూశావా?"

"లేదు సార్."

"మస్తాన్, క్రితంరాత్రి పన్నెండూ, ఒకటి మధ్య అనసూయ హత్య చేయబడింది. హత్యానంతరం హంతకుడు ఫియట్ కారులో వెళ్ళాడని మా నమ్మకం. ఆ కారును చూశావా?"

అతడు జవాబివ్వలేదు.

"రాత్రిళ్ళు నువ్వు కాంపౌండులో గస్తీ తిరుగుతూ

వుంటావా?"

"వుంటాను సార్. నిన్న నా మిత్రుడొకడు కొంచెం రమ్ యిచ్చాడు. అది తాగాక నిద్రొచ్చి పడుకొన్నాను."

"నీ మిత్రుడిచ్చిన రమ్ పూర్తిగా తాగేశావా?"

"కొంచెం తాగ్గానే యెందువలనో నిద్రవచ్చేసింది సార్. ఇంకా కొంత రమ్ నా బాటిల్లో వుంది సార్."

"వెళ్ళి వెంటనే ఆ బాటిల్ పట్రా" అన్నాను.

ఇన్స్పెక్టర్ నాయర్ ఒక కానిస్టేబుల్ని అతడి వెనకనే పంపాడు. కాస్సేపట్లో ఒక బాటిల్ తెచ్చి మస్తాన్ టీపాయిమీద పెట్టాడు. రమ్ని పరీక్షగా చూశాను. అందులో ఏదో కలపబడింది. సందేహంలేదు. బాటిల్ని నాయర్కిచ్చాను.

"నాయర్ భాయ్, దీన్ని లాబ్కి పంపు. దీనిలో ఏం కలిపారో తెలుస్తుంది."

"నా మిత్రుడు అటువంటి పని చెయ్యడు సార్" అన్నాడు మస్తాన్.

"నీకీ రమ్ యిచ్చిన మిత్రుడ్ని యిక్కడకు రప్పించాలి" అర్చాను గంభీరంగా.

"వద్దుసార్" అన్నాడు మస్తాన్ గాభరాగా.

"నిజంచెప్పు! ఈ రమ్ నీ కెవరు యిచ్చారు?"

"నాగేషేనా?" అన్నాడు యిన్స్పెక్టర్ నాయర్.

నాయర్ వైపు కోపంగా చూశాను. తడువునే బ్రరవు మనం జవాబు అందించకూడదు.

"నాగేష్గారే యిచ్చారు."

"నువ్వు అడక్కుండానే అతను యిచ్చాడా?"

"రాత్రి ఆయన నడవలో వున్నారు. సలామ్ చేశాను. నీరసంగా వుంటోందని ఆయనతో అన్నాను. ఆయన నన్ను

వుండమని లోపలకు వెళ్ళారు. పాతబుడ్డీలో రమ్‌పోసి నా కిచ్చారు. కొంచెం తాగి, బాగా తిని పడుకోమన్నారు."

"తాగాక తిన్నావా?"

"నిద్ర ముంచుకొచ్చింది సార్-తిండి ముట్టుకోలేదు."

"నిన్నరాత్రి యెన్నింటికి యిది జరిగింది?"

"పది దాటింది సార్. సరైన టైము తెలియదు."

"నా గేమ్‌తో ఆ సమయంలో అనసూయ వుందా?"

"ఆమెను నేను చూడలేదు, సార్."

"నువ్వు చెప్పింది అబద్ధమైతే జైల్లో కూర్చోవలసి వస్తుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అంతా నిజం సార్."

"ఆల్‌రైట్, వెళ్ళు" అన్నాను.

మస్తాన్ వెళ్ళిపోయాడు. కన్నమ్మ మెల్లిగా గదిలోకొచ్చింది.

ఆమెవైపు పరీక్షగా చూశాను.

"కన్నమ్మా, నీకు అనసూయతో బాగా పరిచయముందా?" అడిగాడు.

"అమ్మగారు చాలా మంచోరు బాబూ. ఈ పనీ, ఆ పనీ అప్పుడప్పుడు చేసిపెట్టేదాన్ని."

"భార్యాభర్తలు యిద్దరూ పోట్లాటలు లేకుండా వుండేవారా?"

"వారిద్దరూ పోట్లాడుకోడం నేను చూడలేదయ్యా."

"ఆ పసిబిడ్డను యెవరికి అప్పగించావు?" అడిగాడు నాయర్.

"బాబు తాతగారి ఒళ్ళో వున్నాడు. ఇటుపైన ఆ బిడ్డను చూడవలసింది అయనేగా!" అందామె.

ఆమెవైపు సూటిగా చూశాను.

"నాగేష్ రాడంటావా?"

"ఏ మొహంతో వస్తారయ్యా! ఆయనే చేసేరటగా యిదంతా?"

"అని యెవరు చెప్పారు నీకు?"

"తాతగారు చెప్పారు."

"తన భార్యను చంపిన మనిషిని వెంటాడుతూ నాగేష్ వెళ్ళివుండొచ్చు. ఎప్పుడో వస్తాడు" అన్నాను.

"ఏమో బాబయ్యా యిదంతా అర్థంకావడం లేదు."

"ఇద్దరూ సుఖంగా జీవిస్తున్నారని నువ్వే అన్నావు. ఆ పరిస్థితుల్లో ఏ మొగుడూ తన పెళ్ళాన్ని చంపడుగా."

"అవుననుకోండి."

ఆమెను వెళ్ళిపొమ్మన్నాను. ఒక కానిస్టేబుల్ గదిలో కొచ్చాడు. కొన్ని బ్యాంకు పుస్తకాలను ఇన్ స్పెక్టర్ కి యిచ్చాడు. నాయర్ వాటిన్ని నాకు అందించాడు. పుస్తకాలను తెరిచి చూశాను. కళ్యాణమూర్తి యిచ్చిన డబ్బును నాగేష్ తగలేయలేదు. అనేక బ్యాంకిల్లో ఫిక్సడ్ డిపాజిట్స్‌లో రెండున్నర లక్షలికు పైన వుంది. సేవింగ్స్ అకౌంట్లలో వేలకు వేలు రొఖ్ఖంగా వుంది.

కానిస్టేబులు బయటకు వెళ్ళిపోయాడు.

"నాయర్ భాయ్, ఇల్లు, కావలసినంత డబ్బు నాగేష్ పేర్న వుంది. ఇదంతా వదిలి, భార్యను చంపి, అతడు ఏమైనట్లు?" అన్నాను.

"అవును, అది పెద్ద ప్రశ్నే" అన్నాడు నాయర్.

"ఆ ఫియట్ కారులో అతడు యెక్కువ దూరం వెళ్ళ లేడు. పోలీసులు ఆ కారును గుర్తించి ఆపుతారు" అన్నాను.

హాల్లోని టెలిఫోన్ మ్రోగింది. ఇన్ స్పెక్టర్ నాయర్

పరుగెత్తుకెళ్ళాడు. కాస్సేపట్లో అతడు తిరిగి వచ్చాడు. అతడి కంఠం కంచులా మ్రోగింది.

"బ్రదర్, ఫియట్ కారు బీచ్‌లోపల రోడ్డు మీద దొరికింది" అన్నాడతను.

"కారులో ఎవ్వరూ లేరు!" అన్నాను.

"లేరు" అన్నాడతను.

సోఫాలోంచి లేచాను.

"నాయర్ భాయ్, ఇక్కడి పని కానీ! నేను వెళ్ళి ఆ కారును చూసి తిరిగి వస్తాను" అని బయటకు పరుగెత్తాను.

## 6

బీచ్‌లో ఎవ్వరూ లేరు. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. ఫియట్ పక్కనే ఒక కానిస్టేబులు నిలబడి వున్నాడు.

డాడ్జి కారాపి దిగాను. ఫియట్ వైపు నడిచాను. కానిస్టేబులు నాకు శెల్యూట్ చేశాడు. ఫియట్ కారును పరీక్షించసాగాను. కారు ఇగ్నిషన్ కీ కారులోనే వుంది. వెనక తలుపు తెరిచి సీటును చూశాను. సీటుమీద తడిగా వుంది. సీటు పొడుగునా వుంది తడి.

మద్రాసులో గత రాత్రి వానలేదు. ఈ సీటుకు తడి యెలా వచ్చింది? సిగరెట్ పీలుస్తూ ఆలోచిస్తున్నాను. అంతా అగమ్యగోచరంగా వుంది.

వెనుకనున్న డిక్కీ తెరిచి చూశాను. అందులో స్పేర్ టైర్ తప్ప మరేమీ లేదు. డిక్కీని మూసేశాను. నాగేష్ యీ కారులో వచ్చి వుంటే అతడు బీచ్‌కి యెందుకు వెళ్ళాడు?

భార్యను చంపినందుకు విచారిస్తూ, బాధపడుతూ అతడు సముద్రంలోకి దూకేశాడా? ఆమెను చంపి తను ఆత్మహత్య చేసుకున్నాడా?

నేను చూసిన పెళ్ళి ఫోటో నాకు గుర్తొచ్చింది. నాగేష్ ఆత్మహత్య చేసుకునేరకం వ్యక్తి కాదు. పది మందిని జయించాలనే వుత్సాహం వుండే వ్యక్తి తన ప్రాణాన్ని తుదముట్టించుకోడు.

కిందకు దిగి కారు టైరవైపు చూశాను. ముందు టైర్లు యిసుకలో దిగబడి వున్నాయి.

కానిస్టేబులువైపు చూశాను.

"ఇక్కడే వుండు! కదలకు" అని హెచ్చరించాను.

"అలాగే సార్" అన్నాడతను.

డాడ్జి కారులో కూర్చుని తలుపు మూశాను. కారును వేగంగా పోనిచ్చాను. తోవలో అరుణ్ అండ్ కంపెనీ ముందు కారాపి దిగి లోపలకు వెళ్లాను. మందుల కంపెనీ, ఓపెన్ డే అండ్ నైట్.

రిసీవర్ యెత్తి అనసూయ ఇంట్లో వున్న యిన్స్పెక్టర్ నాయర్‌కి ఫోన్ చేశాను.

"హలో, యిన్స్పెక్టర్ నాయర్!"

"నాయర్ భాయ్, వెంటనే మీ ఫింగర్ ప్రింట్ మనుషులను బీచ్‌లో వున్న ఆ ఫియట్ కారు దగ్గరకు పంపు. స్టీరింగ్ వీలుమీద, తలుపుమీద వేలిముద్రలు వున్నాయేమో చూడమను" అన్నాను.

"అలాగే, బ్రదర్" అన్నాడు నాయర్.

"నీ పని యెంతవరకూ వచ్చింది?"

"శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపాను. ఇల్లంతా సోదా చేస్తున్నాం. రెండువేలపైన కాష్ వుంది. అనసూయ నగలన్నో గాడ్‌రెజ్ బీరువాలో వున్నాయి. డబ్బు కోసం యీ హత్య జరిగివుండదు. ఆమె ఒంటిమీదున్న నగలను హంతకుడు పట్టుకుపోడం విచిత్రంగా వుంది."

"నాయర్ భాయ్, ఆమె నగలు ఎల్లప్పుడూ నాగేష్ చేతుల్లో వున్నాయి. వాటిని దొంగిలించవలసిన అవుసరం అతడికి లేదు" అన్నాను.

"యూ ఆర్ రైట్" అన్నాడు నాయర్.

"నాయర్ భాయ్, మీరు సోదాచేస్తే యింకా ఏం దొరికింది?"

"ఒకమ్మాయి ఫోటో దొరికింది. ఆ ఫోటో నాగేష్ దుస్తులు కింద దాచబడివుంది. విత్ లవ్ టు నాగేష్ అని రాసి నిర్మల అని సంతకం పెట్టింది. ఫోటో వెనక జైహింద్ ఫోటో స్టూడియో, కాకినాడ అని రబ్బర్ స్టాంప్ చేయబడింది" అన్నాడు నాయర్.

కాస్సేపు నేను మాట్లాడలేదు. కామదేవ్ చెప్పిన కాకినాడ కేసు నాకు గుర్తుకొచ్చింది. ఆత్మహత్య చేసుకొన్న యువతి నిర్మలేమో!

"బ్రదర్, వున్నావా?" అడిగాడు నాయర్.

"సజీవంగా వున్నాను," అన్నాను నవ్వుతూ.

"అనసూయ బీరువాలో ఒక శాండల్ వుడ్ పెట్టె దొరికింది. దానిమీద విత్ లవ్ ఫ్రమ్ రాజా అని చెక్కివుంది. ఆ రాజా ఆమె ప్రియుడేమో!"

"నాయర్ భాయ్, చిన్నతనంలో బర్త్ డే నాడు అనేకమంది ఏవేవో బహుమతులు యిస్తుంటారు. అందరూ విత్ లవ్ అని రాస్తారు. వాటిని మరోవిధంగా మనం తీసుకోకూడదు," అన్నాను.

"నేను మరో గంటలో వెళ్ళిపోతున్నాను. ఆ లోపల నువ్వు రావాలి," అన్నాడు నాయర్.

"తప్పక వస్తాను," అని రిసీవర్ని పెట్టేశాను.

పావుగంటలో అనసూయ యింటికి చేరుకున్నాను.

నాయర్ చెప్పిన నిర్మల ఫోటోను చూశాను. ఆమె అమాయకంగా వుంది. ఏదో ఆలోచనతట్టి హాల్లోవున్న ఫోన్ వద్దకు నడిచాను. రిసీవర్ని ఎత్తి కాకినాడకు ఎస్. టి. డి. కాల్ చేశాను.

"హలో, ఇన్స్పెక్టర్ రామారావు," అందో కంఠం అటువైపునుంచి.

"పరశురామ్," అన్నాను.

"చాలాకాలం తర్వాత మీ కంఠం వింటున్నాను," అన్నాడతను.

"రామారావు, నాకు నీ సహాయం కావాలి. 1974 ఆగస్టులో ఒక యువతి నూతిలోపడి ఆత్మహత్య చేసుకుందిట మీ టౌన్‌లో. ఆమె ఎవరో కనుక్కో. ఆమెను గురించి పూర్తి వివరాలు నాకు వెంటనే కావాలి," అన్నాను.

"కనుక్కొని మీకు ఫోన్ చేస్తాను, నంబర్ చెప్పండి," అన్నాడతను.

అనసూయ టెలిఫోన్ నంబర్ చెప్పాను. మరీ ఆలస్యమైతే నా యింటి నంబర్కి ఫోన్ చెయ్యమన్నాను.

"అలాగే సార్," అన్నాడు రామారావు.

రిసీవర్ని పెట్టేసి సిగరెట్ వెలిగించాను. గెస్టురూమ్‌లోకి వెళ్ళి సోఫాలో కూర్చున్నాను.

టెలిఫోన్ మ్రోగింది. ఫోన్‌లో మాట్లాడి యిన్స్పెక్టర్ నాయర్ గెస్టురూమ్‌లోకి వచ్చాడు.

"బ్రదర్, ఫియట్ కారు స్టీరింగ్ వీల్ మీద వేలిముద్రలులేవు. ముందు తలుపులమీద కూడా లేవు. పూర్తిగా ఎవరో తుడిచేశారు." అన్నాడు యిన్స్పెక్టర్ నాయర్.

సిగరెట్ పొగ వదులుతూ నాయర్ వైపు చూశాను.

"నాయర్ భాయ్, అనసూయను చంపిన వ్యక్తి ఫియట్ కారులో పోయాడని అనుకుందాం. కత్తిపిడి మీదున్న వేలిముద్రల్ని అతడు తుడిచేయలేదు, కాని కారు స్టీరింగ్ వీల్ మీద వేలిముద్రలు లేకుండా జాగ్రత్త బడ్డాడు. ఇది చాలా విరుద్ధంగా వుంది." అన్నాను.

గదిలో పచార్లుచేస్తూ ఎంత ఆలోచించినా ఏమీ అర్థంకావడంలేదు. హాల్లోని టెలిఫోన్ మ్రోగింది. ఇన్స్పెక్టర్ రామారావేమో! నాయర్ ఫోన్ వైపు పరుగెత్తాడు.

సోఫాలో కూర్చొని మరో సిగరెట్ వెలిగించాను. ఇన్స్పెక్టర్ నాయర్ గదిలోకి రేసు హార్స్లా వచ్చాడు.

"బ్రదర్, ఏదో శవం ఒడ్డుకు కొట్టుకొచ్చిందట! బీచ్‌లో ఎవరో దాన్ని చూసి పోలీసు రిపోర్టిచ్చారు," అన్నాడు నాయర్.

నా మెదడులో ఏదో మెరిసింది. సోఫాలోంచి లేచాను.

"నాయర్ భాయ్, వెళ్దాం, పద!" అన్నాను.

డాడ్జికారును విమానంలా పోనిచ్చాను. ఇన్స్పెక్టర్ నాయర్ నా పక్కనే వున్నాడు. వెనక సీటుమీద యిద్దరు కానిస్టేబుల్స్. ఫియట్ కారును దాటి కొంచెం ముందుకెళ్ళి కారాపాను.

నాయర్, నేనూ దిగాం. సముద్రపొడ్డున కొంతమంది ప్రజలు గుమిగూడి వున్నారు. ఇసుకలో గబగబా నడుస్తూ అటువైపు వెళ్ళాను. నాయర్ నా వెనకనే వచ్చాడు.

ఒక కానిస్టేబుల్ మాకు శల్యూట్ యిచ్చి వెనక్కి జరిగాడు. ప్రజలు దూరంగా కదిలారు. తడినేల మీద గోనిసంచిలోంచి బయటకు కనిపిస్తూన్న తలకాయవైపు

చూశాను. తలను పక్కకు తిప్పాను.

నాగేష్!

అతడి ముఖానికి అనేకచోట్ల చిల్లులున్నాయి. సముద్ర చేపలు చర్మాన్ని కొరుక్కుని తినేసి వుంటాయి. సంచి లోంచి అతడి శవాన్ని బయటకు పూర్తిగా కానిస్టేబుల్ని లాగారు. అతడి ఒంటిమీద గాయాలులేవు. పొట్ట వుబ్బి వుంది. నీళ్ళలో మునిగి నాగేష్ మరణించి వుండాలి.

ఇన్స్పెక్టర్ నాయర్ వైపు చూశాను.

"నాయర్ భాయ్, యీ శవాన్ని వెంటనే పోస్టు మార్టమ్‌కి పంపించు," అన్నాను.

మరోసారి నాగేష్ శవంవైపు చూశాను.

"నేను అనసూయ ఫ్లాట్‌కి వెళ్తాను. నా కోసం ఫోన్ కాల్ రావచ్చు" అన్నాను.

"వెళ్ళు, బ్రదర్," అన్నాడు నాయర్.

అనసూయ ఇంటికి చేరుకున్నాను. మెట్లెక్కుతూంటే ఒక కానిస్టేబుల్ దిగుతున్నాడు.

"మీకోసమే చూస్తున్నాను సార్. కాకినాడనుంచి కాలొచ్చింది" అన్నాడతను.

మెట్లమ్మట పైకి పరుగెత్తాను. హాల్లోకెళ్ళి రిసీవర్ని అందుకున్నాను.

"హలో, పరశురామ్," అన్నాను.

"పరశురామ్‌గారూ, నూతిలోపడి ఆత్మహత్య చేసుకున్న యువతి పేరు నిర్మల. ఎవరో ఆమెను మోసగించారట. ఆమెకు తల్లి, అన్నా వున్నారు. నిర్మల మరణించిన తర్వాత తల్లి ఎలకలను చంపే మందుతిని చనిపోయింది. అన్న ఆ యింటికి తాళంవేసి మద్రాస్ వెళ్ళాడని పక్క వాళ్ళు చెప్పారు. అక్కడ ఏదో ఉద్యోగం చేస్తున్నా

డేమో!" అన్నాడు ఇన్స్పెక్టర్ రామారావు.

"అన్న పేరేమిటి?"

"శ్రీధర్! కొన్ని ఏళ్ళుగా కాకినాడలోని అతడి ఇల్లు తాళం వేసే వుంది. పక్కింటి రామ్మూర్తికి అతడు వుత్తరాలు రాస్తూ వుంటాడు. రామ్మూర్తిని కలుసుకుని మాట్లాడాను. శ్రీధర్ లజ్ లో వున్న దేవీలాడ్జిలో వుంటున్నాడు."

"చాలా థాంక్స్, మిస్టర్ రామారావు," అన్నాను.

రిసీవర్ పెట్టేశాను. హాల్లోంచి బయటికొచ్చాను.

నడవలో కానిస్టేబుల్ నిలబడి వున్నాడు.

"నేను కాస్సేపట్లో తిరిగివస్తాను," అని అతడితో చెప్పి మెట్లు దిగాను.

లజ్ లోని దేవీలాడ్జి కాంపౌండ్ లో కారాపి దిగాను. శ్రీధర్ గురించి లాడ్జి గుమస్తాను అడిగాను.

"పైకి వెళ్ళండి, రూమ్ నెంబర్ 10," అన్నాడతను.

మెట్లమ్మట పైకి పరుగెత్తాను. పదో నెంబరు గది ముందు నిలబడ్డాను. తలుపు మూసివుంది. వేళ్ళతో తలుపు మీద తట్టాను. లోపల్నుంచి జవాబులేదు. ఇంకా గట్టిగా తట్టాను.

కొంతసేపయ్యాక తలుపు తెరవబడింది. అమాంతంగా లోపలకెళ్ళి కాలుతో తలుపును మూస్తూ ఎదురుగా వున్న వ్యక్తివైపు చూశాను.

పాంట్, స్లాక్ లో వున్నాడతను. పొడుగ్గా బలంగా వున్న అతడివైపు చూస్తూ వుండిపోయాను.

గదిలో కిటికీదగ్గరగా మంచం వుంది. ఒక టీపాయ్ మీద రమ్ బాటిలు గ్లాసు వగైరాలున్నాయి.

"మిస్టర్ శ్రీధర్!"

"ఏం కావాలి మీకు?" అన్నాడతను బొంగురు కంఠంతో.

"సీతతో మాట్లాడాలి."

"దేన్ని గురించి?"

"నాగేష్ గురించి."

అతడు నా వైపు విచిత్రంగా చూశాడు. అతడి కళ్ళు ఎర్రగా వున్నాయి.

"గదికి తాళంవేసి నాతో రా?" అన్నాను.

మెల్లిగా బయటకొచ్చాను. అతడు నేను చెప్పిన ప్రకారం బయటకొచ్చి తలుపు మూసి తాళంవేశాడు. ఇద్దరం మెట్లుదిగి డాడ్జికారువైపు వెళ్ళాం. అతడిని ముందు సీటుమీద కూర్చోబెట్టి తలుపు మూశాను. స్టీరింగ్ వీలు వెనక కూర్చుని సిగరెట్ వెలిగించాను. తలుపుమూసి కారును పోనిచ్చాను.

అతడు నా పక్కనే మౌనంగా కూర్చున్నాడు. నాతో పోట్లాడి పారిపోవడానికి అతడు ప్రయత్నించలేదు.

మిడ్‌లాండ్ అపార్టుమెంట్స్ కాంపౌండ్‌లో కారాపి దిగాను. అతడిని పైకి తీసుకెళ్ళాను. గెస్టు రూమ్‌లోని సోఫాలో అతడు కూర్చున్నాడు. అతడికెదురుగా నిలబడ్డాను.

"నాగేష్‌ని ఎందుకు చంపావు?"

"రాస్కెల్! రేపిస్టు! వాడు నా చెల్లెల్ని రేప్ చేసి వదిలేశాడు. నిర్మల అమాయకురాలు. నూతిలోపడి చచ్చింది. తర్వాత నా తల్లి విషం తిని మరణించింది. నాగేష్‌ని చంపడం కోసమే నేనిక్కడికొచ్చాను" అన్నాడతను.

ఇన్స్‌పెక్టర్ నాయర్ గదిలో కొచ్చాడు. సోఫాలో

వున్న శ్రీధర్ వైపు ఆశ్చర్యంగా చూశాడు.

"నాయర్ భాయ్, అతడే హంతకుడు. శ్రీధర్!" అన్నాను.

ఇన్స్పెక్టర్ నాయర్ అతడి చేతులకు బేడీలు వేశాడు. కానిస్టేబుల్స్ గోడవారగా నిలబడ్డారు.

"సిగరెట్ ప్లీజ్" అన్నాడు శ్రీధర్.

అతడి పెదిమలమధ్య సిగరెట్ వుంచి, వెలిగించాను. పొగవదుల్తూ శ్రీధర్ కూర్చున్నాడు.

"అనసూయను ఎందుకు చంపావు?"

"ఆమెను చంపాలనే వుద్దేశం నాకు లేదు. బేదింగ్ టబ్ లోని నీళ్ళలో ముంచి, గట్టిగా నొక్కిపెట్టి ఆ దుర్మార్గుడిని చంపేశాను. ఆమె నన్ను చూసింది. అందు వలన ఆమెను కత్తితో పొడిచి చంపవలసి వచ్చింది."

"తర్వాత కత్తిపిడిమీద నాగేష్ వేలిముద్రలు వుండే టట్లు చూశావు!" అన్నాను.

అతడు తలాడించాడు.

"ఈ నేరం నాగేష్ చేసినట్లు పోలీసులు అనుమా నించాలని ఎంతో శ్రమపడ్డావు!" అన్నాను.

శ్రీధర్ నావైపు చూసి పిచ్చిగా నవ్వాడు.

"నా పగ తీర్చుకున్నాను. నేను ఏమైనా నాకు బెంగలేదు," అన్నాడతను.

జేబులోంచి పాకెట్ తీసి సిగరెట్ వెలిగించాను.

"నాయర్ భాయ్, ఐ టేక్ లివ్ ఆఫ్ యు," అని నాయర్ తో చెప్పి బయటకు నడిచాను.

—: ఐ పో యి ం ది :—

# (పదమూడవ భాగం)

తర్వాత—.... వెల్లకిలా పడివున్న ఓ మానవాకారన్ని దాటుకుంటూ అడుగులేసాడు రాణా.

అది ఆడో, మగో, చచ్చిందో, బ్రతికిందో, రాణా ఆగి చూడలేదు.

చచ్చిపోయిన మరో కుక్క మృతదేహాన్ని తింటున్న ఓ కుక్కను చూసి గాభరాగా దాటాడు రాణా.

ఆ శునకం ఒక్క క్షణం తలపైకెత్తి లోలోపల మొరుగుతూ సూటిగా చూసింది రాణావైపు, నోరుసాచి కోరలు కార్తుండగా.

ఆ శునకం అతనిమీద తిరగబడలేదు.

కాని తదేకంగా చూస్తుండిపోయింది అతను తిరిగి పొగమంచులో మాయమయ్యేంతవరకూ.

ఊపిరి పీల్చడం కష్టమౌతోంది రాణాకి.

కల్మషమైన గాలిపీల్చడంవల్లనో, లేక తను చూసిన దుర్భర సన్నివేశాలవల్లనో—అర్థంకాలేదు అతనికి.

మరో అరగంట గడిచిన తర్వాత యెదురుగా వున్న బైకుల్లా బ్రిడ్జి చూసి, రాణా కళ్ళు మెరిసాయి.

ఆయాసంతో రొప్పుతూ కళ్ళు చిట్లించి ముందుకు చూసాడు.

తనకోసం ప్రభుత్వం పంపిన వాహనం ఏదీ?

వంతెన యెక్కి నడవసాగాడు రాణా, పొగమంచు లోంచి-వాహనం ఆకారం కోసం ఎదురుచూస్తూ.

అకస్మాత్తుగా అతని ఎదురుగా రెండు హెడ్‌లైట్స్ వెల్గాయ్, పొగమంచుని ఛేదించుకుంటూ.

నీడలా కనబడుతూ విచిత్రంగా వున్నది ఓ వాన్.

రాణా సంతృప్తిగా నిట్టూర్చాడు.

అదే తనకోసం ఎదురుచూస్తున్న మిలటరీ వాన్!

ఇంజన్ హోరు వినిపించింది రాణాకి.

మరుక్షణం అది అతనివైపు దూసుకుంటూ వచ్చింది.... కాని, అది అతని చుట్టూ ఓ రౌండ్ కొట్టి, రెట్టింపైన వేగంతో తిరిగి వెనక్కి దూసుకుపోయింది.

విషయం అర్థమైంది రాణాకి.

అతని కడుపులో ఎవరో కెలికినట్లయింది.

వాన్ అందుకోవాలని, దానివైపు గుంపులుగా వస్తున్న పిచ్చివాళ్ళను అది పర్వతంలా ఢీకొంది.

కొన్ని దేహాలు బరువైన ఆ వాహనం కింద పడి నలిగి పోయాయి.

మరికొన్ని శరీరాలు, ఆ తాకిడికి రబ్బరు బొమ్మల్లా అటూ ఇటూ, విసురుగా ఎగిరిపడ్డాయి.

వాన్ రివర్స్ అయి, రాణావద్దకు వేగంగా వచ్చి సడన్ బ్రేక్‌తో రక్కున ఆగింది.

కుడివైపు వున్న చిన్న తలుపు తెర్చుకుని-లోపల్నుంచి గరగర శబ్దం వినిపించింది.

"సారీసర్! వాళ్ళకంటే మీరు చాల ముఖ్యం. అలా చేయక తప్పలేదు. లేకపోతే మీరు వాన్‌లో ప్రవేశించడం దుర్లభమయ్యేది. ప్లీజ్ గెటిన్-మనకి టైంలేదు."

నడుం బాగా వంచి, ఆ యిరుకైన ఖాళీలోంచి, ఎలాగో ఆ టాంకులాంటి వాహనం లోపలకి ప్రవేశించ గలిగాడు రాణా.

డ్రైవింగ్ సీట్లో వున్న వ్యక్తికేసి తేరిపార జూశాడు రాణా.

అతని ఆకారం విచిత్రంగా వుంది.

మరమనిషిలా వున్నాడతను—సురక్షిత లోహపు దుస్తులతో, తలకు పెద్ద హెల్మెట్ తో.

హెల్మెట్ కి యెటాచ్ చేయబడుంది ముఖం మీద మాస్క్. ఆ వ్యక్తి కళ్ళు స్పష్టంగా కనబడలేదు రాణాకి.

నోటివద్దవున్న మౌత్ పీస్ లోంచి గరగర వినబడింది అతని కంఠం. "క్లోజ్ ది డోర్ సర్! ఆ పిచ్చివాళ్లలో ఎవరో—ఒకరుగాని, యింకా మరికొంత పొగమంచు గాని లోపలికి ప్రవేశించడం మనకు మంచిదికాదు."

అతను చెప్పినట్లుగాచేసి, ఆ ఆకారంవైపు తిరిగాడు రాణా.

"నన్ను ఎక్కడికి తీసుకెళ్తున్నావ్?" అడిగాడు.

"మీరే చూస్తారు," జవాబు వొచ్చింది "నా పేరు డోగ్రా. మనం కరచాలనం చేసుకునే అవకాశంలేదు. ఈ గ్లవ్స్ అలాంటివి. మీ గురించి నేను చాల వర్రీ అయ్యేను. యుగాలతరబడి వేచి ఉన్నట్లనిపించింది."

"దార్లో చాల ప్రమాదాలు ఎదురైనాయ్" అన్నాడు పొడిగా రాణా అలసటగా సీట్లో వెనక్కి జారబడుతూ, "మనం ఎటువైపు వెళ్ళాలి?"

"ఒక్క క్షణం సర్! మిమ్మల్ని పికప్ చేసుకున్నట్లు వాళ్ళకి మెస్సేజ్ పంపాలి."

డోగ్రా—ఎదురుగా వున్న ఓ స్విచ్ నొక్కి, హాండ్ స్పీకర్ లాంటి అవసరంలేకుండా—మాట్లాడాడు.

తన 'మిషన్' యింతవరకూ, నిర్విఘ్నంగా కొనసాగిందనీ, వెంటనే 'బేస్'కి వస్తున్నామనీ రిపోర్టు చేసాడు.

పని పూర్తిచేసి వెనక్కి తిరిగాడు.

"సర్! ఇఫ్ యు డోంట్ థింక్ అదర్ వైజ్ ...."

మిమ్మల్ని డ్రైవ్ చేయవల్సింది గా కోరుతున్నాను. ఇలాంటి వెహికిల్స్ నిజాన్కి దట్టమైన పొగమంచులో ప్రయాణించడాన్కి వీలుగా వుండవు. కాబిన్ లోపల ఉన్న చిన్న చిన్న రంధ్రాలనుబట్టి ఆ విషయం మీరు గ్రహించి వుండాలి. ఈ సూటువల్ల నాకు డ్రైవ్ చేయడం మరీ యిబ్బంది. ఈ స్పాట్ చేరుకోడాన్కి నాకు చాలా సేపు పట్టింది అప్పుడు - మాస్క్ హెల్మెట్ ధరించకుండా డ్రైవ్ చేసినాసరే. మళ్ళీ యిప్పుడు హెల్మెట్ తీసి డ్రైవ్ చేయడం నాకు ప్రమాదకరం,తలుపు తీసినపుడు కొంత విష మేఘం లోపలికి ప్రవేశించి ఉంటుంది కాబట్టి.

"ఈ సూటు సీసంతో చేసిందేనా?"

"ఎస్—సర్! అందుకే కదలడాన్కి యింత యిబ్బందిగా వుంది. రేడియేషన్ నుండి ప్రొటెక్షన్ కోసం ధరించాల్సి వచ్చింది. మొత్తం వాన్ కంతటికీ ఈ ప్రొటెక్షన్ ఉంది."

"రేడియేషన్?"

"అవును. దీన్ని డివాస్టేషన్ వెహికిల్ అంటాం. చాల శక్తివంతమైనది. త్వరలో మీకా వివరాలు తెలుస్తాయి."

అటూ ఇటూ చూసాడు రాణా.

రకరకాల యంత్ర పరికరాలు, సాధనలు, మీటలు ఉన్నాయి చుట్టూ.

"దీన్ని డ్రైవ్ చేయడం నాకు చేతకావొద్దూ?"

"ఓహ్! ఆ యంత్రాల్ని చూసి మీరు భయపడకండి. వాహనం నడవడానికీ, దానికీ ఏం సంబంధంలేదు. నిజానికి మిగతా కార్లకన్నా దీన్ని నడపడం ఈజీ! మొత్తం అంతా ఎలక్ట్రిసిటీమీద నడుస్తుంది. ఒక పెడలు నొక్కితే

ఆగుతుంది. అంతే! కమాన్ సర్. మీ కోసం చాలామంది ఆతృతగా యెదురు చూస్తున్నారు."

§ § §

రాణా, డోగ్రా సూచనలు పాటిస్తూ ఆ ప్రత్యేక వాహనాన్ని నావల్ భవనాలకు ఎడం ప్రక్కగా తిప్పాడు.

వాన్ కొద్దిసేపట్లో ఓ పెద్ద కార్లషెడ్ లాంటి దాంట్లోకి నడిచింది.

లోపల అంతా చీకటిగా వుంది.

హెడ్లైట్ల వెలుతురులో ముందుకు పోనిచ్చాడు రాణా.

రెండు క్షణాల్లో....

ఎదురుగా ఓ బలిష్టమైన కాంక్రీట్ గోడ అడ్డంగా ప్రత్యక్షమైంది.

డోగ్రా, ఓ స్విచ్ నొక్కి కొన్ని పదాలు ఉచ్చరించసాగాడు, అర్థంకాని భాషలో.

ఆ మాటలు కోడ్లో వున్నాయని గ్రహించాడు రాణా.

ఉన్నట్లుండి గోడ హఠాత్తుగా సీలింగ్లోకి పైకి లేచింది.

వెనక, వెడల్పాటి వరండా.

డోగ్రా, రాణా చేతిమీద చేయివేశాడు. అతని హెల్మెట్ తల ఊగింది.

రాణా వాన్ని ముందుకి ఉరికించి, లోపల ఆపాడు.

వెనువెంటనే 'వెనుక' గోడ సర్రున క్రిందికి దిగి, యథాప్రకారం ద్వారం మూసుకుపోయింది.

ఒక్క నిముషంపాటు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు.

ఎదురుగా గోడ అకస్మాత్తుగా పైకిలేచింది.

ఈసారి ఎదురుగా ప్రత్యక్షమైనది డిమ్‌లైట్ల వెలుగులో ఉన్న కారిడార్.

అప్పుడే తెరుచుకొన్న ఆ బూడిదరంగు గోడ, సుమారు పదెనిమిది అంగుళాల వెడల్పులో వున్న బలిష్టమైన లోహపు గోడగా గుర్తించాడు రాణా.

కారిడార్ మెల్లగా పల్లంలోకి దిగుతున్నట్లు గ్రహించాడు రాణా.

మరో రెండు గుమ్మాలు దాటింతర్వాత వాన్ బ్రహ్మాండమైన ఓ వెడల్పాటి హాల్లో ప్రవేశించింది.

పావుమైలు ప్రయాణించిన తర్వాత తాము ఆ ప్రదేశం చేరుకోగలిగామని అంచనా వేసుకున్నాడు రాణా.

అచ్చం తాము ప్రయాణించిన వాన్‌లాగే వున్న మరో వాన్ ఓ వారగా పార్క్ చేయబడి వుండడం గమనించాడు రాణా.

అప్పటిదాకా ఎదురుచూస్తున్న బూడిదరంగు సూట్లలోని వ్యక్తుల గుంపు ముందుకు కదిలింది చేతుల్లోని స్ప్రే(SPRAY) గన్‌లతో.

మరుక్షణం, వారి చేతుల్లోని స్ప్రే గన్‌లనుండి స్పష్టంగా కనబడిన ద్రవం—ఆ రెండు వాహనాల మీదా సర్రున చిమ్మసాగింది.

"ఒక్క క్షణం కదలకుండా కూర్చోవాలిసర్" చెప్పాడు డోగ్రా "మొదట టన్నెల్ ప్రవేశించగానే మనం "డీ—కంటామినేట్" చేయబడ్డాం. అంటే మననుండి యితరులకు ఎట్టి అంటువ్యాధి సోకే ప్రమాదం లేదన్నమాట. వెహికిలుపై యిప్పుడు వారు చేసేది మరో ముందు జాగ్రత్త చర్య. యింకా జాగ్రత్తకోసం మూడోసారి—

మనల్ని స్ప్రే చేస్తారు బయటికి వెళ్ళేముందు."

"వాట్ డజ్ దట్ మీన్?" అన్నాడు రాణా కన్‌ఫ్యూజ్ అవుతూ.

"ఈ భూగర్భ రహస్య స్థావరం మొత్తం స్టెరైలు చేయబడింది. అంటే ఈ ఏరియాలో వొక్క సూక్ష్మ క్రిమి కూడా ఉండదు! లోపలికి ప్రవేశించే ప్రతి వ్యక్తినీ, ప్రతి వస్తువునీ, పరిశుభ్రం చేస్తారు, అంటువ్యాధి సోకించే ప్రమాదం లేకుండా. ఈ అధునాతన స్థావరంలో మూడు వందలమంది వ్యక్తులు పది సంవత్సరాలదాకా క్షేమంగా నివసించవొచ్చు.

భూగర్భంలో యిరుకుగా దాన్ని నిర్మించడంవల్ల ఏ సూక్ష్మక్రిమి లోపల ప్రవేశించినా, అది దావానలంలా వ్యాపించే ప్రమాదం వుంది. అందుకే ఈ ప్రికాషనరీ మెసర్స్."

రాణా ఆశ్చర్యంగా అతనివేపు చూసేడు. "పదేళ్ళే మిటి? జస్టు వాట్ ది హెల్ ఈజ్ దిస్ ప్లేస్?"

"....ఐ థాట్ యూ న్యూ దట్....మీకు చెప్పారనుకున్నాను వాళ్ళు."

నెమ్మదిగా, తల అడ్డంగా ఊపాడు రాణా.

"ప్రభుత్వానికి యిది ఫాలౌట్ (FALL OUT) షెల్టర్‌లాంటిది. ప్రపంచ దేశాలన్నీ అణుబాంబుల నిర్మాణానికి అర్రులు చాస్తున్న విషయం మీకు తెలుసు. చైనానుంచి ఈ ప్రమాదం ఇండియాకుంది. ఈమధ్య అరబ్ దేశాలు పాకిస్తాన్‌ను ప్రోత్సహించి 'ఇస్లామిక్ బాంబ్'ను తయారు చేయడానికి పురిగొల్పుతున్నాయ్, ఆరి కసహాయం ఆశ చూపుతూ. ఈ విధంగా ఎప్పటికైనా భారతదేశం, శత్రువులనుండి ఈ ప్రేలుడు ప్రమాదాన్ని

ఎమర్జెన్సీ వస్తే యిక్కడ ఆశ్రయం తీసుకుంటారు, ప్రభుత్వంలోని ముఖ్యమైన వ్యక్తులు. అరవై అయిదో సంవత్సరంలో ఈ అండర్ గ్రౌండ్ బిల్డింగ్ కన్‌స్ట్రక్షన్ ప్రారంభమైంది. యింకా మార్పులు, చేర్పులు జరుగుతున్నాయ్. యిక్కడ్నుంచి అసెంబ్లీ భవనానికి రహస్య సొరంగ మార్గం ఉంది."

రాణా నవ్వాడు అదోలా, "యిలాంటివేమైనా ఇంకా ఉన్నాయా? ఐ మీన్.... సాధారణ ప్రజలకోసం."

"ముఝే నహీ మాలూమ్ సర్. యిలాంటి విషయాలు రహస్యంగా వుంటాయి. మహారాష్ట్రలో యిలాంటి స్థావరం మరోటిలేనట్లు మాత్రం నాకు తెలుసు. ఢిల్లీలో వొకటుంది. యింకా ముఖ్యమైన నగరాల్లో యిలాంటి అండర్ గ్రౌండ్ షెల్టర్స్ నిర్మించబోతున్నట్లు చూచాయగా తెలుసు."

"కానీ యివన్నీ ప్రత్యేక వ్యక్తుల రక్షణకే. అవునా?"

"అరవై కోట్ల ప్రజలందరికీ సరిపోయేలా ఈ స్థావరాలు నిర్మించడం అసంభవం! కాదంటారా?"

రాణా బలంగా నిట్టూర్పు వదిలాడు. "నిజమే. కాని నువ్వు స్పెషల్ వ్యక్తిగా యిందులో ప్రవేశార్హత ఎలా సంపాదించగలిగావ్, అన్నదే నా అనుమానం."

డోగ్రా టాపిక్ మార్చాడు. "మనం యిక బైటికి వెళ్లాలి, సర్!"

కొంత సేపటికి, నీలిరంగు గ్వాలియర్ సూటుమీద ఎర్రని నెక్ టై ధరించిన ఓ యువకుడు ప్రత్యక్షమై రాణాని కారిడార్లగుండా ముందుకు నడిపించసాగాడు.

అతను ప్రశాంత గంభీర స్వరంతో రాత్రి ఏమి జరిగిందో, ప్రభుత్వం తీసుకున్న చర్యలేమిటో, చెప్పాగా

స్పష్టంగా వివరిస్తున్నాడు రాణాకి నడుస్తూ.

అతని మాటల ప్రకారం....

ప్రధాన మంత్రి అక్కడే వున్నారు, చాలమంది కేంద్రమంత్రులతో సహా. ప్రమాద ప్రాంతానికి దూరంగా ఉండకుండా ఆయన ప్రత్యేకశ్రద్ధ తీసుకుని బొంబాయి లోని సురక్షిత స్థావరంనుండి ఆదేశాలు జారీ చేస్తు న్నారు.

ఆ అండర్‌గ్రౌండ్ భవనంలో ప్రపంచం నలుమూాల లకూ మాట్లాడడాన్కి వసతులున్నాయి.

ప్రత్యేక యంత్రాలతో కూడిన వార్ రూమ్ (War Room) కూడా వుంది అక్కడ.

దానికి ప్రత్యేక విద్యుచ్ఛక్తి సప్లయి వుంది. ప్రత్యేక టెలిఫోన్ ఎక్స్ఛేంజి ఉంది. (రాణాకిప్పుడు అర్థమైంది వాళ్ళు విషమేఘంలో చిక్కుకోకుండా తనని ఎలా కాంటాక్టు చేయగలిగారో)

ఆర్మీ యిప్పుడు బొంబాయి పొలిమేరల్లో ఉన్నది, ఆదేశాలకోసం ఎదురుచూస్తూ.

కాని చాలమంది ప్రధాన సైన్యాధికారులు రహస్య స్థావరంలోనే ఉన్నారు — ప్రధానమంత్రి రూపొం దిస్తున్న కార్యచరణ పథకాలకు సలహాలిస్తూ—

ప్రొఫెసర్ అశ్వత్థామ అక్కడే వున్నాడు వేగంగా పెరిగిపోతున్న విషమేఘం మీద కొత్త సిద్ధాంతాలు యితర సైంటిస్టులతో కలిసి పరిశోధిస్తూ.

డాక్టర్ జులేఖా కూడా అక్కడేవుంది చాలామంది విషమేఘం బాధితులకు ట్రీట్‌మెంట్ యిస్తూ—

యిద్దరూ కారిడార్లగుండా నడుస్తుండగా, రాణా చాలామంది తెలుసున్న ముఖాలను గుర్తుపట్టాడు.

అక్కడున్న వారిలో చాలామంది ధనవంతులు, (కొందరు సినీనటులు కూడా) కావడంతో రాణా మస్తిష్కంలో రకరకాల అనుమానాలు పొడసూపాయి.

వాళ్ళు ఈ రక్షణ స్థావరంలోకి ప్రవేశించి విషమేఘం బారినుండి ప్రాణాలు కాపాడుకోవడానికి డబ్బు వెదజల్లారా?

లేక ప్రభుత్వ అధికారులకు కొన్ని విధాలుగా యింతకుముందు సహాయపడి—యిప్పుడు ఈ విధంగా ప్రతఫలం తీసుకుంటున్నారా!

ఆ ప్రతిఫలం—ప్రపంచాంతం రోజున ప్రాణాల్ని రక్షించుకోవడమే.

చాలమంది—

స్త్రీలు, పురుషులు....

దిగ్భ్రమగా కారిడార్లలో చతికిలబడివున్నారు, పాలిపోయిన ముఖాలతో .... కొందరు స్త్రీలు కన్నీటి ధారలతో....

వారిలో చాలమంది—ప్రక్కగా నడుచుకుంటూ పోతున్న రాణావైపు—అసక్తిగా చూడలేదు.

కొందరు మాత్రం—స్నేహితుణ్ని లేదా బంధువుని గుర్తించడాని కన్నట్లు తాపత్రయంగా అతనివేపు చూసారు.

మరికొందరు—రాణావైపు అసూయగా చూసారు. ఆ వ్యక్తి ఏదో ఘనకార్యం సాధించడాన్కి వెళ్తున్నట్లు తమకు ఆ పరిస్థితిలో గుర్తింపు లేనందుకు .... జెలసీ ఫీలవుతూ....

"సరైన సమయంలో యింతమందిని యిక్కడికెలా చేర్చగలిగారు?" అడిగాడు రాణా, ప్రక్కగా నడుస్తున్న

నీలిరంగు సూటు వ్యక్తిని.

"ఒక నిర్ణయం ప్రకారం" పరుసుగా వచ్చింది జవాబు.

"ఏమిటా నిర్ణయం?"

"మొత్తం బొంబాయి నగరంలోని జనాభానంతటినీ ఆదుకోడం అసాధ్యం. అలా ప్రయత్నించినా రెస్క్యూ ఆపరేషన్‌కి విఘాతం కలిగే అవకాశం వుంది, ప్రజల్లో చెలరేగిన భయాందోళనవల్ల. దీనివల్ల కొంతమంది ముఖ్యమైన వ్యక్తుల్ని...."

రాణా తటాలున నీలం సూటు వ్యక్తిని ఆపేశాడు చేయిపట్టుకుని. "యు మీన్ దె డిడింట్ ట్రై? అమాయకంగా నిద్రపోతున్న ప్రజలని విషమేఘ రాక్షసికి వదిలిపెట్టి...."

"ఆఫ్‌కోర్స్ దె ట్రైడ్!" విసురుగా అన్నాడు ఆ యువకుడు. "కాని వాళ్ళు కామన్ సెన్స్ ఉపయోగించారు. మూడోవంతు సైనిక బలగం—ప్రజల్ని హెచ్చరించి ఈ సురక్షిత స్థావరాన్ని తరలించడానికి కృషి చేసింది. మిగతా బలగం అది చేయగలిగినంతా చేసింది. వేలాది మంది ట్రక్కుల్లో బొంబాయి చుట్టుప్రక్కల ప్రాంతానికి పారిపోయి ప్రాణాలు రక్షించుకున్నారు ఆర్మీవల్లే. బట్ బొంబే ఈజ్ ఎ బిగ్ ప్లేస్ యు నో. కామన్ సెన్స్‌తో ఆలోచించాలి" చెయ్యి విదిలించుకుని, ముందుకి నడిచాడు ఆ యువకుడు.

నోరు తెర్చుకుని నిలబడ్డ రాణా, రెండు క్షణాల తర్వాత కోలుకుని, అతన్ని అనుసరించాడు.

ఎవరిపనుల్లో, వారు నిమగ్నులై వున్న మేధావులతో, అధికారులతో, కిటకిటలాడుతున్న ఓ పెద్ద హాలువద్దకు నడిచారిద్దరూ.

రకరకాల ఎలక్ట్రానిక్ ఎక్విప్‌మెంట్స్‌తో, లైటింగ్‌తో వెలుగుతూ గోడలకున్న మాప్‌లతో, టెలివిజన్ తెరలతో నింపబడి హడావుడిగా ఉందా స్థలం, ప్రపంచ యుద్ధాన్కి సన్నద్ధమౌతున్నట్లు.

అండర్ గ్రౌండ్ పైన జరుగుతున్న సర్వనాశనం వాళ్లెవరూ పూర్తిగా అర్థం చేసుకోలేరు అనుకున్నాడు రాణా.

ఆ మారణహోమం ప్రపంచంలో జరుగుతున్నట్లుగా వుంది. టెలివిజన్ తెరలు బూడిదరంగులో శూన్యంగా ఉన్నాయ్.

ఈపాటికి పట్టణమంతా అలుముకున్న ఉన్మాద తీవ్రత హత్యాకాండ, ఆత్మహత్యాకాండ—యివేమీ వాళ్ళు అర్థం చేసుకోలేరు.

వాళ్ళంతా షాక్ అయివుండొచ్చు. నిజమే.

కాని తీవ్రమైన ఆందోళన, దుఃఖం వారి ముఖాల్లో కనబడటంలేదు.

దాంట్లో వారి తప్పేమీలేదు.

జరిగిన దారుణాలు—అసాధారణ సంఘటనలు.

ప్రపంచంలో మునుపెన్నడూ జరగనివి.

మాహిమ్ దుర్ఘటన గురించి వారికి తెలుసు.

ఎయిర్ క్రాష్ సంఘటన వారికి తెలుసు.

కాని జరిగిన సత్యాన్ని వారి అంతరాత్మలు ఎలా వొప్పుకోగలవు?

తానొక్కడు మాత్రమే పరిస్థితి తీవ్రతను 'పూర్తిగా' అర్థం చేసుకోగలడు....నమ్మగలడు.

జరిగిన దారుణానికి మొట్టమొదటి సాక్షి తనే కాబట్టి.

చాల దురదృష్టకరమైన, భయంకరమైన పరిస్థితుల్ని తాను అనుభవించడం జరిగింది కాబట్టి.

"దిస్ వే, మిస్టర్ రాణా!" నీలం సూటు వ్యక్తి కంఠం, రాణా ఆలోచనల్ని భగ్నం చేసింది.

రాణా సాయుధుడైన సైనికుడు కాపలాకాస్తున్న గుమ్మంముందు నిల్చొని వున్నాడు.

ప్రశ్నార్థకంగా చూస్తూ లోపలికి ప్రవేశించాడు రాణా.

"యిదే ప్లానింగ్ హాల్" చెప్పాడు నీలం సూటు వ్యక్తి. "ప్రధానమంత్రి యిప్పుడు స్వయంగా నీతో మాట్లాడతారు."

* * *

స్పెషల్ వాన్‌ని తిరిగి భూగర్భ రహస్య స్థావరం లోంచి బైటికిపోనిచ్చాడు రాణా.

వాహనం మళ్ళీ బొంబాయి వీధుల్లో, పొగమంచు లోంచి దారిచేసుకుంటూ ప్రయాణిస్తోంది.

"సర్!" డోగ్రా రాణా భుజంమీద చేయివేసి పిల్చాడు. "మనం 'అక్కడికి' చేరుకున్నాక మీరే నాకు సహాయపడాలి. ఈ మాస్క్‌తో, హెల్మెట్‌తో, ఈ రకం దుస్తులతో నేను ఫ్రీగా కదల్లేను. కళ్ళు అక్కడ అస్సలు కనబడవ్" అన్నాడు ఆందోళనగా.

"మునుపటంత దట్టంగాలేదు యిప్పుడు పొగమంచు" వ్యాఖ్యానించాడు రాణా.

"నిజమే. విషమేఘం పలచబడుతోంది ప్రక్కలకు ప్రయాణిస్తూ. కాని విషమేఘంలో యింకా చెప్పుకో దగిన కదలికలేదని రిపోర్ట్స్ చెబుతున్నాయ్. లుక్ సర్, మనం అక్కడ ఎక్కువసేపు విషమేఘంలో వుండాల్సిన అవుసరం లేదు. నిముషంలో ఆ విషమేఘం శాంపిల్‌ని మన కంటైనర్స్ పీల్చుకుంటాయి. మనం తిరిగి వెంటనే

ఈ స్పెషల్ వాన్ ఎక్కివచ్చేయ్యొచ్చు. ఈ మాస్క్ ఉంటే నాకు కళ్ళు స్పష్టంగా కనబడవు. అలాగని, ధరించకపోతే నాకు ప్రమాదం. అందుకే నా భాగం డ్యూటీ నేను చేయడంలో మీ తోడ్పాటు కావాలి."

ఇప్పుడు రాణా భుజంక్రింద రహస్యంగా వున్న హోల్‌స్టర్‌లో ఓ పిస్తోలు వుంది.

ప్రధానమంత్రి ఆర్డర్స్ ప్రకారం రాణా తన ప్రాణం కాపాడుకోడంకోసం ఎవరినైనా, చివరికి అతని సహచరుడు డోగ్రాని కూడా కాల్చి చంపొచ్చు—కాదు ఖచ్చితంగా కాల్చి చంపాలి—నిర్దాక్షిణ్యంగా—అతని వల్ల రాణాకి ప్రమాదమేర్పడితే. భారత ప్రధానమంత్రి—రాణాలు సమావేశమైనపుడు ప్రొఫెసర్ అశ్వత్థామ కూడా ఆ మీటింగ్‌లో పాల్గొన్నాడు.

ప్రమాదం పెద్దదౌతోందని ఆందోళన చెందాడు అశ్వత్థామ.

బొంబాయి ఇండస్ట్రియల్ సిటీ కావడంవల్ల డేంజర్ ఎక్కువైందని వివరించాడు.

మార్పుచేయబడిన మైకోప్లాస్మా—గురించిన కొన్ని 'క్లూ'లు దొరుకుతున్నాయనీ, అయినప్పటికీ దాని శాంపిల్ తీసుకురానిదే పరిశోధన వేగం పుంజుకొనే అవకాశంలేదనీ పెదవి విరిచాడాయన.

భూగర్భ రహస్య స్థావరం నుండి బయటికివచ్చేముందు రాణా, డాక్టర్ జులేఖాను కలుసుకున్నాడు.

ఆమెలో మునుపటి ఉత్సాహంలేదు.

ఆమె అందమైన కళ్ళచుట్టూ నల్లని చారికలేర్పడాయ్. అలసటగా, నీరసంగా, వాడిన పువ్వులా కనిపించింది జులేఖా.

ఈసారి—తప్పకుండా—యింతటి వినాశాన్కి కారణ భూతమైన—ఆ విష మేఘం మధ్యగావుండే న్యూక్లియస్ నమూనాను చేజిక్కించుకోమని ఆమె రాణా చేతులు పట్టుకొని ప్రార్థించింది.

రాణా ఆమెకు ధైర్యంచెప్పి కదిలాడు. కాని—అతనికి తెలుసు. తను చేయబోయేది 'ప్రయత్నం' మాత్రమేనని.

ఇతరపరిసితులు అనుకూలించనిదే తాను సఫలంకాలేడు.

"మై గాడ్! లుక్ దేర్!"

డోగ్రా పిలుపుకు ఉలిక్కిపడి అటువేపు చూశాడు రాణా.

ఎదురుగా—దూరంగా.

గుట్టలావున్న నాలుగు మోటారుకార్లు భగభగ మండు తున్నాయి....ఆ మంటల చుట్టూ పెద్ద—మనుషులగుంపు చుట్టూ నిలబడివుంది, ఆ దృశ్యాన్ని మౌనంగా పరిశీలిస్తూ.

బయటినుంచి ఒక్కో వ్యక్తి, ఆ గుంపును చీల్చుకొని లోనికి ప్రవేశించి ఆ మంటల్లోకి దూకుతున్నాడు.

ఆ గుంపు పకపక నవ్వుతూ, చప్పట్లు కొడుతూ ఆనందిస్తోంది, ఆ తమాషాను చూసి.

తర్వాత మౌనం—

మరో వ్యక్తి తిరిగి దూకేదాకా.

"మనం ఎలాగైనా వాళ్ళని ఆపాలి!" అరిచాడు రాణా గాభరాగా, ఆ దారుణ దృశ్యంనుండి దృష్టి మరల్చలేకుండా దిగ్భ్రమగా చూస్తూ.

"నో సర్! వుయ్ హావ్ టు ఒబే ఆర్డర్స్!" కఠినంగా అన్నాడు డోగ్రా "మనం ఏ సంఘటనలోను కలగజేసుకోకూడదు."

రాణాకి వాదించడం నిరుపయోగమని తెలుసు.

డోగ్రా చెప్పింది నిజమే!

తాము తమ కప్పగించబడిన ఎస్సయన్ మెంట్ ని తల్ల క్రిందులు చేయకూడదు.

దారిలో ఎదురైన ప్రతి ఉన్మాద చేష్టలోను, కలుగ జేసుకొంటే తాము లక్ష్యాన్ని చేరేదెప్పుడు?

"ఆల్ రైట్!" గొణిగాడు రాణా, బరువుగా నిట్టూర్పు విడుస్తూ, "మనం చేయగలిగేదేమీ లేనప్పుడు ఆ దృశ్యాన్ని దూరంగా పోవడం ఉత్తమం."

డోగ్రా హృదయం తేలిక పడింది.

"చుట్టూ తిరిగి వెళ్దాం" చెప్పాడతను. "వెనక్కి పోనీండి. అక్కడ ఎడమవైపు టర్నింగ్ తిరిగితే లిబర్టీ థియేటర్ తగుల్తుంది. ఆ దారిన వెళ్దాం!"

రాణా వాహనాన్ని రివర్స్ చేసాడు, అప్పుడే వేగంగా దూసుకువస్తున్న ఓ లారీని త్రుటిలో తప్పించు కుంటూ.

లారీ రివ్వున, మంటలవైపు, మనుషుల గుంపువైపు దూసుకువెళ్ళింది.

రాణా ప్రయాణిస్తున్న వాన్—సౌండ్ ప్రూఫ్ అయినా బయట శబ్దాలు గ్రహించడాన్కి వాన్ పైటి భాగంలో అమర్చబడ్డ 'రిసీవర్లు' ద్వారా వినిపించింది— భడాలున పెద్ద చప్పుడు!

"గుడ్ గాడ్!" గాభరాగా అన్నాడు డోగ్రా, "డిసీజ్ టెర్రిబుల్!"

"యిది ప్రారంభం మాత్రమే," చెప్పాడు రాణా, "ముందు ముందు పరిసితి యింకా విషమం వౌతుంది."

రాణా అన్నట్లుగానే పరిసితి విషయమైంది. నిలు

వునా తగలబడుతున్న భవనాల్ని దాటుకుంటూ వారు ప్రయాణించారు యింకా, అక్కడక్కడ మండుతున్న కార్లను తప్పించుకుంటూ.

పిచ్చివాళ్ళ బృందాల్ని దాటుకుంటూ, పై అంతస్థుల్లోంచి దూకుతున్న మనుషులు,

ఆక్రందనలు—

నవ్వులు—కేకలు....

వికటాట్టహాసాలు....

మూలుగులు....

దాటుకుంటూ

అకస్మాత్తుగా రాణా నడుపుతున్న స్పెషల్ వాన్‌కి అడ్డంపడింది నీలంరంగు దుస్తులు ధరించిన ఓ కార్మికుల గుంపు—

"మై గాడ్! వీళ్ళంతా గవర్నర్ రోడ్డులోని పేపర్ ఫాక్టరీ కార్మికులై ఉండాలి" అన్నాడు డోగ్రా.

"అవును. వీళ్ళంతా నైట్ డ్యూటీ చేసివుండాలి.... అన్నట్లు....వీళ్ళకు, ప్రభుత్వ హెచ్చరిక అందలేదా?" అన్నాడు ఆశ్చర్యంగా రాణా.

డోగ్రా భుజాలెగరేశాడు, "మనం వీళ్ళమధ్యనుంచి డ్రైవ్ చేసుకుంటూ పోవాలి!"

అకస్మాత్తుగా వాన్ అటూ ఇటూ ఊగసాగింది.

దబదబ శబ్దం....

"వాళ్ళు వాన్‌ని తలక్రిందులు చేయడానికి ప్రయత్నిస్తున్నారు" కేక పెట్టాడు రాణా.

"డ్రైవ్!" అరిచాడు అసహనంగా డోగ్రా—బైటి నుంచి వచ్చే శబ్దాన్ని వినిపించే యంత్రాన్ని 'ఆఫ్' చేస్తూ.

మనుషుల్ని ఛేదించుకుంటూ వెళ్ళినప్పుడు బయటి

పొలికేకలు రాణా వినడం డోగ్రాకు యిష్టంలేదు.

తను చేయబోయే పని—దారుణం అని తెలిసినా, తప్పలేదు రాణాకి—బలంగా యాక్సిలేటర్ నొక్కాడు.

వాహనం చెంగున ముందుకు దూకింది.

కార్మికులు ఆ హఠాత్పరిణామాన్ని అదిరిపడుతూ వెనక్కి తూలిపడ్డారు.

కొంతమంది చక్రాలక్రింద మాయమయ్యారు.

పైకీ, కిందకీ, కుదుపుల్నిబట్టి వాన్ మనుషులమీంచి నడుస్తోందని గ్రహించాడు రాణా.

అయినా పెడల్ మీద బలంగా నొక్కి ఉంచిన కాలిని తీసివేయలేదు.

యింజన్ హోరు ఉధృతమౌతూ, వాన్ వేగం అందుకుంది టాప్ మీదకి చేరుకున్న మనుషుల్ని తూలనాడుతూ.

కోపంగా ముందుకు వస్తున్న ఉన్మాదుల్ని, రబ్బరు బొమ్మల్లా ఎగరగొడుతూ పరిగెట్టించాడు వాహనాన్ని రాణా ముందుకి.

కొంత సేపటికి పరిస్థితి మామూలు స్థితికి వొచ్చింది.

స్టీరింగ్ వీల్ మీద రాణా చేతులు వొణుకుతున్నాయ్.

తను ఎన్ని హత్యలు చేసాడు?

"స్టీరింగ్ నాచేతికివ్వండి. మీరు అలసిపోయారు" అన్నాడు డోగ్రా విషయాన్ని గ్రహిస్తూ.

"నో!" తలవిదిలించాడు రాణా "ఐ విల్ బీ ఆల్ రైట్! కూర్చొని ఆలోచనలతో బుర్ర పాడుచేసుకోనేకన్నా డ్రైవింగ్ చేయడం ఉత్తమం. నీ ఇన్స్ట్రుమెంట్స్ జాగ్రత్తగా చెక్ చేస్తూ వుండు. వాహనం కరెక్టు డైరెక్షన్‌లో వెళ్తున్నామో లేదో గమనించాల్సిన బాధ్యత నీది."

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వాఖ్యాల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చెరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 9/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టుతో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 108/-లు ముందుగా పంపవచ్చును. •



# ప్రేమలో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## ఏడంతస్తుల ఆఫీసు

ఏడంతస్తుల పెద్దభవనంలో వుంది ఆఫీసు. ఆ భవనం నిండా ఆఫీసుకి సంబంధించిన విభాగాలే చోటు చేసుకున్నాయి.

మూడో అంతస్తులో వున్న ఆరో గదిలో అరుణాచలం గుమాస్తాగా ఆ ఆఫీసులో పనిచేస్తున్నాడు. అరుణాచలానికి స్వయానా బావమరది సింహాచలం నగరం వచ్చి తన బావ అదృష్టానికి పొంగిపోయాడు.

"బావా! అంతపెద్ద ఆఫీసులో నా బోటి నిరుద్యోగికి కనీసం నౌకరు పని అయినా యిప్పించు బావా!" అన్నాడు సింహాచలం.

"అవునండీ మా తమ్ముడు ముచ్చటపడుతున్నాడు కదా! ఒకనాటికి వాడూ మీ అంతటివాడు అయితే మీ పేరు చెప్పుకుని ఒక యింటివాడవుతాడు" గారాబంగా అడిగింది అరుణాచలం భార్య.

అరుణాచలం తన భార్య కళ్ళలో కనిపించిన లాలనకి కరిగిపోయాడు. పెళ్ళినాటిరోజు తర్వాత ఆమె మొహంలో ఆ మెరుపు చూశాడు అరుణాచలం.

ఆ రాత్రంతా మేలుకుని వుండి చలాయి ఇద్దరూ తమ తలలు ఏకంచేసి పథకం చర్చించుకున్నారు. తెల్లవారి

యిద్దరూ ఆఫీసుకు బయలుదేరారు. అరుణాచలం తనసీట్లో కూర్చుంటూనే "సింహాచలం చల్లటి మంచినీళ్ళు యివ్వు" అని అరిచాడు.

సింహాచలం మంచినీళ్ళ గ్లాసుతో ప్రత్యక్షమయ్యాడు. ఆ విభాగంలో వున్న క్లర్కులు మొహాలు చూసుకుని సింహాచలం మొహంకేసి చూశారు.

"మన ఫ్యాన్ సెలవు పెట్టాడని క్రింద అంతస్తులోంచి పంపించినట్టున్నారు. ఏమోయ్ సింహాచలం!" అధికారపూర్వకంగా అన్నాడు అరుణాచలం.

సింహాచలం నిర్లక్ష్యంగా తలూపాడు.

ఆలస్యంగా ఇంటికి వచ్చిన అరుణాచలానికి సింహాచలం కాగితం యిచ్చాడు. సింహాచలానికి ఆఫీసువాళ్ళు యిచ్చిన మెమో.

అరుణాచలం తన బావమరిది భుజంతట్టి "నువ్వు యూనిఫాం వేసుకోనకుండా డ్యూటీకి వచ్చినందుకు మెమో యిచ్చారు. ఇంకేం? నీకు యిదే ఎపాయింట్‌మెంట్ ఆర్డర్. కాకీబట్టలు కుట్టించుదాం!" అన్నాడు.

ఆ తర్వాత ఏడంతస్తుల్లో యెవరో ఫ్యాన్ సెలవు పెడుతోనేవున్నారు.

—ఎమ్. సత్యవతీదేవి, విశాఖపట్టణం.

## పశు సంక్షేమం

ఓ పశువుల డాక్టరుగారు తన ప్రాక్టీసు మానేసి, క్రమాంగా రాజకీయాల్లోకి దిగి, మంత్రి అయినాడు. ఒక రోజు పశు సంక్షేమం గురించి ప్రతిపక్షాలతో తీవ్రంగా వాదిస్తున్నాడు.

"అసలు మీరు పశువుల డాక్టరేనా?" అని కోపంగా

అతిగాడు ఓ ప్రతిపక్ష నాయకుడు.

"అవును. చెప్పండి. మీకేమైనా ఒంట్లో బాగోలేదా?" అన్నాడు వెంటనే ఆ పశువుల డాక్టరుగారు.

—వెంగళ చంద్రశేఖరరావు, రామవరం.

## అతివల మధ్య ఆకతాయి

కోఠిలో బస్సెక్కాను. మౌలాలి వెళ్లాలి.

బస్సు తిలక్ పార్కు వద్ద మరింత రద్దీ అయ్యింది. లేడీస్ కంపార్టుమెంటులో ఎక్కడివాళ్ళక్కడ అతుక్కొని పోయి వున్నారు.

అందర్నీ గమనించాను. ఆడాళ్ళ మెప్పు పొందని మగాడు ఓ మగాడేనా? అందుకే వాళ్ళ మెప్పు పొందాలని తెగ ప్రయత్నిస్తున్నాను. సీటు ఖాళీగా వున్నా కూర్చోను. ఆడాళ్ళ పక్కనే కొద్దిదూరంలో నిలబడి వుంటాను.

చింపిరి జుట్టుగల తెల్లని షర్టు వేసుకున్న నా వయసు కుర్రాడు అంతమంది ఆడవాళ్ళ మధ్యన నలిగిపోతూ ఆనందిస్తున్నాడు. అదో సరదానేమో వెధవకి!

నాకు తెగ కోపమొచ్చింది. కోపమనే బదులు [illegible] అంటే బావుంటుంది. ఆడాళ్ళ మెప్పు పొందడానికి మాంచి ఛాన్సు!

అంతే నా బలాన్నంతటిని చేతిలో తీస్కొని వాడి మెడబట్టి నావైపు లాగాను. "కమ్ దిస్ సైడ్ మిస్టర్!" అన్నాను గద్దిస్తూ.

కీచుమంది వాడిగొంతు. నా వైపు తిరిగి "యూ స్టుపిడ్" అన్నాడు, కాదు 'అంది' కోపంగా!

అంతే! పరిగెత్తుతున్న బస్సులోంచి దూకేశాను గాభరాగా!

—ఏదెల్లి బలరామ్, అంబర్‌పేట.

